


# యువభారతి ఫౌండేషన్

**పరిచయం:** "చుట్టూరా ఆవరించుకొని ఉన్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడంకంటే, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది" అన్న వాక్యమే ఊపిరిగా 1963లో విజయదశమినాడు యువభారతి సాహితీ సాంస్కృతిక సంస్థ ఆవిర్భవించింది.

**యువభారతి పరిచయం:** ఉత్తమ సాహిత్యాధ్యయనం సమాజంలో సామరస్యాన్ని పెంపొందిస్తుంది. మనిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తమయిన ప్రతిభను వెలికి తీస్తుంది. సాత్వికతను పెంపొందించి, సగటు మనిషిని 'మనీషి'గా తీర్చిదిద్దుతుంది. అన్నది యువభారతి నమ్మకం. ఈ ఆశయ సాధనకు కడచిన 45 సంవత్సరాలుగా అనేక సాహితీ, సాంస్కృతిక కార్యక్రమాలను నిర్వహించి, 'లహరీ' ఉపన్యాస పరంపరలనేర్పాటు చేసి, ఉన్నత ప్రమాణాలుగల అనేక గ్రంథాలను ప్రచురించి, తెలుగువారి హృదయాలలో సుస్థిర స్థానాన్ని పొందింది.

**యువభారతి ఫౌండేషన్:** మీరందించిన ఈ స్థానాన్ని పదిలపరచుకొని, తెలుగు భాష, సాహిత్య, సంస్కృతులను మరింత అభివృద్ధి పరచి, తెలుగువారిలో మాతృభాషాభిమానాన్ని పెంచి, వారిని ఉత్తమ పౌరులుగా తీర్చి దిద్దడానికి ఒక శాశ్వత నిధినేర్పాటు చేయాలని భావించి, యువభారతి మిత్రులతో కలిసి, "యువభారతి ఫౌండేషన్" పేర ఒక శాశ్వత నిధిని ఏర్పాటు చేయడం జరిగింది.

మీ వంతు సహకారాన్ని మీరెలా అందించగలరు?

మీరు ఈ మా ఉద్యమంలో పాలుపంచుకోవాలనుకుంటున్నారా? అయితే మీవంతు సహాయ సహకారాలు మీరీ కింది విధంగా మాకు అందచేయవచ్చు.

- మీరు సాహితీవేత్తలు, తెలుగు భాషాభిమానులు అయితే మీ చక్కని సూచనలను, సలహాలను, మాకందించి మా కార్యక్రమాల రూపకల్పనలో మీ వంతు సహకారాన్ని మా కందించవచ్చు.
- మీరు "మాతృభాష" పై అభిమానం కలవారైతే మీ అమూల్యమైన సమయంలో కొంత సమయాన్ని "యువభారతి ఫౌండేషన్" కార్యకలాపాలనిర్వహణలో వెచ్చించి, మాతో సహకరించవచ్చు.
- మీరు ఉద్యోగ వ్యాపారాలలో తీరికలేని వారైతే "యువభారతి ఫౌండేషన్"కు విరివిగా విరాళాలనందించి ప్రోత్సహించవచ్చును. మీరిచ్చే ఎంత చిన్న మొత్తాన్నైనా, "యువభారతి ఫౌండేషన్" వినమ్రంగా స్వీకరిస్తుంది.

**యువభారతి ఫౌండేషన్**

ఇ.నం. 3-6-207/1, మక్దూం మార్గం, 15వ వీధి, హిమాయత్ నగర్,
హైదరాబాద్- 500 029. సెల్: 9247 328 440.

తెలుగు సాహితీవేత్తలు, భాషాభిమానులు, తల్లులు, తండ్రులు, గురువులు, అధికారులు, అనధికారులు, విద్యార్థులు, యువతీయువకులు యావన్మంది తెలుగువారు తమ భాషాభిమానాన్ని ప్రదర్శించి, "యువభారతి ఫౌండేషన్" కార్యక్రమాలకు తమ హార్దిక, ఆర్థిక సహాయ, సహకారాలను అందించి ప్రోత్సహిస్తారని ఆశిస్తున్నాం

యువభారతి ఫౌండేషన్ తరపున

# దాశరథి కవితా వైభవం

(దాశరథి జీవితం- కవిత్వం)


వ్యాఖ్యాత:

'సాహితీ సుధానిధి'

**డా॥ తిరుమల శ్రీనివాసాచార్య**



ప్రచురణ



రిజిష్టర్డ్ నం. 1/64

**యువభారతి**

ఆంధ్ర సారస్వత పరిషత్తు భవనములు,

తిలక్ రోడ్, హైదరాబాద్-500 001

# Dasharathi Kavitaa Vaibhavam

A commentary on the life and works of Dr. Dasarathi
By Dr. Tirumala Srinivasacharya




| | | |
|---|---|---|
| *Publication No.* | : | 182 (A Golden Jubilee publication) |
| *No. of copies* | : | 1000 |
| *First Edition* | : | 2014 |
| *Book Production* | : | 'Pustaka Shilpi'<br>**T. Muralidhar Gowd**<br>9393 176 552 |
| *Cover Design* | : | **T. Mallesh** |
| *D.T.P.* | : | **K.B.T. Kondaiah** |
| *Printed at* | : | **Karshak Art Printers**<br>(*Multicolour Printers & Designers*)<br>40-APHB, Vidyanagar, Hyderabad - 500 044<br>Ph : 040-2761 8261 |
| *For Copies* | : | **Yuvabharathi,** Andhra Saraswatha Parishat Building, Tilak Road, Hyderabad- 500 001<br><br>**Vishalandhra Book House** (All branches).<br><br>**Navodaya Book House,** Opp: Arya Samaj Mandir, Kachiguda 'X' Roads, Hyd- 500 027 |
| *Price* | : | ₹ **100/-** $ 10 |

# గ్రంథ స్వీకర్త



**విద్వద్విమర్శకులు**

**ఆచార్య ఎస్.వి. రామారావు గారు**

నిరంతర అధ్యయనవ్రతులూ
తెలుగు సాహితీ విమర్శన విశ్వశోధనమతులూ
లబ్ధకీర్తులూ మైత్రీమూర్తులూ
**ఆచార్య ఎస్.వి.రామారావు**గారికి

# అంకితం

తారల లెక్కించు బుద్ధి సారముంది మీకు
తరు పత్రాలను ఎంచే చొరవ ఉంది మీకు
ఆచార్యా! ఓ ఎస్వీ రామారావ్ గారు!
శరధి అలల గణియించే సత్తువుంది మీకు

పువ్వుకెంత పరిమళమో చెప్పగలగినారు
చిక్కువడిన సూత్రాలను విప్పగలిగినారు
ఓ విమర్శకాగ్రేసర! రామారావ్! మీరు
రాజహంసలా జగతిని బ్రతుకగలిగినారు

బీజంలో సత్వముంటె భూజంగా మారవచ్చు
బిందువులో దీక్ష ఉంటె సింధువుగా మారవచ్చు
ఈ సత్యం నిరూపించినారు మీరు రామారావ్!
పాడ్యమి చిరతపస్సుచే పౌర్ణిమగా మారవచ్చు

మొల్ల మెరుపులే తప్ప పుల్లవిరుపులే ఉండవు
చల్ల మాటలే తప్ప కల్లబొల్లులే ఉండవు
మచ్చలేని విమర్శక లోక పూర్ణ సుధాకరా!
రామారావ్! మీలోన పూలు తప్ప ముళ్లుండవు

విమర్శనా సముద్రాన ఈదగలిగినారు మీరు
విమర్శనా రసవేణువు నూదగలిగినారు మీరు
ఓ రామారావు! సాహితీ విమర్శను మథియించి
సత్య సుధా కలశాలను చేదగలిగినారు మీరు

తెలుగు సాహితీ విమర్శ పేరెత్తిన మీ పేరే
అన్వీక్షణ మభివీక్షణ మన్నప్పుడు మీ పేరే
సమవీక్షణమన్నా, మరి, మనోవీక్షణం అన్నా
తెలుగు రసిక జగతి తలచు రామారావ్! మీ పేరే

కవి విమర్శకుల తపస్సు వాగ్దేవికి అంకితం
మిత్రుల హృదయాలు రెండు స్నేహానికి అంకితం
కవి హృదయం గ్రహియించే వ్యాఖ్యాతవు రామారావ్!
'దాశరథి కవితా వైభవం' కృతి మీ కంకితం.

**డా॥ తిరుమల శ్రీనివాసాచార్య**

# స్వీకృతి

**డా॥ ఎస్వీరామారావు**
(పూర్వ) తెలుగు శాఖాధ్యక్షులు & డీన్
ఉస్మానియా విశ్వవిద్యాలయం

నిఖిలాంధ్ర ప్రజల హృదయాల్లో స్థిరంగా నిలచిపోయిన మేటి కవి దాశరథి. నిరంకుశ ప్రభుత్వాన్ని ధిక్కరించిన కవియోధుడు. ప్రజాభ్యుదయం కోసం గళమెత్తిన రసార్ద్ర హృదయుడు. నిరంతరం తిమిరంతో సమరం సల్పుతూ కాంతి కవాటాలు తెరచిన కవిసూర్యుడు. కవితాపుష్పక విహారియైన కృష్ణమాచార్యుల కలం నుంచి రససంభరితమైన పద్యకృతులు, గేయఖండికలు, వచన కవితా రచనలు జాలువారినాయి. ఆయన వివిధ ప్రక్రియా రచనలనుంచి కవితా మాణిక్యాలను ఏరి వ్యాఖ్యామృతంతో సాహితీ పిపాసువులకు అందిస్తున్నారు శ్రీనివాసాచార్యులు. దాశరథి నాటిన రుబాయీ ప్రక్రియలో పయనిస్తూ తెలుగు తోటలో కవితా సుమపరిమళాలు వెదజల్లుతున్న సుకవి డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులు. వానమామలై, దాశరథి, సినారె, వేముగంటి మున్నగు తెలంగాణా కవుల కవితాహృదయాలను వ్యాసరూపంలో ఆవిష్కరించిన విశిష్ట విమర్శకులు. గంగాతరంగాలు (కవిత్వం), వ్యాసోల్లాసం (విమర్శ) సంపుటులకు ముందుమాటలు కూర్చే అవకాశం కల్పించటమే కాకుండా తమ పేరిట ధర్మనిధి పురస్కారాన్ని నాకు అందించిన సహృదయ వతంసులు. ఇప్పుడు దాశరథి కవితావ్యాఖ్య అంకితంతో నాకు ధన్యతను చేకూర్చారు.

గోరంత దీపం కొండంత వెలుగును ప్రసరిస్తుందన్న సదాశయంలో అర్ధశతాబ్ది క్రితం నెలకొన్న సాహితీ సంస్థ యువభారతి. మహాకవులు సుకవితా మకరంద మాధుర్యాన్ని సాహితీ రసజ్ఞులకు– ముఖ్యంగా యువతరానికి చవిచూపాలన్న సంకల్పంతో సరసమైన పలు సంక్షిప్త వ్యాఖ్యానాలను వెలువరించింది. ప్రస్తుతం చిరకాల ప్రజా ఉద్యమం ప్రత్యేక రాష్ట్ర సత్ఫలాన్ని సాధించిన తరుణంలో తెలంగాణా కవుల ప్రతినిధి దాశరథి కవిత్వ వ్యాఖ్య ప్రచురణను తలపెట్టటం ముదావహం. ఈ శుభవేళ ఆనందంతో ఈ కృతిని స్వీకరిస్తున్నాను.

తేది: 13-9-2014 **డా॥ ఎస్వీరామారావు**



# స్ఫూర్తిసుధాశరధి దాశరథి

తెలుగువారి గుండెకింద చిరునామాగా నిలిచిన వీర తెలంగాణ కవివరేణ్యుడు దాశరథి. ప్రాంతాలకు అతీతమైన క్రాంతదర్శి దాశరథి.

*తెల్లవారే వేళ కమలము/ కళ్ళు విప్పేటప్పుడు*
*బాలభానుడు తొంగిచూసే/ ప్రాగ్దిశాగ్రము నా పతా*

*కరకురాళ్ళే కరుగునట్లుగ/ కవిత వ్రాసేవేళలో*
*కాంతి విరిసీ శాంతికురిసే/ కవి కరాగ్రము నా పతా*

*విప్లవము వర్ధిల్లు వేళల/ వీర వర్యుని కనులలో*
*ధగధగాయిత నవదవానల/ కీలికాగ్రము నా పతా!*

అని తన పతా (చిరునామా)ను తన కవిత్వ వ్యక్తిత్వాలకు దర్పణంగా తానే చాటుకున్న ధీశాలి దాశరథి. 'నా తెలంగాణ- కోటి రత్నాల వీణ' అంటూ ప్రకటించి నిజాం పరిపాలనలో తెలంగాణ దుఃస్థితినీ, ప్రజల ఇక్కట్లనూ గ్రహించి నాటి ప్రభుతకు వ్యతిరేకంగా 'మా నిజాం రాజు జన్మజన్మాల బూజు' అంటూ రుద్రవీణ మీటి సింహగర్జన చేసిన కవి కంఠీరవం దాశరథి. 'తెలంగాణము రైతుదే ముసలినక్కకు రాచరికంబు దక్కునే' అని తిరుగుబాటు జెండా ఎగరేసి జైలుగోడలమీద కూడా తెలంగాణ స్వాతంత్ర్య కాంక్షను నిర్భయంగా రాసినవాడు. ఆంధ్రప్రదేశ్‌కు ఆస్థానకవిగా దాశరథి తరువాత మరొకరు నియామకం కానేలేదు. దాశరథి అగ్నిధార, రుద్రవీణ, కవితాపుష్పకం, తిమిరంతో సమరం- కవితా సంపుటాలు, గాలిబ్ గీతాలకు చేసిన తెలుగు అనువాదం ఆయన సాహితీమూర్తి మత్వానికి తిరుగులేని ప్రతీకలు. ఉర్దూ గజల్, రుబాయీ ప్రక్రియలను తెలుగుకు తెచ్చి కావ్యగౌరవాన్ని కలిగించినది మొదటగా దాశరథియే. కొంతకాలం అధ్యాపకునిగా ఆపై పంచాయితీ తనిఖీ ఇన్స్‌పెక్టర్‌గా 1956 నుంచి 1963 వరకూ హైదరాబాద్‌లోనూ ఆపై 1970 వరకూ మద్రాసులోనూ ఆకాశవాణి కేంద్రంలో ప్రొడ్యూసర్‌గా పనిచేసిన దాశరథి 1961లో 'వాగ్దానం' చిత్రంతో చలనచిత్ర గేయ రచనకు శ్రీకారం చుట్టి రెండు దశాబ్దాలకు పైబడి శతాధిక చలనచిత్ర గీతాలను రచించి సినీకవిగా జనం నాల్కలమీద నర్తించే చక్కటి పాటలను సాహిత్య పరీమళాలతో అందించాడు. పొట్టివాడైనా గట్టివాడని తా నే రంగంలో నిలిచినా అందరితో ఆత్మీయంగా వుంటూ రాణించాడు.

అటువంటి దాశరథి కృష్ణమాచార్యగారి జీవితాన్నీ కవిత్వాన్నీ కూడా రాబోయే తరాలకు కూడా పఠనీయంగా ఆదర్శంగా నిలిచేలా డా॥ తిరుమల శ్రీనివాసాచార్యగారు

'దాశరథి కవితావైభవం' అనే గ్రంథాన్ని అందిస్తున్నారు. కొండను అద్దంలో పట్టి చూపడం ఆచార్యుల వారి ప్రజ్ఞే! దాశరథి జీవితంలో నిజాం నవాబుపై తిరుగుబాటు, జైలు జీవితం, విశాలాంధ్రకై చేసిన కృషి, ఆయన జాతీయదృష్టి, విశ్వమానవత ఆయన వ్యక్తిత్వం వంటి అంశాల చిత్రణతోబాటు దాశరథి కవిత్వంలోని ప్రబోధం, వర్ణణలు, ఆశావాదం, శాంతి ప్రియత్వం, లోకజ్ఞత, నిర్వచనాలు, స్వతంత్ర ప్రయోగాలు, చలనచిత్ర గీతాలు వంటి విషయాలను శ్రీతిరుమల శ్రీనివాసాచార్యగారు ఎంతో సరళ సుందరంగా, మధుర వ్యాఖ్యలతో ఈ పొత్తంలో సంతరించారు.

దాశరథి 89వ జయంతి ఉత్సవాలను భారతదేశపు 29వ రాష్ట్రంగా అవతరించిన తెలంగాణ ప్రభుత్వం 2014 జూలై 22న అధికారికంగా నిర్వహించింది. దాశరథి మహాకవి పేర ఏటా రాష్ట్రంలో ఒక ఉత్తమ కవిని ఎంపికచేసి లక్షా నూటాపదహారు రూపాయల బహుమతిని అందజేస్తామని స్వయంగా రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ కె.చంద్రశేఖరరావు ప్రకటించారు. దాశరథి స్ఫూర్తిని అందిపుచ్చుకుని రుబాయీల తెలుగు రచనా ప్రక్రియలో తెలుగులో విశిష్ట సంపుటాలనెన్నో వెలువరించిన కవితాకీర్తి శ్రీతిరుమల శ్రీనివాసాచార్య గారిదే. భాషా సంస్కృతి సంప్రదాయాలు వెల్లి విరిసేందుకు భాషాభిమానిగా, ఒక సామాన్య కార్యకర్తగా తనవంతు సహకారాన్ని అందజేస్తానని దాశరథి జయంతి సభలో ప్రకటించిన ముఖ్యమంత్రి కె.సి.ఆర్. వేదికపైనే వున్న తన గురువు శ్రీ తిరుమల శ్రీనివాసాచార్యగారికి పాదాభివందనం చేయడం ఒక అపూర్వ ఘట్టం! 'తెలంగాణ కోసం తొలి దెబ్బ తిన్న తొలివ్యక్తి కవి దాశరథి' అని తిరుమల శ్రీనివాసాచార్యగారు దాశరథిపై ఈ గ్రంథం వెలయించడం గొప్ప నీరాజనం! దాశరథి స్ఫూర్తిని భావితరాలకు అందించడానికి పాఠశాల, కళాశాల స్థాయిలో ఈ గ్రంథాన్ని పాఠ్యగ్రంథంగా సంతరిస్తే ఎంతో సముచితంగా వుంటుంది. దాశరథి జీవితం, కవిత్వ పటిమ, పోరాట స్ఫూర్తి, విశ్వమానవత విలువైనవి... దాశరథి పేరున విశ్వవిద్యాలయం ఒకటి నామాంకితం చేయాలన్న ప్రభుత్వ సంకల్పం కూడా అభినందనీయం. అవన్నీ కార్యరూపం దాల్చాలని ఆకాంక్షిద్దాం. ఈ పుస్తకం దాశరథికై రూపొందించిన 'అక్షర విగ్రహం' అనవచ్చు. రచనాశిల్పి తిరుమల శ్రీనివాసాచార్యగారు. దాశరథి కవితావైభవ విశ్వరూపాన్ని ఈ గ్రంథం ద్వారా దర్శనం చేయిస్తున్న యువభారతి ప్రచురణలకు అభినందనలు. తెలంగాణ రాష్ట్ర పునర్నిర్మాణ శుభతరుణాన ఈ గ్రంథం వెలువడడం ఎంతో ముదావహం. డా॥ తిరుమల శ్రీనివాసాచార్యగారికి అభివందనాలు. రాష్ట్రప్రజల సముచిత సమాదరణకు ఈ గ్రంథం నోచుకుంటుందని మనసా విశ్వసిస్తూ...

24-7-2014

**సుధామ**

*ప్రధాన సంపాదకుడు*-**యువభారతి ప్రచురణలు**



# మా మాట

**మ**నిషిలో అంతర్లీనంగా, నిక్షిప్తంగా ఉన్న ప్రతిభా పరిమళాలు పరివ్యాప్తం కాగలిగి నప్పుడే అతని సృజనాత్మక శక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందడానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమున్నత ప్రమాణాలుగల సాహిత్యం సమాజంలో సామరస్యాన్ని పెంచుతుందన్న సదాశయంతో యువభారతి తన కార్యక్రమాలను నిర్వహిస్తున్నది. "చుట్టూరా ఆవరించుకుని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నైనా వెలిగించడం మంచిది" అన్న ధ్యేయంతో సమాజ హితంకోసం సాహిత్యాన్ని ప్రధాన సాధనంగా చేసుకుని గత ఏభై యేళ్ళలో ఇప్పటివరకు నూట ఎనభై ఒక్క ప్రచురణలను ప్రచురించింది. ప్రతి నెలా మొదటి ఆదివారం మధ్యాహ్నం 2 గంటల నుండి 5 గంటల వరకు యువత కోసం ఉచితంగా వ్యక్తిత్వ వికాస కార్యక్రమాలను నిర్వహిస్తున్నది. మూడవ ఆదివారం మధ్యాహ్నం 2 గంటల నుండి 5 గంటల వరకు సుల్తాన్ బజార్‌లోని శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలో యువకులలో వచో రీతిని, రచనాపాటవాన్ని, ఆలోచనాశక్తిని, సమీక్షా సామర్థ్యాన్ని పెంచేందుకు ప్రతిభా కార్యక్రమాలను నిర్వహిస్తున్నది.

డా॥ దాశరథి కృష్ణమాచార్యులు సహజకవి, మహాకవి, విశ్వజనీన వ్యక్తిత్వం కలిగిన బహుగ్రంథకర్త. తెలుగు, ఉర్దూ, హిందీ, ఇంగ్లీషు భాషలలో పండితుడు. బాలసాహిత్య నిర్మాత, నిఘంటు కర్త, వ్యాస రచయిత. తెలంగాణ తల్లి ముద్దుబిడ్డడు. "నా తెలంగాణ కోటి రత్నాలవీణ" అని ఎలుగెత్తి చాటిన ప్రజాకవి. తన కలానికి బలం, వేగం, ఉద్యమ స్ఫూర్తీ రంగరించిన అభ్యుదయ కవి. తెలంగాణ స్వాతంత్ర్య సమరయోధుడు. "గతాన్ని కాదనలేను, వర్తమానం వద్దనబోను, భవిష్యత్తు వదులుకోను, కాలం నా కంఠమాల" అని నినదించిన విశ్వప్రజామిత్రుడు. ఆవేశం, ఉద్రేకం, ఆదర్శ ప్రతిఘటన ఆయన జీవ లక్షణాలు. పేదరికాన్ని అనుభవించిన కవి. క్షోభ లేనిదేదీ రాయలేను. అది నాకు వరం- అన్న మానవతా వాది. తెలుగు గజల్, రుబాయీల మొదటి నిర్మాత. తెలంగాణ రచయితల సంఘం వ్యవస్థాపకాధ్యక్షుడు, ఆకాశవాణి ప్రయోక్త. విశ్వవిద్యాలయాల్లో కళాప్రపూర్ణ, డి.లిట్. మొదలైన గౌరవపట్టాలు పొందిన ప్రతిభామూర్తి, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారాలతో బాటు పలు సంస్థల అనేక ఘన సన్మానాలందుకున్న కవితా సుధాశరథి. ఆతని వీణ పాటలు ప్రత్యేకతను సంతరించుకొన్నవి. తెలుగువారి నోళ్ళలో ఎప్పుడూ గుర్తుంచుకునే అనేక గీతాలు రచించిన విఖ్యాత సినీ కవి ఆయన. భారతదేశంలోని రాష్ట్రాలతో బాటు

అనేక దేశాలు పర్యటించి మన్ననలందిన సుకవి దాశరథి. ఇంతకుముందు యువభారతి ప్రసిద్ధకవుల కవితావైభవాలను ప్రచురించి తెలుగు సాహితీలోకంలో ప్రత్యేక స్థానాన్ని గడించింది. ఇప్పుడు మహాకవి దాశరథి 89వ జయంతి సందర్భంగా వారి కవితావైభవాన్ని తెలుగు ప్రజల కందించాలని సంకల్పించింది.

డా॥ తిరుమల శ్రీనివాసాచార్యులవారు ప్రస్తుతం యువభారతికి గౌరవాధ్యక్షులు. డా॥ ఇరివెంటి కృష్ణమూర్తి, ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారలు యువభారతి అధ్యక్షులుగా నున్నప్పుడు ఆచార్యులవారు ఉపాధ్యక్ష పదవిని నిర్వహించి సంస్థ పురోగమనానికి తన సహాయ సహకారాలు అందించారు. తరువాత సంస్థ అధ్యక్షులై సమర్థంగా కార్యక్రమాలు నిర్వహించారు. వీరు పద్య గేయ వచన కవితా విశారదులు. ముఖ్యంగా తెలుగు రుబాయీల రచనలో సిద్ధహస్తులు. ఆదర్శ అధ్యాపకులు. జనరంజకంగా ఉపన్యసించగల పండితులు. మహాకవి దాశరథిపై అనర్గళంగా, ఆధికారికంగా ప్రసంగించగల మహావక్త, మనస్వి, స్నేహశీలి. వివిధ సంస్థలనుండి ముప్పైకి పైగా పురస్కారాలందుకున్న ప్రతిభామూర్తి. బహుగ్రంథకర్త. యువభారతి ప్రత్యేక ఆకాంక్షపై సుమారు 60 పద్యాలకు సమగ్ర వ్యాఖ్యను రచించి దాశరథి కవితావైభవాన్ని ప్రచురణకోసం అందించారు. వారికి యువభారతి హృదయపూర్వక కృతజ్ఞత లందజేస్తున్నది.

ఈ పుస్తక ప్రచురణలో సహకరించిన మా గౌరవసభ్యులు పద్మభూషణ్ డా॥ కె.ఐ.వరప్రసాదరెడ్డిగారికి, తెలంగాణ ప్రభుత్వ సలహాదారులు డా॥ కె.వి. రమణ (ఐ.ఏ.ఎస్. రిటైర్డ్) గారికి ప్రత్యేక కృతజ్ఞతలు. ఈ గ్రంథానికి తమ ప్రకటనను అందచేసి, సహకరించిన తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ సమాచార పౌరసంబంధాల శాఖ కమీషనర్ గారికి మా ప్రత్యేక ధన్యవాదాలు.

ఈ పుస్తకాన్ని అందంగా ప్రచురించిన కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్ వారికి, ముఖ్యంగా అధినేత శ్రీ జగన్మోహనరెడ్డిగారికి, పుస్తక ప్రచురణలో పూర్తి సహకారాన్నందించిన 'పుస్తకశిల్పి' శ్రీ తాళ్ళపల్లి మురళీధరగౌడుగారికి, డి.టి.పి. చేసిన శ్రీ కె.బి.టి. కొండయ్యగారికి, చక్కటి ముఖచిత్రాన్ని రూపొందించిన శ్రీ టి.మల్లేశ్‌గారికి మా కృతజ్ఞతలు. మా పూర్వ ప్రచురణలలాగే ఈ దాశరథి కవితావైభవాన్ని కూడా సహృదయ పాఠకులందరూ ఆదరించి, మమ్మాశీర్వదించవలసిందిగా కోరుకుంటూ...

కృష్ణాష్టమి
17.8.2014

మీ
**మాడభూషి అనంతాచార్య**
అధ్యక్షుడు, **యువభారతి**, హైదరాబాదు

# విషయ సూచిక

# I. దాశరథి జీవితం

**దా**శరథి పూర్తిపేరు దాశరథి కృష్ణమాచారి. దాశరథి అనేది వారి ఇంటి పేరు. దాశరథి క్రోధననామ సంవత్సర శ్రావణ శుక్ల విదియ బుధవారం సరియగు తేది: 22-7-1925 నాడు, ఖమ్మం జిల్లాలోని 'చినగూడూరు' గ్రామంలో జన్మించాడు. దాశరథి తల్లి శ్రీమతి వేంకటమ్మగారు, తండ్రి శ్రీ వేంకటాచార్యులుగారు. దాశరథి జ్యేష్ఠ పుత్రుడు; ఆతని సోదరుడు దాశరథి రంగాచారి. విశిష్టాద్వైత సిద్ధాంత ప్రవక్తలైన శ్రీమద్రామానుజాచార్యులవారి ప్రధాన అంతరంగిక శిష్యులలో ఒకరైన 'దాశరథి' అనే వ్యక్తివల్ల, ఆతని సంతతివారి కందరికీ 'దాశరథి' అనే వంశనామం ఏర్పడింది.

దాశరథిగారిది శ్రీవైష్ణవ కుటుంబం, శ్రీవత్స గోత్రం. దాశరథిగారిది పండిత వంశం. కలిగిన కుటుంబం కాదు. దాశరథి తండ్రి వేంకటాచార్యులు గొప్ప సంస్కృత విద్వాంసులు. మద్రాస్ విశ్వవిద్యాలయంలో 'విద్వాన్' యోగ్యతను సంపాదించారు. వారు ఉయభ వేదాంత నిష్ణాతులు. 'దాశరథి' అనే మాసపత్రికను కూడా నడిపారు. దాశరథి తల్లి వేంకటమ్మగారికి తెలుగు కావ్యాలతో చక్కని పరిచయముండేది. ఆమె హృదయం మానవతకూ ప్రేమకూ నిలయం. ఇలాంటి పాండిత్య వాతావరణంలో దాశరథిగారి బాల్యం గడిచింది.

బాల్యంలో దాశరథి విద్యాభ్యాసం తండ్రి వద్ద సాంప్రదాయిక పద్ధతిలో జరిగింది. తండ్రి వేంకటాచార్యులు ఛాందసులు. ఈ ఛాందసబుద్ధి దాశరథికి నచ్చేది కాదు. తండ్రి సన్నిధిలో దాశరథి పంచకావ్యాలు, వైద్యగ్రంథాలు పఠించాడు. 'కాదంబరి' వంటి జటిల వచన కావ్యంలోని గద్యభాగాలు, 'బిల్హణీయం'లోని శ్లోకాలూ, దాశరథికి ఆ వయస్సులోనే కంఠపాఠంగా వచ్చేవి. కవితాచమత్కారం కలిగిన వైద్యగ్రంథ శ్లోకాలు తెలిసీ తెలియని ఆ వయస్సులో ఉన్న దాశరథికి బాగా నచ్చేవి. సంస్కృత భాషా సంస్కారాన్ని తండ్రి నుంచి గ్రహించిన దాశరథి, తల్లినుంచి తెలుగు కావ్య పరిమళాలను సంగ్రహించి తన ఎదలో పొదుగుకున్నాడు. తెలుగు ప్రబంధ కవితా మరందాలను ఆస్వాదించాడు. దాశరథి 'చినగూడూరు'లోని ప్రాథమిక పాఠశాలలో నాల్గవ తరగతి పూర్తి చేశాడు. మాధ్యమికోన్నత పాఠశాల విద్యాభ్యాసం కోసం ఖమ్మంలోని 'ఉస్మానియా

హైస్కూల్‌లో చేరాడు. దాశరథి విద్యాభ్యాసమంతా ఉర్దూలోనే జరిగింది. ఆ పాఠశాలలోనే డి. రామలింగం, హీరాలాల్ మోరియా, ఎం.ఎల్. నరసింహారావు మున్నగువారు దాశరథికి మిత్రులయ్యారు. ఆ పాఠశాలలో చదువుతున్న కాలంలోనే కృష్ణమాచారి అనే పేరుకు బదులుగా దాశరథి అనే ఇంటిపేరునే తన పేరుగా మార్చుకోవడం జరిగింది. బాల్యంనుంచి దాశరథి స్వాభిమానం కలిగిన వాడు; అర్థించే గుణం లేనివాడు; దారిద్ర్యబాధలను అనుభవించి, సహించి, ధైర్యంగా నిశ్చలంగా ఉండేవాడు. ఆతడు ఏడవ తరగతి చదువుతున్నప్పటి నుంచి, తోటి విద్యార్థులకు ఇంగ్లీషు వ్యాకరణం, ఉర్దూ ట్యూషన్ చెప్పి, వచ్చిన డబ్బులతో ఆర్థిక పరిస్థితిని చక్కదిద్దుకొనేవాడు. పుస్తకాలూ పత్రికలూ కొనుక్కొని విద్యాతృష్ణను తీర్చుకొనేవాడు. కష్టాలకు కుంగిపోకుండా, వాటిని నిర్భయంగా ఎదుర్కొని మరింత వినూతన చైతన్యాన్ని పొందేవాడు. దాశరథి ఖమ్మంలో, ఒకవైపు పాఠశాలలో చదువు కొనసాగిస్తూనే, మరోవైపు కేశవార్యశాస్త్రి అనే పండితునివద్ద సంస్కృతవ్యాకరణం నేర్చుకునేవాడు. 'సిద్ధాంత కౌముది'లో కొంతభాగాన్ని అధ్యయనం చేయడమే కాక, ఆ శాస్త్రిగారి వద్ద వేదాలనూ, ఉపనిషత్తులకు సంబంధించిన విషయాలను తెలుసుకొనే వాడు. శాస్త్రిగారి వ్యక్తిత్వ ప్రభావం దాశరథిపై ప్రసరించింది. ఇలా ఒకవైపు ఉపనిషద్ వ్యాఖ్యానాలను వింటూనే, మరోవైపు పద్యాలల్లేవాడు దాశరథి. కవిత్వ రచనలోనే కాకుండా, క్రీడలలోనూ ఆసక్తి కలిగినవాడు దాశరథి. 1940లో దాశరథి Sack-race (సంచి పరుగు పోటి)లో పాల్గొని పాఠశాలలో ప్రథముడుగా వచ్చాడు. ఆ తరువాత వరంగల్లులో జరిగిన సుబా టోర్నమెంటులో ప్రథమ బహుమతిని గెలుచుకొన్నాడు. అప్పటి సుబేదారు (గవర్నరు) దాశరథికి చాలా ఖరీదైన 'రాజా' పెన్నును బహుమతిగా ఇచ్చాడు. ఆ పెన్నుతోనే కవిత వ్రాశాడు దాశరథి. ఆ కవితలోని కొన్ని పంక్తులివి-

*"గోనె సంచి పరుగుల పోటి- భలే మంచి ఆటల పోటి*
*బొక్క బోర్లా పడ్డా డొకడు- ముక్కు పగిలి ఏడ్చా డొకడు*

*............................................................*

*అవమానం ఒకడికైతే - సమ్మానం ఇంకొక్కడికి*
*గెలిచినోడు నవ్వాలా? - ఓడినోడు ఏడ్వాలా?*
*నేడు గెలుపు రేపు ఓటమి- నేడోటమి రేపు గెలుపు*
*అదేరా జీవితం- మరి ఎందుకు ఏడవటం?"*

ఆ చిన్న వయసులోనే దాశరథికి జీవితం పట్లగల అవగాహనను ఈ పంక్తులు సూచిస్తున్నాయి.

దాశరథి హైస్కూల్‌లో చదువుతున్నప్పుడు 'జక్కీ సాహెబ్' అనే ఉపాధ్యాయుడు ఉర్దూ, ఫారసీ బోధించేవాడు. ఆతడు పాఠాలు చెప్పుతూనే, మహాకవి మీర్జా గాలిబ్ రచించిన కవితా పంక్తులను వినిపించి, వాటి కవిత్వ సౌందర్యాన్ని వివరించేవాడు. ఆ కవిత్వం వింటూ, దాశరథి తన్మయుడై ఊహాలోకాల్లో విహరించేవాడు. తరగతిలోనికి పోకపోయేవాడు. ఆ రోజుల్లో ఏడవ నిజాం మీర్ ఉస్మాన్ అలీఖాన్ రచించిన ప్రార్థనా గీతాన్ని విద్యార్థులు పాఠాలు ప్రారంభించకముందే ఆలపించాలని ఆదేశం ఉండింది. నిజాం ప్రభువు హైదరాబాదును నిరంకుశంగా నలిపివేస్తున్నాడు అనే భావం కలిగిన దాశరథికి ఆ ప్రార్థనా గీతం నచ్చలేదు. దానిని ఆలపించలేక ప్రధానోపాధ్యాయునిచేత దెబ్బలు తినేవాడు. ఆతనికి నిజాం పట్ల ద్వేషమే కాని, ఉర్దూభాష పట్ల ద్వేషం లేకుండింది. బడిలో జక్కీసాహెబ్ గాలిబ్ గీతాలతోపాటు, మహాకవి ఇక్బాల్ విప్లవ గీతాలను వినిపించేవాడు. ఆ గీతాలు విన్నప్పుడు దాశరథి హృదయం ఉద్రేకంతో పొంగిపోయేది. ఇక్బాల్ కవిత్వంలోని విప్లవాగ్ని దాశరథి వ్యక్తిత్వాన్ని ప్రభావోపేతం చేసింది. మరోవైపు 'చూడామణి' అనే ఆతని బంధువుల అమ్మాయి కవ్వించే చూపులను చూచి, దాశరథి ఏవో గిలిగింతలను అనుభవించేవాడు. నిజానికి శృంగారమంటే ఏమిటో తెలియని దశ అది. ఇలా అంగారమూ, శృంగారమూ సమంగా సరసంగా సమ్మేళనం చెంది దాశరథి చిత్తాన్ని చిత్రంగా ఆక్రమించాయి. తండ్రి పాండితీపటిమ, తల్లి మానవత్వం దాశరథి ఎదలో ఒదిగిపోయాయి. తనచుట్టూ ఉన్న గ్రామాలలోని దొరల దురుసుతనం, క్రౌర్యం కారణంగా ఎన్నో బాధలు పడుతున్న పేదలనూ, వెట్టిచాకిరితో కుంగిపోతున్న రైతులనూ, పన్నుల భారంతో వంగిపోతున్న ప్రజలనూ కళ్ళారా చూచిన దాశరథి హృదయం కలతపడ్డది.

*"నిండుకుండలు నీల్గుతున్నాయి- నిదురమత్తున ఒక్క మూలన*
*ఒట్టికుండలు దొర్లుతున్నాయి- ఒక్క మూలన దాహవేదన"*

ఎంత అన్యాయం? అంటూ 1935లో మొట్టమొదటిసారిగా కలంపట్టి గళమెత్తి అన్యాయాన్ని నిరసిస్తూ ఆవేదనను కవితాస్ఫోరకంగా వ్యక్తం చేశాడు దాశరథి. ఆతడు పదకొండేళ్ల వయస్సు నుంచి పద్యాలల్లడం మొదలు పెట్టాడు. 1937లో బాల

దాశరథి ఆశువుగా ఇరవైయైదు పద్యాలు చదివాడు. సభాధ్యక్షులైన సుబేదార్ నారాయణరావుగారు, దాశరథిని ఆప్యాయంగా ఆలింగనం చేసికొని, ఎత్తుకొని, వందరూపాయలు బహుమానంగా ఇచ్చారు. "ఏక్ దిన్ తెలుగు కా శాయర్ ఆజమ్ బనేగా" (ఒకనాడు తెలుగులో ప్రముఖ కవి కాగలడు) అని దాశరథిని దీవించాడు. దాశరథి తొమ్మిదవ తరగతి చదువుతున్న కాలంలో ఇంగ్లీషులోనూ కవిత్వం చెప్పాడు. దాశరథికి కవి సమ్మేళనాలంటే చాలా ఇష్టం. దాశరథి ఖమ్మంలో మెట్రిక్యులేషన్ పూర్తి చేశాడు. ఆ తరువాత దాశరథి తెలంగాణ విముక్తి మహోద్యమంలో దూకాడు. నిజాం నవాబుకు వ్యతిరేకంగా పోరాడాడు.

దాశరథి 'గార్ల' జాగీరు అధీనంలోని గ్రామాలలో ప్రజలు పడే బాధలను చూశాడు. రకరకాల పన్నులు చెల్లించలేక, వెట్టిచాకిరితో నిలువునా కుంగిపోతూ, ఆకలికి మాడిపోయే నిరుపేదల కన్నీటి బ్రతుకులను చూచి దాశరథి గుండె విలవిలలాడి పోయింది. పేదకుటుంబం నుంచి వచ్చిన ఆతని హృదయం పేదల బాధలను చూచి కరుణార్ద్రమైపోయింది. కర్కోటకులైన భూస్వాముల జాగీర్దార్ల అత్యాచారాలు, నిజాం తాబేదార్లు సాగించే హింసాకాండ, వాళ్ళు అనుభవించే అక్రమ భోగభాగ్యాలు చూచిన దాశరథి సహించలేకపోయాడు. దౌర్జన్యాలన్నింటికీ మూలమైన నిజాం నిరంకుశత్వం పట్ల ద్వేషం పెల్లుబికింది. ఆతని యువహృదయం అగ్నిగోళమై మండింది. ఆతని ఆగ్రహం కట్టలు తెంచుకుని అగ్నిధారగా ప్రవహించింది. ఇలాంటి పరిస్థితులలో ప్రజల దారుణ బాధలకు కారణభూతులైన జాగీర్దార్ల భూస్వాముల ఆటకట్టించాలనీ, భూస్వామ్య వ్యవస్థను నిర్మూలించాలనీ, రైతుల న్యాయమైన హక్కులకోసం పోరాడుతున్న కమ్యూనిస్టులను చూచాడు దాశరథి. ఆ కమ్యూనిస్టుల ఉద్యమంచేత ప్రభావితులైన విద్యార్థులను చూచాడు. నిజాం ప్రభుత్వ దౌర్జన్యాన్ని ప్రతిఘటించాలని నిశ్చయించు కొన్నాడు. ప్రజలందరూ ప్రకృతి సంపదను సమంగా అనుభవించాలనే తన లక్ష్యం వంటి లక్ష్యంతో పోరాడే కమ్యూనిస్టులతో కలసిపోయాడు దాశరథి. కార్యకర్తగా కావ్యకర్తగా పనిచేయడం ప్రారంభించాడు. శ్రీ గోరంట్ల రాఘవరావుగారితో కలసి జాగీరులోని కుగ్రామాలన్నీ తిరిగాడు. ప్రజలను ప్రబోధించాడు. గూడేలలోని కోయ పడుచుల ఇళ్ళల్లో జొన్న గటకతిని, ఆకలి చల్లార్చుకొని, వారిని ఐక్యపరుస్తుండేవాడు. లంబాడీలు, హరిజనులు, రైతులు, కూలీలు, యువకులూ- అంతా ఉద్యమంలో

చేతులు కలిపేవారు. తరువాత దాశరథి మానుకోట, ఖమ్మం, ఇల్లెందు తాలూకాలోని చాలా గ్రామాలకు తన ఉద్యమాన్ని విస్తరింపజేశాడు. భూస్వామ్య వ్యవస్థనూ, జాగీర్దార్ల పెత్తందారీ తనాన్నీ, నిజాం నిరంకుశత్వాన్నీ ప్రతిఘటిస్తూ, పీడిత ప్రజల భావాలకు ప్రతినిధిగా తన కలాన్ని ఝళిపించాడు దాశరథి. 1942లో కమ్యూనిస్టు పార్టీ నిర్వహించిన 'సెల్' సమావేశాలకూ, అండర్‌గ్రౌండ్ (అజ్ఞాత) సమావేశాలకూ ఆతడు హాజరయ్యాడు. నిజాంకు వ్యతిరేకంగా రచించిన అనేక గేయాలలో అధిక భాగం ఆతడు ఈ సందర్భంలో రచించినవే. ఆతని గేయాలు తీవ్రవాదులను బాగా ఆకర్షించేవి. 'రక్తారుణ వైజయంతి' 'అనంత సంగ్రామం' 'రణఝణ రణఝణ'– వంటి కవితలు దాశరథిపైగల మార్క్సిజం ప్రభావాన్ని సూచిస్తున్నాయి. అభ్యుదయ కవిత్వ ప్రవక్తలైన శ్రీశ్రీ ప్రభావం దాశరథిపై ప్రసరించింది. తన మిత్రులైన కవిరాజమూర్తి (సర్వదేవభట్ల నరసింహమూర్తి), హీరాలాల్ మోరియా, బొమ్మకంటి సత్యనారాయణరావు, కొమరగిరి నారాయణరావు, పెరవెల్లి వెంకట్రామయ్య, తుమ్మశేషయ్య, కొండపల్లి గోపాలరావు, తీగెల సత్యనారాయణరావు– మున్నగువారితో కలిసి దాశరథి ఉద్యమంలో పాల్గొనేవాడు. ఆనాడు– ఉద్యమ ధ్యేయం ఒక్కటే కాబట్టి ఆంధ్ర మహాసభలలో కాంగ్రెస్‌వారు కమ్యూనిస్టువారు కలిసే పనిచేసేవారు.

దాశరథి ఆంధ్ర సారస్వత పరిషత్తు సభలలో కూడా పాల్గొని, ప్రజలను ప్రబోధించేవాడు. 1944లో ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రథమ వార్షికోత్సవాలు ఓరుగల్లు కోటలో, శ్రీ సురవరం ప్రతాపరెడ్డిగారి అధ్యక్షతన నిర్వహించబడ్డాయి. సభలకు సాహితీవేత్తలు, కవులూ అనేకులు వచ్చారు. కవుల కలాలకూ గళాలకూ భయపడిన నిజాం ప్రభుత్వం రజాకార్లను ఉసిగొల్పింది. రజాకార్లు ఉక్రోషంతో పందిళ్ళను తగులపెట్టారు. అయినా కవిసమ్మేళనం జరిపితీరవలసిందే అన్నారు. సురవరం ప్రతాపరెడ్డిగారూ, దేవులపల్లి రామానుజరావుగారూ, దాశరథిని సంప్రతించారు. అప్పుడు దాశరథి– "జ్వాలలో ఆహుతి అయిపోతాంగాని కవి సమ్మేళనం జరిపితీరుతాం" అన్నాడు. కాలిపోయిన పందిళ్ళ బూడిద వేడిగా ఆతని అరికాళ్ళకు తగులుతుండగా, నిర్భయంగా గళంవిప్పి దాశరథి–

*"ఓ పరాధీన మానవా! ఓపరాని*
*దాస్యము విదల్చలేని శాంతమ్ము మాని*

తలుపులను ముష్టిబంధాన కలచివైచి
చొచ్చుకొని పొమ్ము స్వాతంత్ర్య సురపురమ్ము"

అంటూ చదివాడు. దాశరథి పద్యాలు విని ప్రతాపరెడ్డిగారు "సింహగర్జన చేశావు నాయనా!" అని ప్రశంసించారు. రామానుజరావుగారు దాశరథిని కౌగిలించుకొని పూలమాలవేశారు. సభా జనాన్నీ వారి కోలాహలాన్నీ చూచి, రజాకార్లు తోక ముడిచారు. మంచిర్యాలలో జరిగిన ఆంధ్ర సారస్వత పరిషత్తు సభ కవిసమ్మేళనానికి దాశరథి అధ్యక్షత వహించాడు.

1944 నుంచి దాశరథి ఆంధ్రమహాసభలలో పాల్గొన్నాడు. దాశరథి మహాకవి మఖ్దూం మొహియుద్దీన్ కవితలను తెనిగించి చదివేవాడు. అలాగే దాశరథి కవిత్వాన్ని మఖ్దూం ఉర్దూలోకి అనువదించి వినిపిస్తుండేవాడు.

ఒకరోజు మానుకోట తాలూకాలోని 'జయ్యవరం' గ్రామంలో జరిగిన రాత్రి సభలో పాల్గొని, తెల్లవారేసరికి తన జన్మస్థలమైన గూడూరుకు చేరుకొన్నాడు. అప్పటికే గూడూరి దొర ద్వారా వర్తమానం అందుకొన్న పోలీసులు, దాశరథి భోజనం చేస్తుండగా తలుపుతట్టి అరెస్టు చేశారు. ఆ రాత్రి కటకటాల వెనుక గడిపాడు దాశరథి. తెల్లవారుజామున దాశరథి చేతులకు బేడీలు, నడుముకు తాడు కట్టి, తుపాకులతో ఇద్దరు పోలీసులు వెంట నడుస్తూ, పదిమైళ్ళ దూరంలో ఉన్న 'నెల్లికుదురు' పోలీస్ స్టేషన్‌కు తీసికొని వెళ్ళారు. దాశరథిని కాపలా కాసే పోలీసులు తిండి ప్రయత్నంలో ఉండగా, దాశరథి తప్పించుకొని, పరుగెత్తుతూ నడుస్తూ ముప్పైమైళ్ళ దూరంలో ఉన్న 'నాగారం' అనే గ్రామం చేరుకొన్నాడు. అప్పటినుంచి దాశరథి వేషం మార్చుకొని, నైజాం ప్రభుత్వానికి చిక్కకుండా తన కార్యక్రమాన్ని కొనసాగించాడు. ఇలాంటి విప్లవ కరమైన వాతావరణంలో కూడా దాశరథి కవిత్వ రచన కొనసాగించాడు. అందుకే ఆతని జీవితానికీ కవిత్వానికీ తేడా లేదు.

1945-46 ప్రాంతంలో, దాశరథికి కమ్యూనిస్టులతో అభిప్రాయభేదాలు ఏర్పడ్డాయి. ఆ తరువాత భారత యూనియన్‌లో హైదరాబాదు రాష్ట్రం విలీనం కావడానికి మహోద్యమాన్ని సాగిస్తున్న స్టేట్ కాంగ్రెస్‌లో చేరాడు దాశరథి. స్వామీ రామానందతీర్థ నాయకత్వంలో జమలాపురం కేశవరావు, కొండా వెంకటరంగారెడ్డి,

మాడపాటి హనుమంతరావు మొదలగువారితో కలసి స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొన్నాడు. మిత్రుడైన హీరాలాల్ మోరియాతో తన జిల్లాలో పనిచేయడం ప్రారంభించాడు. స్వాతంత్ర్యోద్యమ ప్రముఖుడైన జమలాపురం కేశవరావుగారితో ఊరూరా తిరుగుతూ మహాసభలలో పాల్గొన్నాడు దాశరథి. విప్లవాత్మక గేయాలతో పద్యాలతో ప్రజలను ఉత్తేజితులూగించాడు. ఆతనివెంట ప్రముఖ పాత్రికేయులు తాళ్ళూరి రామానుజస్వామి, అయోధ్య రామకవి మొదలగువారు సభలలో పాల్గొనేవారు. సాధారణంగా సభలలో కార్యక్రమాలు దాశరథి వ్రాసిన – "ఓ నిజాము పిశాచమా... నా తెలంగాణ కోటి రత్నాల వీణ", "ఇదే మాట ఇదే మాట పదే పదే అనేస్తాను" అనే పద్య గేయాలతోనే ప్రారంభమయ్యేవి. సర్దార్ జమలాపురం కేశవరావు గారు దాశరథినీ తాళ్లూరి రామానుజస్వామినీ కోహినూరు వజ్రాలకంటే విలువైన వారనీ ప్రశంసించేవారు. దాశరథి ఒకనాటికి మహాకవి అవుతాడని సభలలో చెప్పుతుండేవారు ఆయన.

భారత దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించింది. కాని నిజాం మాత్రం తాను స్వతంత్రుడనని ప్రకటించుకొన్నాడు. అంతేకాదు– భారత పతాకం తన రాష్ట్రంలో ఎగురవేయడం నేరమని ప్రకటించాడు. స్టేటు కాంగ్రెసు సత్యాగ్రహాన్ని ప్రారంభించింది. ఇది చూచి రజాకార్లు మరింత విజృంభించారు. తన వైతాళిక గీతాలను వినిపిస్తూ అప్పటిదాకా అజ్ఞాతంగా ఉన్న దాశరథి బాహాటంగా బయటకు వచ్చి నిజాం నిరంకుశత్వాన్ని నిరసించాడు. "ఇదేమాట ఇదేమాట పదే పదే అనేస్తాను... నీకు నిలుచు హక్కు లేదు– నీ కింకా దిక్కులేదు– దిగిపోవోయ్ తెగిపోవోయ్– తెగిపోవోయ్ దిగిపోవోయ్– ఇదే మాట ఇదేమాట– పదే పదే అనేస్తాను" అంటూ ఉద్యమ కవితావేశ మూర్తియై ముక్తకంఠంతో పర్జన్యంలా గర్జించాడు. సత్యాగ్రహానికి తలపడ్డాడు. ఇన్నాళ్ళుగా పొంచి ఉన్న పోలీసులు దాశరథిని 'గార్ల' గ్రామంలో పట్టుకొని నిర్బంధించారు. ఉద్యమ రహస్యాలను చెప్పుమని ఠాణాలో నిలబెట్టి కొరడాలతో కొట్టారు. అక్కడినుంచి 1947 సెప్టెంబరులో వరంగల్ సెంట్రల్ జైలుకు పంపించారు. అక్కడ దాశరథికి నిజాం ప్రభుత్వం పదహారు (16) నెలల కఠిన కారాగార శిక్ష విధించింది.

దాశరథిని వరంగల్ జైలులో ఉంచినప్పటికీ ఆ ప్రాంతం అతనికి చిరపరిచితమై నందువల్ల పారిపోతాడేమో అనే అనుమానం చేత దాశరథితోపాటు మరో 30 మందిని

1947 డిసెంబరులో నిజామాబాదు జైలుకు పంపించాలని నిర్ణయించారు జైలు అధికారులు. వరంగల్ జైలులో ఉడికీ ఉడకని సిమెంటు కలిపిన జొన్న రొట్టెలు తిని దాశరథి జీర్ణకోశం అప్పటికే చెడిపోయింది. దాశరథి ఖైదీమిత్రులతోపాటు పోలీసు వ్యానులో ఎక్కాడు. చలిగాలి వీస్తుంటే, 'చలి గాలి' అనే పదంతో ప్రారంభమయ్యే ఇరవై ఏడు కందపద్యాలు ఆశువుగా చెప్పాడు దాశరథి. పోలీసులు ఖైదీలను కాజీపేట రైల్వే జంక్షనులో దింపి, సికింద్రాబాదుకు పోయే రైలు ఎక్కించారు. మిత్రులతో పాటు 'వందేమాతరం' అంటూ దాశరథి రైలు ఎక్కాడు. 'చలి గాలి'ని గూర్చి మళ్ళీ పద్యాలందుకున్నాడు. రైలు సికింద్రాబాదు చేరింది. అక్కడినుంచి నిజామాబాదు వెళ్ళే రైలెక్కారు. నిజామాబాదు స్టేషను చేరుకోగానే, ఒక దండు వచ్చి ఖైదీలను చితక బాదింది. అక్కడి పోలీసులు కూడా వచ్చి కొట్టారు. పెదవులపై రక్తం కారగా, దాశరథి పత్రికలతో తుడుచుకొన్నాడు. అందరితోపాటు దాశరథి నడుచుకుంటూ అలసిపోయి కొండమీది జైలుకు చేరుకొన్నాడు. అది రాజకీయ ఖైదీలుండే జైలు. ఆ జైల్లో 700 మంది రాజకీయ ఖైదీలుండేవారు. వారందరికీ అన్నింటికీ ఒకే నీటి పంపు ఉండింది. జైలు బయటి వార్తలు లోపలికి రాకుండా తీవ్రమైన కట్టుదిట్టాలుండేవి. సెన్సార్ నిబంధనలుండేవి. జైలుకు వచ్చిపోయే మంగలివాని ద్వారా, అప్పుడప్పుడు ఖైదీలకు బయటి వార్తలందుతుండేవి. ఒకనాడు పళ్ళుతోముకోవడానికి ఇచ్చే బొగ్గుతో దాశరథి జైలు గోడమీద–

"ఓ నిజాము పిశాచమా? కానరాడు
నిన్ను బోలిన రాజు మా కెన్నడేని
తీగెలను తెంపి అగ్నిలో దింపినావు
నా తెలంగాణ కోటి రత్నాల వీణ"

అనే పద్యం వ్రాశాడు. జైలు అధికారులు వెంటనే ఆ పద్యాన్ని చెరిపివేశారు. ఆళ్వారుస్వామి అనే దాశరథి మిత్రుడూ త్యాగమూర్తీ దేశభక్తుడూ ఆ పద్యాన్ని వేర్వేరు గోడలమీద మళ్ళీ మళ్ళీ వ్రాసేవాడు. దానిని అధికారులు తుడిచివేసేవారు. ఆ పద్యాన్ని దాశరథే మళ్ళీ మళ్ళీ వ్రాస్తున్నాడని జైలు అధికారులు అభిప్రాయపడ్డారు. అలా ఆ పద్యం ఖైదీల మనః కుడ్యాలపై భద్రంగా ముద్రితమైంది. ఆళ్వారుస్వామీ దాశరథీ

ఆ జైలులో మూడు మాసాలు కలసి ఉన్నారు. తరువాత ఆళ్వారుస్వామిని గుల్బర్గా జైలుకు మార్చివేశారు.

నిజామాబాదు జైల్లో ఉడికీ ఉడకని రెండు జొన్న రొట్టెలూ, పప్పుచారు ఇచ్చేవారు. రొట్టెల్లో సిమెంటు, సున్నం కలిపేవారు. ఆ భోజనం చేత దాశరథి ఆరోగ్యం చెడిపోయింది. వైద్యసదుపాయం లేక దాశరథి మృత్యుంజయుడైన శివునిమీద నలభై పద్యాలు చెప్పాడు ('అగ్నిధార' లోని 'సంధ్యాలయమూర్తి' శీర్షికలోని పద్యాలు కొన్ని అవే). పద్యాలు చెప్పగానే కుంభవర్షం కురిసింది. ఆ పరమశివుని కృపచేత దాశరథి జ్వరం తగ్గిపోయింది. అలా ఖైదీలెవ్వరికి జ్వరం వచ్చినా దాశరథి శివుని పద్యాలు చదివేవాడు. వారి జ్వరాలు తగ్గిపోయేవి. దాశరథి చిన్ననాడు నేర్చుకొన్న వైద్యగ్రంథశ్లోకాలు చదివి మిత్రులను ఆనందింపజేసేవాడు జైల్లో.

దాశరథి నిజామాబాదు జైల్లో ఉన్నప్పుడు 1948 జనవరి 11వ తేదీనాడు ఒక దారుణ సంఘటన జరిగింది. రాత్రి 8 గంటల సమయం, ఖైదీలు తమ తమ బ్యారక్స్‌కు వెళ్ళుతున్న సమయం అది. మసక మసక చీకటి, గుడ్డిలాంతర్ల వెలుగు. అప్పుడు రజాకార్లు గుంపులుగా పథకం ప్రకారం జైల్లో ప్రవేశించి, కఱ్ఱలతో ఇనుప చువ్వలతో కత్తులతో బల్లాలతో ఖైదీలను కొట్టడం మొదలుపెట్టారు. వందలాది మంది తలలు పగిలాయి, కాళ్ళు చేతులు విరిగాయి. కొందరి ప్రాణాలు పోయాయి, ఈ సంఘటనలో దాశరథికి తలమీద పది దెబ్బలు పడ్డాయి. తల పగిలిపోయింది. ఎడమ భుజం ఎముక విరిగింది. దగ్గరున్న చెట్టుకింద స్పృహతప్పి పడిపోయాడు. కొందరు సత్యాగ్రహులైన ఖైదీలు వంటశాలలోని కఱ్ఱలతో కాగడాలతో రజాకార్లపై ఎదురుదాడి చేశారు. డెబ్భై మంది రజాకార్లు గాయపడ్డారు. తట్టుకోలేక చెల్లాచెద రయ్యారు. ముప్పైమంది పోలీసుల కాళ్ళు విరిగాయి. నాల్గువందల మంది సత్యాగ్రహులు రక్తస్నానం చేశారు. దాశరథికి తెల్లవారు జామున స్పృహ వచ్చింది. మిత్రులు రక్తం కడిగి దాశరథి తలకు కట్టుకట్టారు. నీళ్ళు తాగించారు. దాశరథికి కడుపులో కుడివైపున దుర్భరమైన శూల మొదలైంది. ఏమీ తినలేకపోయాడు. పదకొండు రోజులు నీళ్ళూ నిమ్మరసంతో గడిపాడు. బాగా కృశించాడు. రొట్టెముక్కలు నమలడంతో దాశరథికి డొక్క నొప్పి మరింత తీవ్రమైంది. పూర్తిగా ఆరోగ్యం కోల్పోయిన దాశరథినీ మరికొందరినీ చికిత్సకోసం హైదరాబాదు సెంట్రల్ జైలు– చంచల్‌గూడాకు

మార్చాలని ప్రభుత్వం నిర్ణయించింది. దాశరథితోపాటు ఐదుగురు ఖైదీలు 1948 జనవరి 30నాడు హైదరాబాదు జైలుకు బయలుదేరే సయయంలో మహాత్మాగాంధీ హత్యవార్త అందింది. దాశరథి ప్రయాణం రద్దయింది. ఆవేదనతో, దుఃఖం పొరలిపోతుండగా మహాత్ముణ్ని గూర్చి పద్యాలు చెప్పాడు (అవే– 'అగ్నిధార'లో 'క్షమామూర్తి' శీర్షికతో తర్వాత అచ్చయినాయి). మరో రోజు దాశరథి పోలీసుల నిర్బంధంలో రైలెక్కి హైదరాబాదు వస్తుండగా త్రోవలో, కామారెడ్డి స్టేషను సమీప ప్రాంతంలో ఒక ఆర్ద్ర సంఘటన జరిగింది. అది రాత్రి 9 గంటల సమయం. పోలీసులు గుడంబా తాగిన మైకంలో జోగుతున్నారు. ఆ రైలు పెట్టెలో ఒక కుటుంబం వారు, భోజనం చేస్తూ దాశరథికి పెరుగన్నం గిన్నె ఇచ్చి తినుమన్నారు. దాశరథికి ప్రాణం లేచివచ్చింది. కాని జేతులకు బేడీలున్నందువల్ల తినలేకపోయాడు. ఆ కుటుంబికులలోని ఒక అమ్మాయి పోలీసు జేబులో నుంచి తాళపుచెవి మెల్లగా తీసి బేడీలు విప్పింది. దాశరథి పెరుగన్నం తినగానే కొందరు యువకులు దాశరథిని తప్పించుకొని పొమ్మన్నారు. కాని దాశరథి అంగీకరించక ఆ అమ్మాయిచే బేడీలు వేయించుకొని కూర్చున్నాడు. ఈ సన్నివేశం దాశరథికి గల నిజాయితీని స్వాతంత్ర్య వీరాన్ని చాటుతుంది. దాశరథి హైదరాబాదు కేంద్ర కారాగృహం చంచల్‌గూడ చేరుకున్నాడు. జైలు అధికారులు దాశరథిని 'సి' క్లాసు వార్డులో ఉంచారు. ఒకనాడు దాశరథి డాక్టరు దగ్గరికి వెళ్ళే మిషతో స్వామీ రామానంద తీర్థను కలుసుకొని నమస్కరించాడు. "రచయితలు ఊహాసౌధాల్లో ఉంటారని పూర్వం అనుకొనే వాణ్ణి. కాని నిన్ను చూశాక ప్రతి కళాకారుడు దేశ స్వాతంత్ర్య ఉద్యమంలో పాల్గొనాలి" – అంటూ స్వామీజీ దాశరథిని ప్రశంసించారు.

1948 సెప్టెంబరు 13వ తేదీ తెల్లవారుజామున భారత సైన్యం ఐదు వైపుల నుంచి హైదరాబాదు రాష్ట్రంలోకి చొరబడింది; సెప్టెంబరు 17 నాడు నిజాంరాజు మీర్ ఉస్మాన్ అలీఖాన్ బేషరతుగా లొంగిపోయాడు. దాశరథి జైల్లో ఉండి ఈ వార్త విని ఎంతో పొంగిపోయాడు. ఇన్నాళ్ళు అనుభవించిన కారాగార క్లేశాన్ని క్షణంలో మరచిపోయాడు. దాశరథి నిజాం నవాబు దాస్యశృంఖలాల నుంచి విముక్తుడయ్యాడు. స్వాతంత్ర్య సమరయోధుడైన దాశరథి ఆశయం నెరవేరింది. అతని శ్రమ ఫలించింది. తాను రచించిన 'రుద్రవీణ' అనే కవితా సంపుటిని తెలంగాణకు అంకితం చేసి జన్మభూమి ఋణం తీర్చుకొన్నాడు.

"స్వాతంత్ర్యోద్యమంవల్ల మధ్యలో మెట్రిక్‌తో ఆగిపోయిన తన ఉన్నత విద్యవైపు మళ్ళీ దృష్టిని సారించాడు. ప్రైవేటుగా భోపాల్ విశ్వవిద్యాలయం నుంచి 1949లో ఇంటర్‌మీడియేట్‌ను పూర్తిచేశాడు. అనంతరం 1952లో హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయం సాయం కళాశాలలో చేరాడు. ఆంగ్ల సాహిత్యం ఐచ్ఛికంగా గ్రహించి బి.ఏ.లో కృతార్థుడయ్యాడు. సంస్కృతంలో తెలుగులో ఉర్దూలో ఇంగ్లీషులో చక్కని పరిచయం సంపాదించి గొప్ప విద్వాంసుడయ్యాడు దాశరథి.

దాశరథికి 1950లో లక్ష్మిగారితో వివాహం జరిగింది. అతనికి ఒక కుమారుడు, ఒక కుమార్తె. కుమారుని పేరు లక్ష్మణ్, కూతురు పేరు ఇందిర.

దాశరథి రెండవ లక్ష్యం తెలుగువాళ్ళందరినీ ఏకం చేసి 'మహాంధ్ర'ను సాధించడం. అప్పటికి– అంటే 1953 అక్టోబరు 1న ఆంధ్రరాష్ట్రం కర్నూలు రాజధానిగా రూపుదాల్చింది. విశాలాంధ్ర సిద్ధికై కవిత్వోద్యమం ప్రారంభించాడు. దాని ఫలితమే 'మహాంధ్రోదయం' – అనే కావ్యం.

"కోటి తమ్ముల కడ రెండు కోట్ల తెలుగు
టన్నలను గూర్చి వృత్తాంత మందజేసి
మూడు కోటుల నొక్కటే ముడి బిగించి
పాడినాను మహాంధ్ర సౌభాగ్య గీతి"

అంటూ గానం చేశాడు. అతని గానం సత్యమైంది. 1956 నవంబరు ఒకటవ తేదీన 'ఆంధ్రప్రదేశ్' అనే పేరుతో విశాలాంధ్రం అవతరించింది.

దాశరథి కొంతకాలం అధ్యాపకునిడుగా, స్థానిక స్వపరిపాలనా ప్రభుత్వశాఖ లో గ్రామ పంచాయితీ తనిఖీ ఇన్‌స్పెక్టరుగా పనిచేశాడు. అనంతరం 1956 నుంచి 1963 దాకా ఆకాశవాణి హైదరాబాదు కేంద్రంలో ప్రవచన శాఖా సహాయ ప్రయోక్తగానూ ప్రయోక్తగానూ ఉద్యోగం చేశాడు. ఆ తరువాత మద్రాసు ఆకాశవాణి కేంద్రంలో 1970 వరకు ఉద్యోగం చేసి అదే సంవత్సరం రాజీనామా చేశాడు.

తాను ఆశించిన విశాలమైన ఆంధ్రప్రదేశ్‌కు ఆస్థానకవి అయ్యాడు దాశరథి. తెలుగుజాతి చైతన్య పతాకగా ప్రకాశించాడు. అనేక కావ్యాలు రచించి ప్రజాకవిగా

జాతీయ కవిగా దర్శనమిచ్చాడు. విశాల విశ్వంలో ఎక్కడ అన్యాయం జరిగినా దాశరథి స్పందించి కలాన్ని వజ్రాయుధంగా చేసికొని ప్రతిఘటించాడు. విశాల విశ్వానికి సుఖశాంతులు కలుగాలని ఆకాంక్షించాడు.

దాశరథి 1961లో 'వాగ్దానం' చిత్రంతో చలన చిత్ర గేయ రచనకు శ్రీకారం చుట్టి, దాదాపు 20 సంవత్సరాల కాలం అనేక శతాధిక గీతాలను రచించి, ఉత్తమ సాహిత్యాన్ని సృష్టించి సహృదయులను ఆనందింపజేశాడు.

దాశరథిది విశ్వజనీనమైన వ్యక్తిత్వం. ఆయన 'అగ్నిధార' నుండి 'నేత్రపర్వం' దాకా ముప్పైకి పైగా కృతులు రచించాడు. ఆయన తెలంగాణా రచయితల సంఘానికి ప్రథమాధ్యక్షుడుగా, మంజీరా, స్రవంతి పత్రికలకు సంపాదకునిగా, 'బాలసరస్వతి తెలుగు- ఇంగ్లీషు డిక్షనరి' సహసంగ్రహకర్తగా, పింగళి కాటూరి సాహిత్య పీఠానికి కులపతిగా, హైదరాబాదు ఆకాశవాణి దూరదర్శన్ కేంద్రాలకు గౌరవ ప్రయోక్తగా, ఆంధ్రసారస్వత పరిషత్తు ప్రధాన సలహాదారుగా, శ్రీ వేంకటేశ్వర, మధుర, అన్నామలై విశ్వవిద్యాలయాలకు విజిటింగ్ ప్రొఫెసర్‌గా ఆంధ్ర భాషాసాహిత్య సేవ చేశాడు.

దాశరథి కేంద్రసాహిత్య అకాడమీ (ఢిల్లీ) కౌన్సిలు సభ్యులుగానూ, ఆంధ్రప్రదేశ్ అధికార భాషా సంఘం సభ్యులుగానూ, సెంట్రల్ పబ్లికేషన్ డివిజనల్ సభ్యులుగానూ, ఫిలిం సర్టిఫికేషన్ బోర్డు సభ్యులుగానూ, తెలుగు అడ్వయిజరీ బోర్డు సభ్యులుగానూ విజ్ఞానాత్మక సహకారాన్ని అందించి తన బాధ్యతను సక్రమంగా నిర్వర్తించాడు.

దాశరథి మహనీయ కవితా ప్రతిభనూ, దేశభక్తి ప్రపూర్ణ వ్యక్తిత్వాన్ని దర్శించిన సహృదయలోకం, దాశరథిని 'మహాకవి', అభ్యుదయ కవి చక్రవర్తి, యువకవి చక్రవర్తి అనే బిరుదులతో సన్మానించింది. 1972లో ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధిగారు దాశరథిని 'జాతీయోద్యమ రథసారథి'గా గుర్తించి, తామ్రపత్రంతో సన్మానించారు. 1975లో ఆంధ్ర విశ్వవిద్యాలయం 'కళాప్రపూర్ణ' బిరుదుతో సన్మానించింది. 1976లో ఆగ్రా విశ్వవిద్యాలయం దాశరథిని డాక్టర్ ఆఫ్ లెటర్స్ (డి.లిట్) గౌరవ పట్టాతో సత్కరించింది. 1977 ఆగస్టు 15వ తేదీన అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుగారు దాశరథిని ఆస్థానకవిగా నియమించి, గౌరవించారు. 1978లో 'అమెరికా గ్రేటర్ వాషింగ్టన్ తెలుగు సాంస్కృతిక సంస్థ' దాశరథిని 'ఆంధ్ర

కవితా సారథి' అనే బిరుదుతో సన్మానించింది. 1981లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం దాశరథిని 'డి.లిట్' పట్టంతో గౌరవించింది.

1971 జూన్ 26నాడు ఒంగోలు జిల్లా రచయితల మహాసభలో అప్పటి రాష్ట్రమంత్రి శ్రీ ఆర్. నారపరెడ్డిగారు దాశరథి ఎడమకాలికి స్వయంగా గండపెండేరాన్ని అలంకరించారు. 1975లో ప్రథమ ప్రపంచ మహాసభలో దాశరథికి సన్మానం జరిగింది. దాశరథికి 50 ఏళ్ళు నిండిన సందర్భంగా 1975లో వరంగల్లు వారు జరిపిన స్వర్ణోత్సవం గణనీయమైనది. స్వాతంత్ర్యయోధుడైన దాశరథిని అప్పటి ఉపరాష్ట్రపతి శ్రీ ఆర్.వెంకట్రామన్‌గారు విజయవాడలో ఘనంగా సన్మానించారు. గజల్, రుబాయీ ప్రక్రియలను, ఉర్దూ హిందీ ఫారసీ స్పానిష్ భాషలలో అధ్యయనం చేసి పరిశోధన జరుపడానికి 1980 నుంచి 1983 వరకు, భారత ప్రభుత్వ విద్యా యంత్రాంగంలోని సాంస్కృతిక శాఖవారు దాశరథికి 'సీనియర్ ఫెలోషిప్'ను ఇచ్చి గౌరవించారు.

దాశరథి రచించిన 'గాలిబ్ గీతాలు', 'కవితా పుష్పకం', 'తిమిరంతో సమరం' అనే గ్రంథాలు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ, కేంద్ర సాహిత్య అకాడమీ పురస్కారాలను అందుకొన్నాయి. దాశరథి 'మహాంధ్రోదయం' అనే కవిత హైదరాబాదు ప్రభుత్వ సమాచార శాఖ జరిపిన పోటీలో ప్రథమ బహుమతి గెలుచుకొన్నది.

దాశరథి రచించిన గ్రంథాలను గూర్చి, ఆతని సాహిత్య జీవితాన్ని గూర్చి అనంతపురం స్నాతకోత్తర విద్యాకేంద్రంలో, బెంగుళూరు విశ్వవిద్యాలయంలో, తిరుపతి- కాకతీయ- ఉస్మానియా విశ్వవిద్యాలయాలలో పండితులు పరిశోధనలు చేసి డాక్టరేట్, ఎం.ఫిల్ పట్టాలను పొందారు. ఇంకా ఆ మహాకవి గ్రంథాలను గూర్చి విమర్శలూ, అనుశీలనలూ సమీక్షలూ అసంఖ్యాకంగా వెలువడినాయి.

మహాకవి దాశరథి రచనలు అనేకం ఇంగ్లీషు, హిందీ, ఉర్దూ భాషలలోకి అనువదింపబడినాయి.

సాహితీమూర్తి అయిన దాశరథి అనేక దేశాలలో పర్యటించి ఉపన్యాసాలతో కావ్యగానాలతో సభలను రంజింపజేశాడు. మలేషియా, సింగపూర్, ఇంగ్లండ్, అమెరికా, కెనడా, మెక్సికో, జర్మనీ, ఫ్రాన్సు, బంగ్లాదేశ్, సోవియట్ ఆర్మేనియా

రాజధాని యరవాన్, తాష్కెంట్, మాస్కో మొదలైన దేశాలలో ఆయా నగరాలలో పర్యటించి, తాను దర్శించిన ఆయా దేశాల విశేషాలనూ పొందిన అనుభవాలనూ అనుభూతులనూ దాశరథి వ్యాసాలుగా సహృదయులకు అందించాడు.

దాశరథి కృతులివి– అగ్నిధార, రుద్రవీణ, పూలపాటలు, మహాబోధి, మహేంద్రోదయం, పునర్నవం, అమృతాభిషేకము, నవమంజరి, దాశరథి బాలల గేయాలు, శంకర్స్ బొమ్మల బాలరామాయణం (సంయుక్త రచన) శంకర్స్ బొమ్మల బాలభాగవతం (సంయుక్త రచన), తేనె పాటలు, నవమి, గాలిబ్ గీతాలు, దాశరథి శతకము, ఖబర్దార్ చైనా, మహాశిల్పి జక్కన, కవితా పుష్పకం, ప్రాచీన లక్నో, తిమిరంతో సమరం, ఆలోచనాలోచనాలు, అమృతవల్లి– తెలుగు తల్లి, 'బాలసరస్వతి తెలుగు–ఇంగ్లీషు డిక్షనరి' (సహసంగ్రహ కర్త), ధ్వజమెత్తిన ప్రజ, నవజగానికి వందనం, జ్వాలాలేఖిని, వ్యాసపీఠం, గీతగోవింద వ్యాఖ్యానం, నేత్రపర్వం, యాత్రాస్మృతి (ఈ చివరి రెండు– మరణానంతరం ముద్రితాలు).

1983లో అప్పటి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆస్థాన పదవిని రద్దు చేయడంతో దాశరథి కొంత కలతపడ్డాడు. ఆ కలత క్రమంగా అనారోగ్యానికి దారితీసింది. 1987 ఆగస్టులో సాగిన రష్యా పర్యటన తరువాత దాశరథికి గుండెపోటు వచ్చింది. ఆతనిని సెప్టెంబరు 20వ తేదీనాడు హైదరాబాదులోని 'మదర్ థెరిసా' ఆస్పత్రిలో చేర్చారు. అక్టోబరు 16 నాడు స్వగృహానికి తీసుకొని వచ్చారు. 1987 నవంబరు 5వ తేదీన ఉదయం రక్త పరీక్ష చేయించుకొని వచ్చి 11 గంటల ప్రాంతంలో ఇన్సులిన్ ఇంజక్షన్ తీసుకొన్నాడు. 'బాత్‌రూం'లోకి వెళ్ళి అక్కడే పడిపోయి శాశ్వతంగా కన్నుమూశాడు దాశరథి. బ్రతికినంతకాలం అవిశ్రాంతంగా తిమిరంతో సమరం సాగించిన మహాకవి దాశరథి హఠాన్మరణానికి సాహిత్యలోకం దుఃఖసముద్రంలో మునిగిపోయింది. తెలంగాణా స్వాతంత్ర్య సమరయోధుల సంఘం విలపించి నివాళులర్పించింది. "నల్లని చీకట్ల మీద నవకాంతి కవితలు" వ్రాసిన 'దాశరథి' "జ్వాలాలేఖిని ఆరిపోదు. ఇందులోని చైతన్య మషీపంకం ఇంకిపోదు" ఆ రససిద్ధుని యశఃకాయం జరామరణ రహితం. ❑

# II. దాశరథి కవిత్వం

## 1. తెలంగాణ దుఃస్థితి

"ఈ శ్మశాన వాటి ఈ నిశా నైల్యమ్ము
లీ మహా శిశిరము లెన్నినాళ్ళు
ఈ క్షుధాజ్వరంబు లీవ్యథాభారంబు
లీ బికారి బ్రతుకు లెన్నినాళ్ళు" (అగ్నిధార(1949) 'అంతర్నాదము'లో)

"అవి తెలంగాణమందు దావాగ్నిలేచి
చుట్టుముట్టిన భీకరాశుభదినాలు
అవి నిజాము నృపాలుని అండ దండ
చూచుకొని నిక్కినట్టి పిశాచి కలలు"
( రుద్రవీణ(1950) 'ముక్తభూమి'లో)

"తరతరాల స్వప్నాల సుందర ఫలమ్ము
స్వైర భారత భూమి చూపడెనొ లేదొ
విషము గుప్పించినాడు నొప్పించినాడు
మా నిజాం రాజు జన్మ జన్మాల బూజు" ('రుద్రవీణ' 'ముక్తభూమి'లో)

**అర్థాలు:-** శ్మశానవాటి= కాటి ప్రదేశం, కాటిభూమి; నిశానైల్యమ్ములు= రాత్రియొక్క నల్లదనాలు; శిశిరములు= చల్లని ఆకురాలే కాలాలు, శిశిర ఋతువులు; క్షుధాజ్వరంబులు= ఆకలిమంటలు (జ్వరము= వేడిమి); వ్యధాభారంబులు= బాధలబరువులు, అధికబాధలు; దావాగ్ని= దావ+అగ్ని= కార్చిచ్చు; పిశాచి= పిశాచ జాతిస్త్రీ, దేవయోని విశేషం, ప్రేతం; పిశాచులు దేవయోనులలో ఒక తెగవారు. పాపకృత్యాలవల్ల భూమి సంబంధమైన దేహాలను పొందక, వాయుదేహాలతో సంచరించే జీవులు. ఆ జీవులు తమ తమ పాపకర్మలు విమోచనం కాగానే ఆ వాయుదేహాలను వదలుతారు. గాలిద్రిమ్మరి, డాకిని, దయ్యం, పీనుగుదిండి,

ప్రేతం, బూతం, బేతాళం, బూచి అనేవి పిశాచానికి పర్యాయపదాలు. స్వప్నాలు= కలలు; భీకర+అశుభదినాలు= భయపెట్టే చెడురోజులు; స్వైరభారతభూమి= స్వతంత్ర భారతదేశం.

**వ్యాఖ్య:–** "ఏడవ నిజాంరాజు మీర్ ఉస్మాన్ అలీఖాన్ పరిపాలనలో తెలంగాణ ఒక శ్మశానవాటికలా, చిక్కని చీకటిలా, ఆకులు రాలిపోయి చెట్లు మోడువడిపోయిన శిశిరఋతువులాగా ఉండింది. ఇలాంటి బీభత్సమయమైన, ఇలాంటి అజ్ఞానాంధకార భరితమైన, ఏ వికాసమూ ప్రకాశమూలేని దుష్టపాలనం ఎన్నాళ్ళు? పేదల ఆకలిమంటలూ బాధల బరువులూ ఈ బిచ్చపు దరిద్రపు బతుకులు ఎంతకాలం భరించాలి?"

"తెలంగాణమంతా కార్చిచ్చు అంటుకొని, మంటలతో భయంకరంగా అమంగళంగా ఉన్న రోజులవి. నిజాం రాజు అండదండలు మనకున్నా యని గర్వించిన పిశాచుల కలలవలె ఉన్న దినాలవి.

"ఆంగ్లేయులతో భారతీయులు తరతరాలుగా పోరాడి, 15-8-1947 నాడు స్వాతంత్ర్యం అనే స్వప్నాల ఫలాన్ని పొందడాన్ని చూశాడో లేదో, నిజాం రాజు తెలంగాణ ప్రజలపై మరింత కసిని పెంచుకొని, విషం గుప్పించాడు. రకరకాలుగా నొప్పించాడు. నిజాంరాజు రాజుకాదు 'జన్మజన్మాల బూజు'"– అంటూ దాశరథి మహాకవి తెలంగాణా దుఃస్థితినీ, ప్రజల ఇక్కట్లనూ నిజాం రాక్షస కృత్యాన్నీ కళ్లముందు నిల్పినాడు ఈ పంక్తుల్లో.

తెలంగాణా ప్రజలు– అందులోనూ తెలుగు మాటాడే ప్రజలు– రాజకీయంగా ఆర్థికంగా సాంఘికంగా విద్యాపరంగా వెనుకబడి ఉండేవాళ్ళు. జాగీర్దారుల భూస్వాముల 'జులుం' ఎక్కువగా ఉండింది. నిరుపేదలు వెట్టిచాకిరికి బలి అయ్యేవాళ్ళు. ఆనాటి పన్నులభారం ప్రజలను కుంగదీసింది. ప్రభుత్వంవాళ్ళు చనిపోతే ప్రజలు బూడిదపన్ను కట్టాలి. జాగీర్దారు గుఱ్ఱం కొనుక్కుంటే, ప్రజలు గుఱ్ఱం పన్ను కట్టాలి. మోటారు కొంటే మోటారుపన్ను, అలాగే జమీందారు ఇంట్లో పెండ్లి జరిగితే పెండ్లిపన్ను, నవరాత్రులు జరుపుకుంటే నవరాత్రిపన్ను, యాత్రచేస్తే యాత్రపన్ను రైతులనుండి వసూలు చేసేవాళ్ళు. ఈ విధంగా నిజాంరాష్ట్రం మొత్తంమీద రెండువందలకు మించిన పన్నులుండేవి. ఒక్కొక్క జాగీరులో ఒక్కొక్క రకమైన పన్నులు. పెద్దపెద్ద భూస్వాములు కర్షకులను తమ సొంత ఆస్తిగా భావించేవారు. భూస్వామి

మోజు పడితే ఏ స్త్రీ అయినా ఆతని కోరిక తీర్చవలసిందే. నిజాం ప్రభుత్వ ఉద్యోగులూ వారి తాబేదార్లూ, పన్నులు కట్టని వాళ్ళను స్త్రీ పురుష భేదంలేకుండా చిత్రహింసల పాలుచేస్తుండేవారు. చెవులకు బరువులు కట్టేవారు. గుండెపైన పెద్ద పెద్ద బండలు పెట్టేవారు. కాగుతున్న నూనెలో చేతులను ముంచేవారు. ఇలా పన్నుల వసూళ్ళు క్రూరంగా ఉండేవి. ఆనాడు- ప్రజలకు పౌరసత్వ హక్కులు లేకుండేవి. వాక్స్వాతంత్ర్యం లేదు; పత్రికాస్వేచ్ఛ లేదు; ప్రభుత్వ అధికార భాష ఉర్దూ. అక్షరాభ్యాసం ఉర్దూలో జరిగేది. ఫలితంగా తెలుగు భాష దైన్యంలో మునిగిపోయింది. తెలుగంటే చులకన, ఉర్దూలో మాటాడడం సభ్యత. తెలుగువారికి ఉద్యోగాలు చాలా తక్కువ. అక్షరాస్యుల సంఖ్య స్వల్పాతి స్వల్పం. దాదాపు ఐదు శాతంలోపే. ఇలా తెలుగు భాషకూ సంస్కృతికీ ఆదరణలేని చీకటి రోజులవి. ఈ విషయాలన్నిటినీ దాశరథి "శ్మశానవాటి, నిశానైల్యమ్ములు, మహాశిశిరములు, క్షుధా జ్వరంబులు, వ్యధాభారంబులు"- అనే మాటలలో తెలిపినాడు. ఈ ఆటవెలది పద్యం ఉల్లేఖ- రూపక అలంకారగర్భితం.

"అవి తెలంగాణమందు దావాగ్ని లేచి... పిశాచి కలలు".

ఆ రోజుల్లో రజాకార్ల సంస్థ ఒకటి ఉండేది. దాని పేరు 'ఇత్తెహాద్-ఉల్-ముస్లిమీన్'. ఈ సంస్థ 1927లో మహమ్మదీయుల అభివృద్ధికోసం, విద్యావంతులచే స్థాపించబడింది. 1945లో ఈ సంస్థకు 'ఖాసీం రజ్వీ' అనే రజాకారు (రజాకారు అంటే 'స్వచ్ఛంద సేవకుడు' అని అర్థం) నాయకత్వం వహించాడు. ఫలితంగా, ఆ సంస్థ మత దురహంకార సంస్థగా రూపొందింది. అతడు నిజాం అండదండలతో నిక్కి, రజాకార్లకు సైనిక శిక్షణ నిచ్చి, హింసాకాండకు రెచ్చగొట్టాడు. రజాకారు దళాలు 1946-48 మధ్య, హిందువులపైన, తెలుగువాళ్ళపైన ఎన్నో అత్యాచారాలు చేశారు. గ్రామాలపై దాడిచేశారు. ఆస్తులను ధ్వంసం చేశారు. ప్రజలను దోచుకున్నారు. ఇళ్ళను తగులబెట్టారు. స్త్రీలను మానభంగం చేశారు. హత్యచేశారు. ఇలా అనేకాలైన అమానుష కృత్యాలను విచ్చలవిడిగా సాగించారు. అందుకే తెలంగాణలోని, ఈ విషాద దృశ్యాలను చూచి దాశరథి వాటిని "దావాగ్నిలేచి చుట్టుముట్టిన భీకరాశుభదినాలు" అనీ, నిజాము దౌష్ట్యాన్నీ, ఆతని అండదండలతో చెలరేగిన రజాకార్ల దుశ్చర్యలను 'పిశాచి కలలు' అనీ వర్ణించాడు. ఇలాంటి పైశాచిక కృత్యాలను ప్రోత్సహించిన నిజాంను "జన్మజన్మాల బూజు"- అని నిందించి, ధిక్కరించి, ఎదురు

తిరిగి గర్జించిన కవిసింహం దాశరథి. నిజాం నవాబును ఎదిరిస్తూ, కవితాగ్నిధార కురిశాడు; రుద్రవీణ మీటాడు దాశరథి. చివరి రెండు పద్యాలు తేటగీతులు; రూపకాలంకార శోభితాలు.

"అచట ప్రాక్పశ్చిమాకాశ మావలించి
నెత్తురులు కక్కుకొన్నది; కుత్తుకలకు
కత్తులను కట్టి ఊరేగు కాలరాజ్ఞి
మానభంగాల జండాలతో నటించె"

"అచట పాపము దౌర్జన్య మావరించి
తెలుగు దేశాన నెత్తురుల్ చిలికివేసె
మత పిశాచము పేదల కుతుక నమిలి
ఉమ్మివేసెను పిప్పి లోకమ్ముమీద"

"నా తెలంగాణ కోటి రత్నాలవీణ
తీవియలు తెగి, విరిగి నదించకుండె
నా తెలుగు జాణ ప్రాణమానాలు దోచి
ఈ నిజాము పిశాచి కన్నెఱ్ఱచేసె"

"మా నరాల నెత్తురు ప్రవాహాన కలిసి
ముస్సిలో పారినది; బుద్ధమూర్తివోలె
మా స్థిరీభూత భావసమాధి వృక్ష
మట్లె నిలచిన దీనాటి కైన గాని"

"గెలిచినది గడ్డిపోచ; ముక్కలయిపోయి
మన్ను కరచెను గొడ్డలి; కన్నులోని
వేడి అశ్రువు గెలిచెను; వాడి కత్తి
ఓడిపోయెను; 'ముస్సి' పారాడిపోయె" (అగ్నిధార– 'ముస్సీ తటము'లో)

**అర్థాలు:-** ప్రాక్+పశ్చిమ+ఆకాశము= తూర్పు, పడమటి దెసల ఉన్న ఆకాశం; ఆవలించి= ఆవులించి, నోరు తెరచి; కుత్తుకలకు= గొంతులకు, కంఠాలకు; కాలరాజ్ఞి= కాలం అనే రాణి; దౌర్జన్యము= దుర్జనత్వం; జాణ= నేర్పుగల స్త్రీ; నదించక= మోగక; ముస్సి= మూసీ అనే పేరుగల నది ('ముచికుంద'నది); కన్నెఱ్ఱచేసె= కోపించె; స్థిరీభూత భావసమాధి= నిలకడ గల్గిన మనస్సు యొక్క నియమం; అశ్రువు= కన్నీరు; పారాడిపోయె= పరుగెత్తెను, ప్రవహించెను.

**వ్యాఖ్య:-** "అచట... నటించె".

నిజాం నవాబు అధికారాన్ని, ఆ దుష్టరాజు అహంకారాన్ని అండగా చూచుకొని హిందువులనూ తెలుగువాళ్ళనూ, రజాకార్లూ ముస్లిములూ సాగించిన హింసాకాండనూ రక్తపాతాన్నీ ఈ పంక్తులు వ్యక్తం చేస్తున్నాయి కవితాత్మకంగా. తూర్పు పడమరల ఆకాశమే నోరు తెరచి నెత్తురు కక్కుకొన్నదా అన్నంతగా, ప్రజల రక్తపాతం జరిగింది. ఆనాటి కాలం అనే రాణి, తెలుగు ప్రజల గొంతులకు కత్తులనుకట్టి ఊరేగుతున్నదా అన్నంత క్రూర హింసాప్రవృత్తి ఏర్పడింది. ఆ మహారాజ్ఞి స్త్రీల మానభంగాలు అనే జండాలతో ఊరేగింది". ఈ తేటగీతి పద్యం రూపకాలంకార భూషితం.

"అచట పాపము... లోకమ్ముమీద".

ఆనాడు తెలంగాణాలో ఎక్కడ చూచినా దౌర్జన్యమే. రజాకార్లు ముస్లిములు చేసే అపచారమే. అత్యాచారమే. ఇళ్ళు కాలబెట్టడం, ఊళ్ళకూళ్ళ కగ్గిపెట్టడం, తల్లీ పిల్లా అని చూడకుండా పొడిచి చంపడం- ఇలా ఎటూ చూచినా బీభత్సం-శ్మశానం, నెత్తురు. అది ఎలా ఉందంటే- ఇస్లాం మతం అనే పిశాచం, ద్వేషంతో పేదప్రజల గొంతులు నమిలి తిని, రక్తం తాగి, పనికిరాని పిప్పిని లోకంమీద ఉమ్మి వేసిందా అన్నట్లుంది. పిశాచాలు మనుష్యులను చంపి తింటాయి. రక్తం తాగుతాయి. శ్మశానంలో ఉంటాయి. ఆ దయ్యాలు గాలిలో తిరుగుతాయి. ఈ తేటగీతి పద్యం రూపకాలంకార శోభితం.

"నా తెలంగాణ... కన్నెఱ్ఱ చేసె".

తెలంగాణ కోటి రత్నాల వీణ. ఆ కోటి రత్నాలు కోటి మంది తెలుగు ప్రజలు. కోటి రత్నాలవీణ యొక్క తీగెలను తెంపివేసింది నిజాం అనే పిశాచి.

అందువల్ల వీణ మూగవోయింది, మోగడంలేదు. ఇంకా ఆ పిశాచి కోపించి తెలుగు జాణల ప్రాణాలను మానాలను దోచింది. ఈ తేటగీతి పద్యం రూపకాలంకారంతో అందగిస్తున్నది.

"మా నరాల నెత్తురు... ఈనాటికైన గాని".

మతద్వేషంవల్ల జరిగిన హింసకు బలి అయిన తెలంగాణా ప్రజల నెత్తురు మూసీ నదిలో కలిసి ప్రవహించింది. నెత్తురు నదీధారలో పోయినా, ఇంకా ఆనాటి బీభత్స దృశ్యం మా మనస్సులలో ఈనాటికీ నిలిచే ఉంది-బుద్ధుడు పోయినా బోధివృక్షం ఈనాటికీ నిలిచినట్లుగా. ఉపమాలంకార భూషితమైన ఈ పద్యం తేటగీతిగా సాగింది.

"గెలిచినది గడ్డిపోచ... పోరాడిపోయె".

"ఈ పద్యంలోని 'గడ్డిపోచ' 'వేడి అశ్రువు'- తెలంగాణ ప్రజలకు ప్రతీకలు. 'గొడ్డలి', 'వాడికత్తి'- నిజాం ప్రభువుకు ప్రతీకలు. 'వేడి అశ్రువు'- ప్రజల కష్టాలకు సంకేతం. బలహీనమైన, తేలికైన 'గడ్డిపోచ' అని నిజాం భావించిన 'తెలంగాణ' గెలిచింది. గొడ్డలిలాంటి వాణ్ని అని గర్వించిన నిజాం ప్రభుత్వం ముక్కలై పతనమైపోయింది. బాధలతో వేడికన్నీరు విడిచిన తెలంగాణ ప్రజ జయించింది. వాడికత్తి లాంటి నిజాంయొక్క ప్రభుత ఓడిపోయింది. గొడ్డలిలాంటి కత్తిలాంటి క్రౌర్యం దౌష్ట్యం నేలగూలింది. గడ్డిపోచలాంటి కన్నీటిలాంటి అమాయకత్వం, అసహాయత గెలుపొందింది. హింసపై అహింస గెలిచింది. అన్యాయాన్ని న్యాయం ఓడించింది". విషమాలంకార శోభితమైన ఈపద్యం తేటగీతి.

1947 ఆగస్టు 15 నాడు భారతదేశం స్వతంత్రమైంది. నిజాం ప్రభువు భారత యూనియన్‌లోగానీ, పాకిస్తాన్‌లోగానీ చేరనని ప్రకటించాడు. ఫలితంగా, 1947 నవంబరులో నిజాం, భారత ప్రభుత్వంతో యథాతథపు ఒడంబడికను కుదుర్చుకొన్నాడు. దీనిప్రకారం, విదేశ వ్యవహారాలు, సమాచార మార్గాలు, రహదారులు, రక్షణ విషయాలలో, నిజాం రాజ్యంలో భారతీయ ప్రభుత్వానికి అధికారాలు లభించాయి. దీనిని అనుసరించే, భారతప్రభుత్వం, కె.ఎం. మున్షీని హైదరాబాదులో తమ ఏజెంటు జనరలుగా నియమించింది. నిజాం రాజు యథాతథపు ఒడంబడికకు వ్యతిరేకంగా, విదేశవ్యవహారాలలో స్వతంత్రతను వహించడం మొదలు

పెట్టాడు. భారతదేశం కాశ్మీరుకై పాకిస్తాన్‌తో యుద్ధం చేస్తున్న సమయంలో పాకిస్తాన్‌కు కోట్లరూపాయలు అందజేశాడు. భారత యూనియన్‌లో ఉన్న ముస్లిములు, హైదరాబాదుకు వచ్చి, సైన్యంలో చేరవలసిందని రజాకార్ల నాయకుడు ఖాసిం రజ్వీ పిలుపునిచ్చాడు. అంతట రజాకార్లు విజృంభించి, గ్రామీణులను హింసిస్తూ, గృహదహనాలకు పాల్పడుతూ, లూటీలూ దోపిడీలూ చేస్తూ, హత్యలకూ అత్యాచారాలకూ పాల్పడుతూ అరాజకత్వాన్ని వ్యాపింపజేశారు. ఈ దురంతాలకు భయపడిన ప్రజలు, రాజ్యం విడిచి వెళ్ళవలసి వచ్చింది. నిజాం రాజు శాంతి భద్రతలను కాపాడలేకపోయాడు. నిజాం రాజ్య పరిస్థితి, భారతదేశ శాంతి భద్రతలకూ సమగ్రతకూ, భంగకరం కావడంవల్ల, విధిలేక, 1948 సెప్టెంబరు 13 నాడు భారత ప్రభుత్వం 'పోలీసుచర్య'కు పూనుకొన్నది. నిజాం రాజ్యంలోనికి దక్షిణ ప్రాంతం కమాండింగ్–ఇన్–ఛీఫ్ లెఫ్టినెంట్ జనరల్, మహారాజా రాజేంద్ర సింహ్‌జీ ఆధిపత్యాన సైన్యాన్ని పంపించింది. భారత సైన్యాన్ని, హైదరాబాద్ సైన్యం, రజాకారు దళాలూ ప్రతిఘటించాయి. కాని భారతసైన్యం ముందు నిలువలేకపోయాయి. ఫలితంగా 1948 సెప్టెంబరు 17నాడు, నిజాం బేషరతుగా లొంగిపోయాడు. హైదరాబాదు రాజ్యం భారత యూనియన్‌లో విలీనమైంది. నిజాం నిరంకుశపాలన నుంచి తెలంగాణ ప్రజలకు ముక్తి లభించింది. ఈ వృత్తాంతాన్నే దాశరథి– "గెలిచినది గడ్డిపోచ... ముస్సిపారాడిపోయె" అనే మూడు పంక్తుల్లో సారభూతంగా వ్యక్తం చేశాడు.

## 2. నిజాం నవాబుపై తిరుగుబాటు

*"ప్రాణములొడ్డి ఘోర గహనాటవులన్ బడగొట్టి, మంచి మా*
*గాణములన్ సృజించి, ఎముకల్ నుసిచేసి, పొలాలు దున్ని, భో*
*షాణములన్ నవాబునకు స్వర్ణము నింపిన రైతుదే, తెలం*
*గాణము రైతుదే ముసలి నక్కకు రాచరికంబు దక్కునే"*

**అర్థాలు:–** ఒడ్డి= పందెమిడి, అడ్డంగా ఉంచి; ఘోర గహన+అటవులన్= భయంకరమైన చొఅరాని అడవులను; మాగాణములన్= వరిపంట పండే పొలాలను (పల్లపు భూములను); సృజించి= పుట్టించి; నుసిచేసి= పొడిగా చేసి, నలిపివేసి; భోషాణములన్=

పెద్ద పెట్టెలందు; నవాబునకు= రాజునకు; స్వర్ణము= బంగారం; రాచరికంబు= రాజత్వం, ప్రభుత్వం; దక్కునే= నిలుచునే, లోబడి ఉంటుందా?

**వ్యాఖ్య:-** మహాకవి దాశరథి రచించిన ఈ పద్యం ఆతని ప్రథమ కావ్యం 'అగ్నిధార' (1949)లోని 'రైతుదే' శీర్షికలోనిది. దాశరథి తెలంగాణా స్వాతంత్ర్య సమరయోధుడు. నిజాం పరిపాలనలో తెలంగాణా రైతుల పరిస్థితి దుర్భరంగా ఉండేది. రకరకాల పన్నులతో, వెట్టిచాకిరితో, శిక్షలతో రైతులను ప్రభుత్వం దారుణంగా హింసించేది. ఆ హింసలను చూచి, దాశరథి భరించలేక నవాబుకు ఎదురు తిరిగి రైతుల పక్షాన నిలబడి– "మహారణ్యమయమైన తెలంగాణా భూమిని మాగాణం చేసి, నిజాం నవాబు ధనాగారాన్ని బంగారు పెట్టెలతో నింపిన రైతుదే తెలంగాణం"- అని ఘోషించాడు. నిజాంను 'ముసలినక్క' "నిజాం రాజు జన్మజన్మాల బూజు" అని ధిక్కరించి సింహంలా గర్జించాడు దాశరథి. ఆ గర్జనమే ఈ పద్యం. కట్టలు తెంచుకొని వచ్చిన దాశరథి కవితావేశానికి ఈ పద్యం అక్షర దర్పణం. అసమాపక క్రియలతో, ఆవేశపూరిత మహోపన్యాసంగా సాగిన ఈ పద్యం అర్థాంతరన్యాసంతో ముగియడంవల్ల పద్యంలో ఒక నవ్యత భాసించింది.

"ఓ నిజాము పిశాచమా! కానరాడు
నిన్ను బోలిన రాజు మా కెన్నడేని
తీగెలను తెంపి అగ్నిలో దింపినావు
నా తెలంగాణ కోటి రత్నాల వీణ" ('అగ్నిధార'– 'రైతుదే')

**అర్థాలు:-** పిశాచమా= బూతమా, ప్రేతమా, బూచివాడా, దయ్యమా; తెలుంగు+అణెము= తెలంగాణము= తెలుగు దేశసంబంధమైనది (అణెము= దేశం); తెలగాణము, తెలంగాణెము, తెలంగాణము, తెలగాణ, తెలంగాణ– ఇవన్నీ రూపాంతరాలు.

**వ్యాఖ్య:-** దాశరథి నిజాం నవాబుపై ప్రయోగించిన ఆగ్నేయాస్త్రం లాంటి పద్యమిది. మరోవైపు తెలంగాణా పతాకలాంటి పద్యమిది. దాశరథి తెలంగాణా విముక్తి మహోద్యమంలో పాల్గొని, ఊరూరా తిరిగి సభలలో విప్లవాత్మక గీతాలను పాడి, ప్రజల హృదయాలను ఉడుకెత్తించేవాడు. ఉఝ్ఝూతలూగించేవాడు. ఆనాటి సభలు ఈ పద్యంతోనే ప్రారంభమయ్యేవి. ఆనాడు నిజాంనవాబును 'పిచాశమా' అని నిందు

సభలో దూషించిన విప్లవకవి ఒక్క దాశరథే. ఈ పద్యాన్ని ఆతడు నిజామాబాదు జైలుగోడమీద బొగ్గుతో వ్రాశాడు. జైలు అధికారులు తుడిచేస్తే, సమరయోధుడు వట్టికోట ఆళ్వారుస్వామి మళ్ళీ మళ్ళీ ఆ పద్యాన్ని గోడమీద వ్రాసేవాడు. ఈ పద్యంలోని "తీగెలను తెంపి అగ్నిలో దింపినావు"- అనే చరణం నిజాం హింసా ప్రవృత్తిని ఎత్తిచూపుతన్నది. చివరి చరణంలోని 'కోటి రత్నాలవీణ' కోటి ప్రజలున్న తెలంగాణ మీద దాశరథికి గల భక్తికి నిదర్శనం. ఈ తేటగీతి పద్యంలో నిజామును పిశాచంగా, తెలంగాణను రత్నవీణగా భావించడంచేత రూపకాలంకారం భాసిస్తున్నది.

"ఇదే మాట ఇదేమాట- పదే పదే అనేస్తాను
ఖదం తొక్కి పదంపాడి- ఇదేమాట అనేస్తాను
ఎదల్లోన, రొదల్లోన- సొదల్లోన గదుల్లోన
ఇదేమాట ఇదేమాట- పదే పదే అనేస్తాను

జగత్తంత రగుల్కొన్న- కృధాజ్వాల వృథా పోదు
అడుగడుగున ఎదద నెత్రు- గడగడమని త్రాగినావు
పడతుల మానాలు దోచి- గుడగుడ మని 'హుక్క' త్రాగి
జడియక కూర్చుండినావు- మడికట్టుక నిలిచినావు

దగాకోరు బటాచోరు- రజాకారు పోషకుడవు
వూళ్ళకూళ్ళ కగ్గిపెట్టి- ఇళ్ళన్నీ కొల్లగొట్టి
తల్లిపిల్ల కడుపుకొట్టి- నిక్కిన దుర్మార్గమంత
నీ బాధ్యత నీ బాధ్యత-

కోటిన్నర నోటివెంట- పాటలుగా మాటలుగా
దిగిపొమ్మని దిగిపొమ్మని- ఇదే మాట అనేస్తాను

వద్దంటే గద్దెయెక్కి- పెద్దరికం చేస్తావా
మూడుకోట్ల చేతులు నీ- మేడను పడతోస్తాయి
మెడనే విడదీస్తాయి
నీకు నిలుచు హక్కు లేదు- నీకింకా దిక్కు లేదు

చరిత్ర బొంగరం తిరిగి- కిరీటాలు నేలకొరిగి
ధరాధిపులు నశిస్తుంటే- బరాయెనాం నవాబా
పరాక్రమం చూపేవా?

దిగిపొమ్మని జగత్తంత- నగారాలు కొడుతున్నది
దిగిపోవోయ్ తెగిపోవోయ్
తెగిపోవోయ్ దిగిపోవోయ్
ఇదేమాట ఇదేమాట- పదే పదే అనేస్తాను

(అగ్నిధార- 'పదే పదే అనేస్తా'లో)

**అర్థాలు:-** ఖదం= అడుగు; కృధాజ్వాల= కోపం మంట; 'హుక్క'= ఒక రకమైన పొగతాగే సాధనం; జడియక= భయపడక; మడికట్టుక= ఇతరులను అంటకుండ; దగాకోరు= మోసకాడు; బటాచోరు= పెద్ద దొంగవెధవ; ధరా+అధిపులు= భూపతులు, రాజులు; బరాయెనాం= పేరుకు మాత్రమే ఉండే (నిజమైన నవాబు కాదని); నవాబు= రాజు; నగారా= పెద్ద ఢంకా.

**వ్యాఖ్య:-** త్రిశ్రగతిలో నడిచిన నలుబైయైదు చరణాల దీర్ఘగీతమిది. ఇది తెలంగాణా ప్రజలలో రగిలించిన స్వాతంత్ర్య చైతన్యజ్వాల ఇంతింతనరానిది. ఇది ఆనాడు 'వందేమాతరం' గీతంలాంటిది తెలంగాణాలో. దాశరథి ఈ గీతాన్ని ముక్తకంఠంతో గానం చేసేవారు సభలలో. తెలంగాణాలో రగుల్కొన్న కోపజ్వాలను వ్యక్తం చేస్తున్నది. ఖాసీం రజ్వీ నాయకత్వంలో రజాకార్లు స్త్రీల మానప్రాణాలను భంగపరచిన విషాద వాతావరణాన్ని, నిజాం నిర్లక్ష్య వైఖరినీ, అతని పరిపాలనా వైఫల్యాన్నీ, రజాకార్ల దుండగాలను ఆయన పోషించిన తీరు తెన్నులను, అతని బాధ్యతా రాహిత్యాన్ని, వెల్లువలా పొంగివచ్చిన ప్రజల నిరసననూ ఈ గేయంలో ప్రజాకవిగా దాశరథి ప్రకటించాడు. "వూళ్ళకూళ్ళ కగ్గిపెట్టి- ఇళ్ళన్నీ కొల్లగొట్టి- తల్లి పిల్ల కడుపుగొట్టి" సలిపిన రజాకార్ల దురంతాలను కళ్ళముందు నిల్పుతున్నదీ గేయం. దాశరథి విప్లవ జ్వాలకు పట్టిన అక్షర దర్పణం ఈ గేయం. "మూడుకోట్ల చేతులు నీ మేడను పడతోస్తాయి- నీ మెడనే విడదీస్తాయి- నీకు నిలుచు హక్కులేదు"

"బరాయెనాం నవాబా పరాక్రమం చూపేవా" "దిగిపోవోయ్- తెగిపోవోయ్" అనే మాటలు- మాటలు కాదు మంటలు. దాశరథి కోపాగ్నిధారలు. వృత్త్యనుప్రాసలతో రూపకాలంకారంతో ఈ గీతం శోభిస్తున్నది.

దాశరథి మొదట, నిజాంను ఎదిరించి తిరుగుబాటు చేసిన కమ్యూనిస్టులతో చేయి కలిపి, అజ్ఞాతంగా విప్లవగీతాలను వ్రాసి, నిజాంను ధిక్కరించాడు. ప్రజలను ప్రబోధించాడు. ఆ తరువాత, కాంగ్రెసులో చేరి, తెలంగాణా స్వాతంత్ర్యోద్యమంలో పాల్గొని, తన పద్యాలతో గీతాలతో నిజాంపై నిప్పులు కురుస్తూ, ప్రజలను ఉదుకెత్తించాడు. ప్రజలను ఉఱ్ఱూతలూపాడు. "ఓ నిజాము పిశాచమా!" "ఇదే మాట ఇదే మాట" అనే దాశరథి పద్యగీతాలతోనే ఆనాడు సభలు ప్రారంభమయ్యేవి. "ఇదేమాట"- అనే ఈ గేయంలో దాశరథి, నిజాం నిరంకుశత్వాన్ని నిరసించాడు. గద్దెనుండి 'దిగిపోవోయ్' అంటూ స్వాతంత్ర్యోద్యమ కవితావేశమూర్తియై ముక్తకంఠంతో పర్జన్యంలా గర్జించాడు. దాశరథిని బంధించి, నిజాం ప్రభుత్వం జైల్లో పెట్టింది. శిక్ష అనుభవించి హైదరాబాదు సంస్థానం నిజాం పాలననుండి విముక్తి కావడంతో 17-9-1948 నాడు దాశరథి జైలునుండి విముక్తుడయ్యాడు.

ఈ గేయంలోని ఉర్దూమాటలు, ఆనాటి ఉర్దూ ప్రాబల్యాన్ని దాశరథి ఉర్దూ పాండితినీ ప్రకటిస్తున్నాయి. 'చరిత్ర బొంగరం' అనే పదబంధం, 'కిరీటాలు నేలకొరిగి' అనే మాటలు సహృదయుల హృదయాలను కదలిస్తాయి. రూపకాలంకార శోభితం ఈ గేయం.

## 3. జైలు జీవితం

"జ్వాలా తోరణమాల కొండసిగపై బంధించినారెవ్వరో
బాలా! మాధవమాస వాసరములన్ ప్రత్యగ్ర మాధ్వీక పు
ష్పాలన్ బంభరకంబుకంధరలు తప్పన్ ద్రావి నిద్రింపగా
కాలజ్వాలలు చుట్టుముట్టినవి సౌఖ్యధ్వంసకా గ్రైష్మముల్"

('అగ్నిధార'- 'జ్వాలాతోరణమాల')

**అర్థాలు:–** జ్వాలాతోరణమాల= మంటలు అనే మాలల వరుస, మంటల ద్వారాల పంక్తి; మాధవమాసవాసరములన్= వైశాఖమాస దినాలు– వసంత ఋతుకాలం; ప్రత్యగ్ర= నూతనమైన, పరిశుద్ధమైన; మాధ్వీక పుష్పాలన్= తేనెలూరిన ఇప్పపూలను; బంభర= తుమ్మెదలు అనే; కంబుకంధరలు= స్త్రీలు (ఆడు తుమ్మెదలు), శంఖం వంటి మెడలుగల స్త్రీలు; కాలజ్వాలలు= చావుమంటలు, మృత్యుకీలలు; సౌఖ్యధ్వంసక+అగ్ని+ఓఘముల్= సుఖాన్ని నశింపజేసే అగ్నుల సమూహం.

**వ్యాఖ్య:–** ఈ పద్యం– దాశరథి నిజామాబాదు జైల్లో అనుభవించిన ఒక దారుణ విషాద సంఘటనను తెలుపుతుంది. 1948 జనవరి 11వ తేది రాత్రి రజాకార్లు గుంపులుగా జైల్లో ప్రవేశించి కత్తులతో కర్రలతో ఇనుప సీకులతో ఖైదీలను కొట్టారు. దాశరథికి తలపగిలింది. ఎడమభుజం ఎముక విరిగింది. స్పృహతప్పి పడిపోయాడు. తెల్లవారుజామున– మిత్రులు వచ్చి తలకు కట్లు కట్టారు. ఈ దాడిలో ఖైదీలు కూడా ఎదురు తిరిగి రజాకార్లను కొట్టి తరిమారు. జైలంతా రక్తసిక్తమైపోయింది.

ఈ పద్యంలోని– 'జ్వాలాతోరణమాల' అనే సమాసం జైల్లోని తెలంగాణా వీరఖైదీలకు సంకేతం. కొండసిగ= కొండపై ఉన్న జైలు. "ప్రత్యగ్ర... నిద్రింపగా"– వసంతంలో ఇప్పపూల కల్లు తాగి మత్తెక్కిన తుమ్మెదలలాగా, ఆ రాత్రి ఖైదీలు నిద్రలో ఉన్నారు'– అని భావం. ఇక "కాలజ్వాలలు... సౌఖ్యధ్వంసక+అగ్ని+ఓఘముల్"– అనే సమాసాలు– ఖైదీల సుఖాన్ని ధ్వంసం చేసే అగ్నిపుంజంలాంటి, మృత్యుజ్వాలల లాంటి రజాకార్ల దాడులను వ్యక్తం చేస్తున్నాయి. శ్రీనాథుని పద్యప్రౌఢిని స్ఫురింపజేస్తుంది ఈ శార్దూలపద్యం. రూపకాలంకార భూషితమైన ఈ పద్యం ధ్వనిమంతంగా శోభిస్తున్నది.

*"ఒక కాలమ్మున ఇద్ది దేవళము, వేరొక్కప్డు దుర్గంబు, నే*
*డకటా! జైలయి కానుపించెను; భవిష్యత్కాలమందెట్టి రూ*
*పకమున్ దాల్చునో! కాలచక్ర గమన స్వాభావికావర్త క*
*ల్పకమై విద్యల కాలయంబె యగు నీ బందీలె పాలింపగన్"*

('అగ్నిధార'లోని 'ఇందుపుర దుర్గము'లో)

**అర్థాలు:-** దేవళము= గుడి; దుర్గంబు= కోట; భవిష్యత్కాలమందు= రాగలకాలంలో; రూపకమున్= రూపాన్ని, ఆకారాన్ని; తాల్చునో= ధరిస్తుందో, పొందుతుందో; కాలచక్రగమన= కాలం అనే చక్రం యొక్క నడక; స్వాభావిక= సహజమైన, పుట్టుకచే కలిగినది; ఆవర్త= మరలునట్టి; కల్పకము+ఐ= కల్పవృక్షమై; విద్యలకు+ఆలయంబె= విద్యాలయమే, కళాశాలయే; బందీలె= చెఱసాలలో ఉన్న ఖైదీలే.

**వ్యాఖ్య:-** దాశరథి తెలంగాణ విముక్తి మహోద్యమంలో పాల్గొన్న సమర యోధుడు. వరంగల్లు జైల్లో, నిజామాబాదు జైల్లో, హైదరాబాదులోని చంచల్‌గూడ జైల్లో ఖైదీగా ఉన్నాడు. నిజామాబాదు సెంట్రల్ జైల్లో ఉన్నప్పుడు వ్రాసిన పద్యాలలో ఒకటి ఇది. నిజామాబాద్ జైలు యొక్క చరిత్రను చెప్పాడు ఈ పద్యంలో దాశరథి.

“ఒక కాలంలో ఈ జైలు దేవాలయంగా ఉండింది. ఆ తరువాతి కాలంలో కోటగా మారిపోయింది. ఈనాడేమో జైలుగా కనిపిస్తున్నది. ఇకముందు కాలంలో ఈ జైలు ఏ రూపం ధరిస్తుందో! కాలచక్రగమనం యొక్క స్వభావాన్ని బట్టి చూస్తే, ఇదొక కల్పవృక్షమై సరస్వతీమందిరమవుతుంది. విద్యలకు నిలయమైన ఒక పాఠశాలగానో, ఒక కళాశాలగానో మారుతుంది. ఆ విద్యాలయాన్ని కూడా ఈనాడు ఖైదీలుగా ఉన్న వాళ్ళే, రేపు స్వతంత్రపాలకులై పాలిస్తారు” అని తన విశ్వాసాన్ని వ్యక్తం చేశారు దాశరథి. రూపకం-ఉల్లేఖాలంకృతమైన మత్తేభవృత్తం ఈ పద్యం.

‘రఘునాథుడు’ అనేవాడు ఒక గొప్ప బ్రహ్మచారి. ఆతడు శివాజీ అనుచరుడు. ఆతడు ఇందుపురం (నిజామాబాదు)లో కొండపై దుర్గం నిర్మించాడు. ఆ దుర్గంలో ఒక రామాలయాన్నీ సత్రాలనూ నిర్మించాడు. ఆ ఆలయం రాఘవాలయంగా ఉండింది. దీనికి దరిదాపులో ‘రఘునాథసాగరము’ అనే ఒక పెద్ద చెరువుండిందట. శివాజీ కాలంలో ఇదొక వీరదుర్గం. ఇక నిజాం ప్రభువుల కాలంలో ఈ దుర్గం బందిఖాన (జైలు)గా మారింది.

దాశరథి దార్శనికుడు. నిరుపేదల నెత్తురు చుక్కల్లో ఎన్నోవిప్లవాలను దర్శించగలిగిన క్రాంత దర్శి. ఆ మహాకవి మాటలు భవిష్యత్తును నిర్ణయించి చెప్పాయి. ఈ పద్యం అందుకు నిదర్శనం. దాశరథి చెప్పినట్లుగానే నిజంగానే ఈ జైలు హైదరాబాదు సంస్థానం విముక్తి తర్వాత ప్రభుత్వ కళాశాలగా మారింది. అట్లాగే-

"పరుల హింసించు వారలు బాగుపడెదు- మాట వట్టిది నశియించుమాట నిజము" అని దాశరథి అన్నట్లే జరిగింది. నిజంగానే నిజాం గద్దె దిగిపోయాడు. దానవుల నంతమొందించడానికి "రామకృష్ణావతార ధారణము సేతు"- అన్న మాటలు నిజాలైనాయి. భవిష్యత్తును దర్శించిన కావ్యర్షి దాశరథి.

## 4. తెలంగాణా స్తుతి

"కోటి తెలుగుల బంగారు కొండ క్రింద
పరచుకొన్నట్టి సరసు లోపల వసించి
ప్రొద్దు ప్రొద్దున అందాల పూలు పూయు
నా తెలంగాణ తల్లి కంజాతవల్లి"

"ఎల్లోరా గుహలందున పల్లవించి
వేయి స్తంభాల గుడిలోన విరులు పూచి
శిల్పి యులి ముక్కులో వికసించినట్టి
నా తెలంగాణ, కోటి అందాల జాణ"

"మూడు కోటుల దేవతామూర్తులందు
కోటిమంది వసించెడి హాటకావ
నీ మహోఖండ మీ రమణీయ భూమి
నా తెలంగాణ లేమ సౌందర్య సీమ"

"మూగవోయిన కోటి తమ్ముల గళాల
పాట పలికించి కవితా జవమ్ము కూర్చి
నా కలానకు బలమిచ్చి నడపినట్టి
నా తెలంగాణ కోటి రత్నాల వీణ"

(మహేంద్రోదయం (1955) లోని 'తెలంగాణ'లో)

**అర్థాలు:-** కోటి తెలుగులు= కోటి సంఖ్యలో ఉన్న తెలంగాణ ప్రజలు; సరసు (సరసి)= కొలను; కంజాత వల్లి= తామరతీగ; (కం= నీరు; జాత= పుట్టిన పద్మం; వల్లి= తీగ); ఎల్లోరా గుహలు= ఎల్లోరా అజంతా గుహలు (ప్రస్తుతం ఔరంగాబాదు జిల్లాలో ఉన్నాయి. ఔరంగాబాదు జిల్లా నిజాం రాష్ట్రంలో ఉండింది); పల్లవించి= చిగిరించి; వేయిస్తంభాల గుడి= వరంగల్లు (ఓరుగల్లు)లోని కాకతీయులనాటి గుడి; వికసించినట్టి= పూచినట్టి; జాణ= నేర్పుగల స్త్రీ; దేవతామూర్తులు= దేవతల ఆకారం గలవాళ్ళు (ఆనాటి మూడుకోట్ల తెలుగువాళ్ళు- విశాలాంధ్ర); హాటక+అవనీ మహాఖండము= బంగారు భూమియొక్క గొప్పభాగం; రమణీయభూమి= మనోహరమైన భూమి; లేమ= వనిత; సౌందర్యసీమ= అందాల చోటు- ప్రదేశం (సీమ= రాజ్యం, ఎల్ల అనికూడా అర్థం); మూగవోయిన= పలుకలేని (వాక్స్వాతంత్ర్యంలేని); గళాల= కంఠాల; కవితాజవమ్ము= కవిత్వ వేగం; కోటి రత్నాలవీణ= కోటి రత్నాలు పొదుగబడిన వీణియ.

**వ్యాఖ్య:-** మాతృభూమి అయిన తెలంగాణ పారతంత్ర్య విముక్తికై తన కవిత్వం ద్వారా అమోఘమైన కృషిజేసి, దారుణ కారాగారవాస క్లేశాలను కూడా అనుభవించిన దేశభక్తుడు దాశరథి. ఆతడు విప్పారిన తెలంగాణ కోటిగొంతుల నినాదం. "ననుగని పెంచినట్టి కరుణామయి నా తెలగాణ"- అంటూ తెలంగాణను దయామయి అయిన మాతృమూర్తిగా భావించి, మాతృభూమి గొప్పతనాన్ని సౌందర్యాన్నీ అద్భుతంగా వర్ణించి, ఋణం తీర్చుకున్న తెలంగాణతల్లి ముద్దుబిడ్డడు దాశరథి. ఈ పద్యాలు అందుకు ఉదాహరణలు.

"కోటిమంది తెలుగులకు ఒక బంగారుకొండ ఉన్నది. దానికింద ఒక కొలను ఉంది. ఆ కొలనులో తొలిపొద్దున్నే కమనీయమైన కమలాలు పూచే ఒక తామరతీగ ఉన్నది. ఆ తీగయే తెలంగాణ తల్లి".

ఇలా తెలంగాణ తల్లిని 'కంజాతవల్లి'గా వర్ణించాడు దాశరథి. ఆ తెలంగాణతల్లి ప్రతిదినం పద్మాలలాంటి ప్రజలను కంటుంది. పద్మం పెద్దపువ్వు. అందమైన పువ్వు. పరిపూర్ణ వికాసం గల్గిన పువ్వు. ఆ దివ్యమైన పుష్పం మన్మథుని ప్రథమబాణం. పద్మం భారతజాతీయ పుష్పం. అందుకే పద్మశ్రీ, పద్మభూషణ్, పద్మవిభూషణ్ బిరుదులను వివిధ రంగాలలో వికాసాన్ని సాధించిన మనీషులకు ప్రసాదిస్తుంది ప్రతిఏటా భారత ప్రభుత్వం. "తెలంగాణతల్లి కంజాతవల్లి"- ఇదొక సుందర దృశ్యం.

ii) "నా తెలంగాణ కోటి అందాలను తనలో పొదుగుకొన్న జాణతనంగల ఒక శిల్ప సుందరి. ఆ శిల్పసుందరి ఎల్లోరా గుహల్లో చిగిరించింది. ఓరుగల్లులోని వేయిస్తంభాల గుడిలో రేకులు విప్పింది. ఒక శిల్పి యొక్క ఉలి ముక్కులో నిండుగా, కనుల పండువుగా వికసించింది".

ఈ రెండవ పద్యంలో దాశరథి తెలంగాణా కమనీయ శిల్పవైభవాన్ని ఎత్తి చూపాడు సోదాహరణంగా. 'ఎల్లోరా' ఉన్న ఔరంగాబాదు జిల్లా ఒకనాడు తెలంగాణలో ఉండింది. ఈనాడు ఆ జిల్లా మహారాష్ట్రలో ఉన్నది. ఇప్పుడు మహారాష్ట్రలో ఉన్న ఐదు జిల్లాలు నిజాం కాలంలో తెలంగాణలోనే ఉండేవి.

iii) "మొత్తం మూడు కోట్లున్న తెలుగువాళ్ళు- ముక్కోటి దేవతలు. వారిలో కోటి దేవతలు నివసించే తెలంగాణ- సువర్ణ మహాభూమిలో ఒక భాగం. ఇది చాలా మనోహరమైనది. అందుకే "నా తెలంగాణ లేమ సౌందర్యసీమ".

స్వర్ణసపందకూ, సౌందర్యలక్ష్మికీ నిలయమైన ప్రదేశం ఈ 'తెలంగాణ' అని వర్ణించాడు దాశరథి. 'దేవతామూర్తులందు' అనే మాటలు తెలుగు ప్రదేశం దివ్యమైనదనీ, 'హాటకావనీ మహాఖండము'- అనే సమాసం సువర్ణ సంపదకు ఆలవాలమైనదనీ తెలుపుతున్నాయి. ఈ సమాసం దాశరథి పాండితినీ ధారాశుద్ధినీ వ్యక్తం చేస్తున్నది. 'సీమ' అంటే సరిహద్దు, ఎల్ల- అని కూడా అర్థం. కాబట్టి 'సౌందర్య సీమ' అంటే సౌందర్యానికి సరిహద్దు- పరాకాష్ఠ అనికూడా చెప్పవచ్చు.

iv) "పలుకలేని కోటి ప్రజల గొంతులచే, తెలంగాణ పాటలు పాడించింది. నా కవిత్వానికి వేగాన్ని ఇచ్చింది. నా కలానికి బలమిచ్చి, నన్ను ముందుకు నడిపించిన నా తెలంగాణ కోటి రత్నాలు పొదిగిన వీణ" అని దాశరథి తెలంగాణను 'రత్నవీణ'గా భావించి వర్ణించాడు. తెలంగాణ రతనాలవీణ కాబట్టి- అది పలికింది, పాడింది, కోటిమందిచే దుష్టుడైన నిజాం నవాబునకు వ్యతిరేకంగా పలికించింది, పాడించింది. కవి అయిన దాశరథి కలానికి బలాన్నీ వేగాన్నీ ఉద్యమ స్ఫూర్తినీ ప్రసాదించింది. ఉల్లేఖాలంకృతాలైన తేటగీతులివి.

'వీణ' అనగా స్వరాలను జనింపజేసేది అని వ్యుత్పత్త్యర్థం. తల్లి తెలంగాణ పట్ల దాశరథికిగల ప్రేమ, భక్తి మాటల కందనిది. "నా తెలంగాణ కోటిరత్నాల వీణ" అనే పాదాన్ని అనేక పద్యాలలో ప్రయోగించాడు దాశరథి.

"ఓ నిజాము పిశాచమా" అనే పద్యంలోని, చివరి పాదం- "నా తెలంగాణ కోటి రత్నాల వీణ", "అగ్ని పుష్పాలు పూచి ఉద్విగ్నమాన- సమున చీకట్లు కాల్చి వెచ్చదనమొసగి- కవులకంఠాల శాంతిగీతి వెలలించె- నా తెలంగాణ కోటి రత్నాల వీణ" (1946లో చెళ్లపిళ్లగారి సన్మానసభలో ఆంధ్రసారస్వత పరిషత్తు పక్షాన దాశరథి సమర్పించిన 'పూజా పంచకం'లోని పద్యం).

*"వేయి స్తంభాల్ గుడి వ్రాయించుకొన్నది*
*నా చేత ఏక శిలా చరిత్ర"*

అనే పద్యంలోని, చివరి తేటగీతిలో-

*"నాకు తల్లివి నీవు నే నీకు సుతుడ*
*అల్లనాటికి నేటికి అనుదినమ్ము*
*మోయుచున్నావు నా గళమ్మున కలాన*
*నా తెలంగాణ! కోటి రత్నాల వీణ!"*

('రుద్రవీణ'లోని 'తెలంగాణ' అనే అంకిత పద్యాలలో)

*"నా తెలంగాణ కోటి రత్నాలవీణ*
*తీవియలు తెగి విరిగి నదించకుండె"* ('అగ్నిధార' లోని 'ముస్సీతటము'లో)

అనే పద్యంలోని మొదటి చరణంలోనూ చూడవచ్చు.

"నా తెలంగాణ కోటి రతనమ్ముల వీణ మహాంధ్ర రాష్ట్ర సంగీతము పాడె నేడె" 'మహాంధ్రోదయము'లోని 'కోటి గొంతులు'లో). ఇలా తెలంగాణ తల్లి పట్ల దాశరథికి గల అనురాగం అవర్ణనీయం; నాన్యతో దర్శనీయం.

## 5. విశాలాంధ్రకై చేసిన కృషి (మహాంధ్రోద్యమం)

*"పాటలు పాడితిన్ తెలుగు బాబులు నిద్దుర మేలుకోగ, పో*
*రాటము సేయగా, కరకు రాచరికమ్మును కూలద్రోయగా*
*కోటి గళాల నొక్కకడ గూర్చితి, విప్లవశంఖ మొత్తితిన్*
*నాటికి నేటికిన్ తెలుగునాటికి వెచ్చదనమ్ము లూదితిన్"*

**అర్థాలు:-** తెలుగు బాబులు= పూజ్యులైన తెలుగువాళ్ళు; బాప్- హిందీమాట- తండ్రి, పినతండ్రి అని అర్థం; పోరాటము= యుద్ధం; కరకు రాచరికమ్మును= క్రూర ప్రభుత్వాన్ని; కోటిగళాలన్= కోటి కంఠాలను, కోటిమంది తెలంగాణా ప్రజలను; విప్లవ శంఖము= విప్లవం అనే శంఖాన్ని; విప్లవము= శాసనాన్ని ఉల్లంఘించడం, దుర్వ్యవస్థను ధిక్కరించడం; వెచ్చదనమ్ములు+ఊదితిన్= చైతన్యాన్ని ధ్వనింపజేశాను, చైతన్యాన్ని కలిగించాను.

**వ్యాఖ్య:-** తెలంగాణాకు అంకితమైన రుద్రవీణ (1950) కావ్యంలోని అంకిత పద్యం ఇది. తాను చేసిన కృషిని గూర్చి దాశరథి స్వయంగా చెప్పుకొన్న పద్యమిది.

"తెలుగుబాబులను నిద్రమేల్కొల్పగా పాటలు పాడాను, కరకు రాచరికాన్ని నెరపిన నిజాం నవాబుతో పోరాటం చేయడానికీ, ఆతని ప్రభుతను కూలదోయడానికీ కోటి ప్రజలను ఏకం చేశాను, విప్లవశంఖ మూదాను, తెలుగు గుండెలను ఉద్దీప్తం చేశాను"- అని ఈ పద్య భావం. 1943-49 మధ్యకాలంలో తెలంగాణ అంటే దాశరథి, దాశరథి అంటే తెలంగాణ. తెలంగాణా- 'పీడిత ప్రజావాణికి మైక్' దాశరథి. తెలంగాణాను తల్లిగా సంబోధించి, దాశరథి అనేక పద్యాలు వ్రాశారు. "నను గని పెంచినట్టి కరుణామయి నా తెలంగాణ" "నాకు తల్లివి నీవు నేనీకు సుతుడ- నల్లనాటికి నేటికి నను దినమ్ము- మోయుచున్నావు నా గళమ్మున కలాన- నా తెలంగాణ కోటి రత్నాలవీణ" వంటి పద్యాలు అందుకు నిదర్శనం. వృత్త్యనుప్రాసంతో రూపకంతో ఈ ఉత్పల పద్యం శబ్ద అర్థాలంకృతులతో అందగిస్తున్నది.

> "నాలుగు కోట్ల తెల్గుల మనమ్ములలోన మహాంధ్రలక్ష్మి దీ
> పాలను పెట్టినట్టి శుభవాసరమియ్యది, నూర్లయేండ్ల స్వ
> ప్నాలు నిజాలుగా మొలచి పందిరిపాకి సుమాలు పూచి, లో
> కాలకు సౌరభమ్ములను కానుక వెట్టిన రోజు, పైదలీ!"

('అమృతాభిషేకము' 'మహాంధ్ర')

**అర్థాలు:-** మహా+ఆంధ్రలక్ష్మి= విశాలమైన తెలుగుదేశం- ఆంధ్రప్రదేశం అనే లక్ష్మి; శుభవాసరము= శుభదినం; స్వప్నాలు= కలలు; సుమాలు= పూలు; సౌరభమ్ములను= సువాసనలను; పైదలీ!= ఓ వనితా!

**వ్యాఖ్య:**– తెలంగాణా విముక్తితో తృప్తిపడక, మూడు కోట్ల తెలుగు అన్నదమ్ముల హృదయవీణా సమైక్య గాన సంసిద్ధికోసం తపించి, విశాల కవితా విపంచిపై మహాంధ్రోదయ రాగాలను పలికించాడు దాశరథి. ఈ పద్యంలోని మహాంధ్రలక్ష్మి-ఆంధ్రప్రదేశ లక్ష్మియే.

"ఓ తెలుగు మహిళా! మహాంధ్రలక్ష్మి నాలుగు కోట్ల తెలుగుల మనస్సులలో దీపాలు పెట్టిన శుభదినమిది. శతాబ్దాలనుండి కంటున్న కలలు నిజాలుగా మొలచి పందిళ్ళపై తీగెలుగా సాగినాయి, పూలు పూచినాయి, సకల ప్రజలకు సౌరభాలను కానుకలుగా పంచినాయి. అలాంటి పర్వశుభసమయమిది"– అని ఈ పద్య భావం. తెలుగు మహిళను తెలుగు కవితా సరస్వతిగా సంభావించాడు దాశరథి. "నూర్లయేండ్ల స్వప్నాలు నిజాలుగా మొలచి" అని అనడంలోనే కవిత్వం మొలచింది ఈ పద్యంలో. రూపకాలంకార శోభితమైన ఈ పద్యం ఉత్పలమాలగా పరిమళించింది.

"నేను రా తెలగాణ నిగళాలు తెగగొట్టి
ఆకాశమంత యెత్తార్చినాను
నేను రాక్షసి గుండె నీరుగా పద్యాలు
పాడి మానవుని కాపాడినాను
నేను వేస్తంభాల నీడలో నొక తెల్గు
తోట నాటి సుమాలు దూసినాను
నేను పోతన కవీశాను గంటములోని
ఒడుపుల కొన్నింటి బడసినాను

కోటితమ్ముల కడ రెండు కోట్ల తెలుగు
టన్నలను గూర్చి వృత్తాంత మందజేసి
మూడు కోటుల నొక్కటే ముడి బిగించి
పాడినాను మహాంధ్ర సౌభాగ్యగీతి"

(మహాంధ్రోదయం (1955))

**అర్థాలు:–** నిగళాలు= సంకెళ్ళు; ఆర్చినాను= అఱిచినాను, బొబ్బరించాను; నీరుగాన్ (నీఱుగాన్)= భస్మం కాగా, భస్మమయ్యేట్లుగా; వేస్తంభాల= వెయ్యి కంబాల; కవీశాను= కవి+ఈశాను= కవీశ్వరుని (శ్రేష్ఠుడైన కవిని); గంటము= లేఖిని, కలం; ఒడుపుల= లాభాలను, సొగసులను, పూనికలను; పడసినాను= పొందాను; వృత్తాంతము= సమాచారం, కథ; మహాంధ్ర సౌభాగ్య గీతి= విశాలాంధ్ర (ఆంధ్రప్రదేశ్) అనే సుసంపన్న గీతాన్ని.

**వ్యాఖ్య:–** దాశరథి 'విశాలాంధ్ర' మనకుండ 'మహాంధ్ర' అన్నాడు. ఆ మహాకవికి అదే ఇష్టం. ఆ దృష్టితోనే మహాంధ్రోదయ కావ్యం వెలువరించాడు. దాశరథి తన వ్యక్తిత్వ మహత్త్వాన్ని చెప్పాడీ పద్యంలో.

"తెలంగాణ సంకెళ్ళను తెగగొట్టి ఆకాశమంత ధ్వనించేలాగా అరిచింది నేనే. నిజాం రాక్షసి గుండె భస్మమయ్యేలాగా పద్యాలు పాడి, నా ప్రజలను కాపాడింది నేనే. ఓరుగంటి వేయి స్తంభాల గుడి నీడలో తెలుగు తోట నాటి, పెంచి దాని పూలను దూసింది నేనే. పోతన కవీశ్వరుని కవిత్వంలోని కొన్ని పోకడలను అనుసరించింది నేనే. తెలంగాణలోని కోటి తమ్ములను 'ఆంధ్ర'లోని రెండు కోట్ల తెలుగుటన్నలతో కలిపి, ఇద్దరినీ ఏకంచేసి సమైక్య మహాంధ్ర గీతాన్ని పాడాను నేను"– అని ఈ పద్యంలోని భావం. 'ఎత్తుగడల' లోనే పద్యం గొప్పదనం ఉంది. 'నేనురా' అనడంలో తెలుగుదనం ఒలికింది.

కవిత్వాన్ని జీవితాన్నీ దేశంకై వినియోగించిన దేశభక్తుడు దాశరథి. ఈ సీసపద్యం ఉల్లేఖ–రూపకాలంకారాలతో హృద్యంగా సాగింది.

## 6. భారత జాతీయ దృష్టి (దేశభక్తి)

*"ఓ జనతా నతాంజలి పుటోజ్జ్వల దివ్య కవోష్ణ రక్త ధా*
*రా జలసిక్త పాదకమల ద్వయశోభి మనోజ్ఞ దేహ రే*
*ఖా జయభారతీ! యుగయుగమ్ముల పున్నెపు పంటవీవు నీ*
*పూజకు తెచ్చినాడ నిదె పొంగిన గుండియ నిండు పద్దెముల్"*

(అగ్నిధార– 'జయభారతీ!')

**అర్థాలు:-** జనతా= జనసమూహంచేత; నత+అంజలిపుట= నమస్కరింప బడునప్పుడు, వారి దొప్పలలాంటి దోసిళ్ళయొక్క; ఉజ్జ్వల= ప్రకాశిస్తున్న; దివ్య= దేవతా సంబంధమైన, మంచి, ఒప్పైన; కవోష్ణ= ఇంచుక వేడిగల; రక్తధారాజల= అనురాగంచేత ఎఱ్ఱబడిన జలప్రవాహంచేత; సిక్త= తడిసిన; పాదకమల ద్వయ= రెండు పాదపద్మాల చేత; శోభి= ప్రకాశించే; మనోజ్ఞ= మనోహరమైన; దేహరేఖా జయభారతీ!= శరీర సౌందర్యం గల్గిన జయశీలంగల ఓ భారతమాతా! (భారతీ= సరస్వతీ); యుగయుగమ్ముల= దీర్ఘకాలపు, అనేక సంవత్సరాల కాలపు; పున్నెపు పంటవు+ఈవు= పుణ్యఫలానివి నీవు; పొంగిన గుండియ= భక్తిచే పొంగిన హృదయంలోనుండి ఉబికిన; నిండు పద్దెముల్= సంపూర్ణత్వం గల్గిన పద్యాలు; పూజకు= అర్చనకు, ఆరాధనకోసం; తెచ్చినాడను= రచించాను.

**వ్యాఖ్య:-** దాశరథి జాతీయకవి. ఆతని దేశభక్త్యావేశానికి ఎత్తిన పతాక ఈ పద్యం. "జనుల అంజలిపుటాల అరుణ కవోష్ణ జలధారలచే తడిసిన పాదపద్మాలచే శోభిస్తూ సుందర దేహమూ, జయశీలమూ కలిగిన ఓ భారతమాతా! భారతీయుల యుగయుగాల పుణ్యాల పంటవు నీవు. నా పొంగిన గుండెలోని నిండైన పద్యాలను నీ పూజకోసం తెచ్చాను ఇవిగో! స్వీకరించవమ్మా!" అని ప్రార్థించాడు దాశరథి భారత మాతను. భారతమాతకు దాశరథి సమర్పించిన పద్య పూజాపుష్పాలివి.

దాశరథి బాల్యంలో తండ్రివద్ద సంస్కృత పంచకావ్యాలను, కాదంబరి బిల్హణీయం వంటి కావ్యాలను చదువుకొన్నాడు. విశేషించి జన్మతః ఆతడు కవి. ఈ పద్యం పాండితీ స్ఫోరకం. పద్యంలోని మొదటి రెండున్నర చరణాల దీర్ఘ సమాసం ఆతని పాండితినీ, అఖండ దేశభక్తినీ చాటుతున్నది. కవితాధార కమనీయంగా అలలెత్తి ప్రవహిస్తున్నట్లనిపిస్తుంది పద్యాన్ని చదువుతుంటే సహృదయులకు. ఈ ఉత్పల పద్యంలో రూపకాలంకారం చోటు చేసికొన్నది.

*"జండా ఒక్కటె మూడు వన్నెలది; దేశం బొక్కటే భారతా*
*ఖండాసేతు హిమాచలోర్వర; కవీట్కాండమ్ములోనన్ రవీం*
*ద్రుండొక్కండె కవీంద్రు డూర్జిత జగద్యుద్ధాలలో శాంతి కో*
*దండోద్య ద్విజయుండు గాంధి ఒకడే తల్లీ! మహాభారతీ!*

('అగ్నిధార' 'జయభారతీ')

**అర్థాలు:-** భారత+అఖండ+ఆసేతు హిమ+అచల+ఉర్వర= సముద్రతీరం (వంతెన) నుండి హిమగిరి వరకు వ్యాపించిన సమగ్ర భారతదేశం; కవీట్ కాండమ్ములోనన్= కవీశ్వరుల సమూహంలో; ఊర్జిత= దృఢమైన, గట్టి; జగత్+యుద్ధాలలో= ప్రపంచ సమరాలల్లో; శాంతికోదండ+ఉద్యత్+విజయుండు= శాంతి అనే ధనుస్సును ఎత్తిన జయశీలం గల్గిన అర్జునుడు, శాంతి ధనుస్సును ధరించి విజయం సాధించిన గాంధీజీగారు; మహాభారతీ!= ఓ విశాల భారతమాతా!

**వ్యాఖ్య:-** ఆదినుంచి దాశరథి అభ్యుదయ భావనలో జాతీయత, దేశభక్తి కలిసి ఉన్నాయి. తెలంగాణా విముక్తి మహోద్యమంలో పాల్గొంటూనే దాశరథి సమాంతరంగా సాగే భారత జాతీయోద్యమాన్ని చూశాడు. స్వతంత్ర భారత పతాకాన్ని చూశాడు. సత్యాహింసలను ఆయుధాలుగా సమరం సాగించిన గాంధీజీని చూశాడు. జాతి పునరుజ్జీవనం కోసం కృషి చేసిన రవీంద్రుణ్ణీ చూశాడు. ఫలితంగా దేశభక్తుడైన దాశరథి హృదయం నుండి ఈ పద్యం సముజ్జ్వలంగా ఉద్గమించింది.

"భారతీయుల కందరికీ జాతీయ త్రివర్ణ పతాకం ఒక్కటే; అఖండ భారతదేశం ఒక్కటే; రవీంద్ర కవీంద్రుడొక్కడే; ప్రపంచ యుద్ధాలలో శాంతి కోదండం ధరించి, విజయుడైన వాడు గాంధీ ఒక్కడే- భరతమాతా!" అని ఎలుగెత్తి చాటాడు- భారతమాతకు పద్యపుష్పాలను సమర్పించాడు దాశరథి.

చదువుతుంటే- పద్యం ఎత్తుగడలోనే- దేశభక్తి నగారా మోగినట్లున్నది. దాశరథికి శబ్దంపై ఎంత అధికారముందో ఈ పద్యం ప్రకటిస్తుంది. ఈ శార్దూల పద్యంలో రూపకాలంకారం భాసిస్తున్నది.

## 7. విశ్వమానవత

"డెందము గల్గు వారలకు టిక్కటుతో పనిలేదు, దీనిలో
ఎందరికైన చోటు నిడు నీ కవితా నవపుష్పకమ్ము- మ
ధ్యందిన భానుమండలము నైనను, చల్లని పండువెన్నెలల్
చిందెడు చంద్రమండలము చేరుటకున్ సతతమ్ము సిద్ధమే"

(కవితా పుష్పకం)

**అర్థాలు:–** డెందము= హృదయం; కవితా నవపుష్పకమ్ము= కవిత్వం (కావ్యం) అనే కొత్త (అభినవ) పుష్పక విమానం (పుష్పక విమానం కుబేరునిది. ఇది మణిమయం. కుబేరుణ్ణి జయించి, రావణుడు ఈ విమానాన్ని తీసికొన్నాడు. రావణుని వధ తర్వాత ఈ విమానం శ్రీరాముణ్ణి చేరింది. ఈ విమానంలో ఎందరు కూర్చున్నా, మరొకరు కూర్చోవడానికి తగినంత చోటు మిగిలి ఉంటుంది. ఇది ఈ విమాన ప్రత్యేకత); మధ్యం దినభాను మండలమున్= మట్టమధ్యాహ్న సమయంలోని సూర్యగోళాన్ని; సతతమ్ము= ఎల్లప్పుడు; సిద్ధమే= ఆయత్తమే, ఎదుట నిలిచేదే, తయారే.

**వ్యాఖ్య:–** దాశరథి కవితా పుష్పకం (1966) కావ్యాన్ని మాన్యశ్రీ దేవులపల్లి రామానుజరావుగారికి అంకితం చేస్తూ కావ్యాన్ని గూర్చి చెప్పిన పద్యం ఇది. "నా కవితా పుష్పక విమానం ఎక్కేవారికి, టిక్కటు అవసరం లేదు. హృదయ ముంటే చాలు. ఈ విమానం ఎందరికైనా చోటిస్తుంది. మధ్యాహ్న సూర్యమండలానికైనా, పండు వెన్నెలలు కురిసే చంద్రమండలానికైనా ఈ విమానంలో పోవచ్చు. అది ఎప్పుడూ సిద్ధంగా ఉంటుంది".

మంచి హృదయమే దాశరథి కవితా పుష్పకంలో ఎక్కడానికి అర్హత నిచ్చే టిక్కటు. డబ్బు అక్కరలేదు. "ఏకత్వం అనే పెట్రోలుతో ఎగురుతుంది ఆ విమానం, ఏకత్వం చెడిపోయిన నాడు అది కూలుతుంది. కనుక ఏకంగా ఉందాం, ఏకంగా విందాం కవిత. ఏకంగా లోకాన్ని స్వర్గం చేసి విహరిద్దాం" అని కూడా అన్నాడు దాశరథి 'కవితా పుష్పకం' అనే మరో వచన కవితలో. దాశరథి హృదయవాది, సమైక్యవాది– అని ఈ కవిత తెలుపుతున్నది. ఈ ఉత్పల పద్యం రూపకాలంకార భాసితం.

*"నా కుల మెద్దయో యెరుగ, నా మత మెయ్యదియో యెరుంగగా*
*లేక దశాబ్దముల్ గడచె, లేళ్లది యేళ్లది రాళ్ల దేకులం*
*బా కులమే మదీయము, నరాళికి లేని విరాళి గుండెకున్*
*తాకగ వానిలో కలదు, దాశరథీ! కరుణాపయోనిధీ!*

(అభినవ దాశరథీ శతకం)

**అర్థాలు:-** ఎద్దియో= ఏదో, ఏమిటో; ఎయ్యదియో= ఏ+అది+ఓ= ఏద్రో; దశ+అబ్దముల్= పది ఏండ్లు; కడచె= దాటె, జరిగిపోయె; లేళ్లది= జింకలది (లేడి-లేళ్లు); రాళ్లది= శిలలది; మదీయము= నాది; నర+ఆళి= నరుల సమూహం, మానవ సంఘం; విరాళి= వలపు, ప్రేమ, భక్తి.

**వ్యాఖ్య:-** కులమతాలకు అతీతమైన విశాల విశ్వహృదయం దాశరథిది. ఆతని విశ్వమానవతావాదాన్ని ఎత్తిచూపే పద్యం ఇది. "తెలంగాణలోని కోటి ధీరుల గళధ్వనినె కాక, ఇలా గోళమందుండెడి ఎల్లరి శబ్దాన్ని నేను- నా పేరు ప్రజాకోటి- నా ఊరు ప్రజావాటి" అని చెప్పగలిగిన విశ్వకవి దాశరథి.

"నా కులమేదో, నా మతమేదో నాకు తెలియదు. అలా దశాబ్దాలు గడచిపోయాయి. లేళ్లది (జింకలది), ఏళ్లది (నదులది), రాళ్లది ఏ కులమో ఆ కులమే నాది. మానవులకు లేని ప్రేమ (విరాళి) వాటికి ఉన్నది. వాటి ప్రేమ, హృదయాలను తాకి, స్పందింపజేస్తున్నది" ఇది ఈ పద్యం భావం.

ఈ పద్యం దాశరథి భావావేశాన్ని పదపదాన పొదుగుకొన్నది. 'నరాళికి లేని విరాళి'- అనడం ఎంత అందమైన అభివ్యక్తి. కాయంచేత దాశరథి వామనుడైనా కవిత్వంచేత త్రివిక్రముడు. వృత్త్యనుప్రాసలతో రూపకాలంకార శోభతో శోభించే ఈ పద్యం ఉత్పలమాల.

*"తెలంగాణలోని కోటి- ధీరుల గళధ్వనినె గాక*
*ఇలా గోళమందుండెడి- ఎల్లరి శబ్దాన్ని నేను*
*నా పేరు ప్రజాకోటి- నా ఊరు ప్రజావాటి"*

*"గతాన్ని కాదనలేను- వర్తమానం వద్దనబోను*
*భవిష్యత్తు వదలుకోను- కాలం నా కంఠమాల*
*నా పేరు ప్రజాకోటి- నా ఊరు ప్రజావాటి"*

*"ఎర్రజెండ పట్టుకోని- ఎగసిపోవు వాడితోటి*
*పచ్చజండ పట్టుకోని- పరుగుతీయువాని తోటి*
*మైత్రీబంధం కూర్చే- మహాశక్తి నాకున్నది"*

"హృదయం వినా నా దగ్గర- ఏ వస్తువు లభింపదు
ఉదయం వినా నా కంటికి- ఏ వస్తువు రుచింపదు"

('పునర్నవం'లోని 'నా పేరు ప్రజాకోటి')

**అర్థాలు:-** ఇలాగోళం= భూగోళం; ప్రజాకోటి= అసంఖ్యాక ప్రజాసమూహం; ప్రజావాటి= ప్రజల ఇండ్ల వరుస- 'వాటి' అంటే 'తోట' అని కూడా అర్థం; మైత్రీబంధం= చెలిమి ముడి.

**వ్యాఖ్య:-** త్రిశ్రగతిలో నడిచిన ఈ గేయం దాశరథి విశ్వవిశాల వ్యక్తిత్వాన్ని చాటుతున్నది.

"తెలంగాణలోని... ప్రజావాటి".

దాశరథి మహాకవి. ఆతడు తెలంగాణలో జన్మించిన కవి అయినా, తెలంగాణను దాటి, మహాంధ్రను దాటి, భారతదేశాన్ని దాటి విశ్వమంతటిని సందర్శించిన విశ్వప్రజామిత్రుడు. ప్రపంచ ప్రజా హృదయధ్వని ఆయనది. ఆ మహాకవి హృదయంలో భూగోళం అంతా ఇమిడి ఉంది-

"నేనురా తెలగాణ నిగళాల తెగగొట్టి
ఆకాశమంత యెత్తార్చినాను" అన్నాడు. అంతేకాదు-

"మూడు కోటుల నొక్కటే ముడి బిగించి
పాడినాను మహాంధ్ర సౌభాగ్యగీతి"

అని సగర్వంగా చెప్పుకొన్నాడు. అంతటితో ఆగిపోలేదు ఆతడు-

"జండా ఒక్కటె మూడు వన్నెలది దేశం బొక్కటే భారతా
ఖండాసేతు హిమాచలోర్వర"

అంటూ భారతజాతి సమగ్రతను చాటాడు. దానితో ఆ మహాకవి ప్రస్థానం ఆగలేదు. కవితా పుష్పక మెక్కాడు. విశ్వాన్ని దర్శించాడు. ఆ కవితా పుష్పకంలోకి హృదయమున్న వాళ్ళందరినీ ఆహ్వానించాడు. అందరం ఏకంగా ఉండి లోకాన్ని స్వర్గం చేద్దామని ప్రకటించిన సమైక్యవాది దాశరథి. అందుకే "నా పేరు ప్రజాకోటి- నా ఊరు

ప్రజావాటి" అని అనగల్గినాడు. ఏ దేశ ప్రజలకు అన్యాయం జరిగినా, ప్రజల పక్షాన నిలబడి గర్జించాడు. ఆతడు వ్రాసిన అనేక కవితలు అందుకు అక్షర సాక్ష్యాలు.

"గతాన్ని కాదనలేను... నా ఊరు ప్రజావాటి".

మహాకవులు మూడు కాలాలకు ముడిబిగించే సూత్రధారులు. మానవచరిత్ర సౌధానికి గతం పునాది. వర్తమానం స్తంభాలూ గోడలూ. ఇక సౌధగోపురం సుదూర భవిష్యత్తుకు సంకేతం. సకలజన దర్శనానికి అవకాశం. అందువల్ల గతాన్ని కాదనక, వర్తమానాన్ని వద్దనక, భవిష్యత్తుకు స్వాగతం పలికే క్రాంతదర్శులు కవులు. అందుకే "కాలం నా కంఠమాల" అన్నాడు మహాకవి దాశరథి. కవులు మహర్షులూ మార్గదర్శులూ, రససిద్ధులూ యశఃకాయులూ. కవితామృతాన్ని సాధించి పంచే అమరమూర్తులు కవులు. "నాకు స్థలాన్ని ఆక్రమించుకోవడం మీద నమ్మకం లేదు. కాలాన్ని ఆక్రమించాలనే ఆశ తప్ప" అని అన్నాడు. 'పునర్నవం' కావ్యంలోని 'మననం'లో దాశరథి. కాల మర్మజ్ఞుడు దాశరథి.

"ఎర్రజెండా పట్టుకోని... నాకున్నది".

దాశరథి ఏ సిద్ధాంతాలకూ ఇజాలకూ అమ్ముడువోని స్వేచ్ఛాపథ సంచారి. ప్రజాహితం కోసం పాటుపడే పార్టీలన్ని ఆ మహాకవి హృదయ సంఘంలో సభ్యత్వం కలిగినవే. కమ్యూనిస్టులతో కాంగ్రెసువారితో స్నేహం చేసిన ఆతని జీవిత సన్నివేశాలు అందుకు నిదర్శనం. కాల్పనికతనూ, అభ్యుదయాన్నీ, నవ్యసంప్రదాయాన్నీ, దేశాభిమానాన్నీ, జాతీయతనూ సామ్యవాదాన్ని, ప్రజాస్వామ్యాన్నీ, విశ్వమానవతనూ, శాంతి విప్లవ చైతన్యాన్నీ, ఆత్మీయమైన శృంగారాన్నీ, అంగారాన్నీ- అన్నింటినీ తన విశాల కవితా విశ్వంభరలో పొదుగుకొన్న విశ్వమైత్రీమూర్తి దాశరథి. ఆయనతో కలిసి మాటాడిన వాళ్ళందరినీ ఆయన హృదయం ఆకర్షించింది. అందరినీ తన చిత్తానికి హత్తుకొనే మహాశక్తి ఆయనకున్నది. అందుకే దాశరథి అనగలిగాడు- ఏమని? "ఎవడైనా మానవుడే- ఎందుకు ద్వేషించడాలు? రాక్షసినైనా మైత్రికి- రానిత్తును భయంలేదు- దేవతనైనా తోడ్కొని తెత్తును భేదమ్ము రాదు" అని.

"హృదయం వినా... రుచింపదు".

దాశరథి జన్మతః కవి. అందుకే ఆతనిది హృదయవాదం. ఆతని హృదయం మానవతకు నిలయం. ఆ హృదయం నిరంతరం ఉదయాన్నే అపేక్షిస్తుంది. ఆ హృదయం అనవరతం తిమిరంతో సమరం సాగిస్తుంది. అరలూ పొరలూ లేని ఆతని అంతరంగం శిశుహృదయం లాంటిది. కృత్రిమాల చీకటి దాశరథికి నచ్చదు. సహజమైన సౌరభం ఆతణ్ణి వీడిపోదు. అగ్గితో ఆడుకొనే, కత్తితో కవాతు చేసే- "ఎత్తైన గిరిశిఖరం మీంచి ఎగిరి" లంఘించే పసివాని మనస్తత్వం దాశరథిది. ఏదో చెప్పాలనే వేదన, ఏవో వెలుగు పుటలు విప్పాలనే క్షోభ, అవి ఆతని గుండెను కలత పెట్టుతాయి. "క్షోభలేంది రాయలేను- అది నాకు వరం" - "నాది బహు ఉద్రేక ప్రకృతి. నిప్పులో దూకే పాత వీరశైవులకీ, పీరీలు మోసే తురకలకీ నాకూ ఇందులో తేడా లేదు. క్షోభ, ఉద్వేగం నాతో ఏవేవో రాయించాయి, రాశాను"- అనే మాటలు దాశరథి తెల్లని హృదయాన్ని తెలుపుతాయి. అందుకే ఆ మహాకవి అన్నాడు- 'కవితాపుష్పకం' కావ్యంలో-

*"డెందము గల్గు వారలకు టిక్కటుతో పనిలేదు దీనిలో*
*ఎందరికైన చోటు నిడు నీ కవితా నవపుష్పకమ్ము" అని.*

అందుకే అంటున్నాడు దాశరథి-

*"హృదయం వినా నా దగ్గర ఏ వస్తువు లభింపదు*
*ఉదయం వినా నా కంటికి ఏ వస్తువు రుచింపదు" అని.*

# 8. దాశరథి వ్యక్తిత్వం

*"నా గీతావళి ఎంత దూరము ప్రయాణంబౌనో; అందాక ఈ*
*భూగోళమ్మున అగ్గివెట్టెదను; నిప్పుల్ వోసి హేమంత భా*
*మా గాంధర్వ వివాహమాడెదను; ద్యోమణ్యుష్ణ గోళమ్ముపై*
*ప్రాగాకాశ నవారుణాస్ర జలధారల్ చల్లి చల్లార్చెదన్"*

(అగ్నిధార- 'అంతర్నాదము')

**అర్థాలు:-** గీత+ఆవళి= గేయాల సముదాయం; హేమంత భామాగాంధర్వ వివాహము+ఆడెదను= హేమంత ఋతువు (చలికాలం) అనే వనితను గాంధర్వ వివాహం

చేసుకుంటాను. గాంధర్వ వివాహం: ఎనిమిది రకాల వివాహాలలో 'గాంధర్వం' ఒకటి. కన్య, వరుడు- ఇద్దరూ పరస్పరం ప్రేమించుకొని స్వేచ్ఛతో చేసికొనే పరిణయం. మిగిలిన ఏడు వివాహాలు- బ్రాహ్మం, దైవం, ఆర్షం, ప్రాజాపత్యం, ఆసురం, రాక్షసం, పైశాచం- అనేవి. ద్యోమణి+ఉష్ణగోళమ్ముపై= సూర్యుని వేడిగోళంమీద, మండుతున్న సూర్య మండలంపై; ప్రాక్+ఆకాశ= తూర్పుదిక్కునందలి ఆకసంలో ఉండే, నవ+అరుణ+అస్రు జలధారల్= కొత్త ఎఱ్ఱని సూర్యుని కిరణాలు అనే నెత్తుటి జలధారలను.

**వ్యాఖ్య:**- అంగారం, శృంగారం- రెంటినీ సమంగా భావావేశంతో చూపగల్గిన మహాకవి దాశరథి. అందుకు ఈ పద్యం ఒక ఉదాహరణం. "నా గీతాలు ఎంతదూరం పయనిస్తే అందాకా ఈ భూగోళానికి అగ్గిపెట్టుతాను. నిప్పులు వోసి హేమంత ఋతువు అనే భామను గాంధర్వ వివాహం చేసుకొంటాను. తూర్పుననున్న ఆకసంలోని అరుణకిరణాల రక్తజలధారలను చల్లి సూర్యమండలాన్ని చల్లారుస్తాను" - అని ఈ పద్యంలోని భావం. ఈ పద్యంలో చెప్పబడిన మూడు కార్యాలూ అద్భుతమైనవే. ఈ పద్యంలోని 'అగ్ని' చైతన్యానికి ప్రతీక. దాశరథి వ్యక్తిత్వం విప్లవ చైతన్యానికి ఆమ్రేడితం. ఆతని కవిత్వం అధర్మాన్ని కాల్చివేసే అగ్నిధార. రుద్రవీణలోని -

"ఈ కొరగాని లోకమున కిప్పుడె నిప్పు రగిల్చి కాల్చి నా
లో కదలాడు నూహలకు రూపమొసంగి పునస్సృజింతు".

అగ్నిధారలోని- "వీణియ తీగపై పదును వెట్టిన నా కరవాలధారతో గానము నాలపించెద"- వంటి పద్యాలు దాశరథి విప్లవ చైతన్యాన్ని చాటుతున్నాయి.

హేమంత భామా గాంధర్వ వివాహము, ద్యోమణ్యుష్ణగోళమ్ము, ప్రాగాకాశ నవారుణాస్ర జలధారల్- అనే సమాసాలు దాశరథికి గల సంస్కృత భాషా ప్రభుత్వాన్ని ప్రదర్శిస్తున్నాయి. ఆ మహాకవి కలంవెంట శబ్దాలు తమంతతామే పరుగెత్తుకొంటూ వస్తాయి. పద్యాలలో సముచిత స్థానాలలో నిలిచి వెలుగుతాయి. యతిప్రాసలకోసం ప్రయత్నించిన వైనం దాశరథి పద్యాలలో కనిపించదు. ఈ పద్యంలో యతులు ఎంత సహజ సుందరంగా అలరారుతున్నవో చూడవచ్చు. రూపకాలంకార శోభితమైన ఈ పద్యం శార్దూలంగా సాగింది.

"వీణియ తీగపై పదను పెట్టిన నా కరవాల ధారతో
గానము నాలపించెద స్వకంఠము నుత్తరణంబొనర్చి, స్వ
ర్గానకు భూమినుండి రసగంగలు చిమ్మెద; పీడిత ప్రజా
వాణికి 'మైక్' అమర్చి అభవాదులకున్ వినిపింపజేసెదన్"

('అగ్నిధార' 'అంతర్నాదము'లో)

**అర్థాలు:-** కరవాలధారతో= కత్తి అంచుతో; స్వకంఠమును= నా గొంతును; ఉత్తరణంబు+ఒనర్చి= ఖండించి; రసగంగలు= రక్తం అనే గంగానదులు, నెత్తుటి ప్రవాహాలు; పీడిత ప్రజావాణి= బాధింపబడిన ప్రజల మాటలు; మైక్= 'మైకు'– (ఇంగ్లీషుమాట) ధ్వని వర్ధకయంత్రం; అభవ+ఆదులకున్= పుట్టుకలేని ఈశ్వరుడు మొదలైనవారికి.

**వ్యాఖ్య:-** దాశరథి సహజకవి. బాల్యంనుంచి బహూద్రేక స్వభావుడు. అన్యాయం ఎక్కడ జరిగినా సహించేవాడు కాదు. అధర్మాన్ని ప్రతిఘటించే ఆవేశం ఆతని రక్తం నిండా ప్రవహించేది. సంపద లేకున్నా స్వాభిమానం కలిగినవాడు. అర్థించే గుణంలేనివాడు. దారిద్ర్య బాధలను అనుభవించి, సహించి, ధైర్యంగా నిశ్చలంగా బ్రతికినవాడు. కష్టాలకు కుంగిపోయేవాడు కాదు. తెలంగాణా ప్రజలు పడే బాధలను చూచి ఆతని హృదయం కరుణార్ద్రమైపోయింది. కర్కోటకులైన భూస్వాముల జాగీర్దార్ల అత్యాచారాలు, వాళ్ళు అనుభవించే అక్రమ భోగభాగ్యాలు చూచి సహించలేకపోయాడు. ఈ అన్నింటికి కారణమైన నిజాం ప్రభుత్వంపట్ల ఆతని హృదయం అగ్నిగోళమై మండింది. ఆగ్రహం కట్టలు తెంచుకొని 'అగ్నిధార'గా ప్రవహించింది. ఇలాంటి పరిస్థితిలో దాశరథి హృదయాగ్ని గోళంనుండి జ్వాలా సదృశంగా పైకి వచ్చిన పద్యం ఇది. అందుకే అన్నాడు ఇలా–

"వీణాతంత్రులమీద పదనెక్కించిన కత్తి అంచులాంటి గళంతో పాడుతాను. ఆ నిశితఖడ్గధారతో నా గొంతును ఖండించుకొని, నా రక్తగంగలను స్వర్గానికి చిమ్ముతాను. నా బాధాతప్త ప్రజల నోటికి 'మైక్'గా మారిపోతాను. నా భాషలో వారి కష్ట నిష్ఠురాలను ఈశ్వరాదులకు గట్టిగా వినిపిస్తాను".

తెలంగాణా పీడిత ప్రజావాణికి 'మైక్' దాశరథి. అందుకే ఆయన ప్రజాకవి; విప్లవ కవివీరుడు. రూపకాతిశయోక్త్యలంకృతమైన ఈ పద్యం ఉత్పలమాల.

"ఆకసములోని చుక్కల నాదరించి
ఆకలికి యేడ్చు డొక్కల నార్చి పిలిచి
తిరుగబడెదను భూమిబొంగరము మీద
ధగధగని మండు లోక బాంధవుని మీద"

('అగ్నిధార'– 'అంతర్నాదము'లో)

**అర్థాలు:**– ఆర్చి= అఱచి, బొబ్బరించి; తిరుగబడెదను= ఎదురించెదను, ప్రతిఘటించెదను; భూమి బొంగరము= బొంగరంలా తిరిగే భూమిమీద; లోక బాంధవునిమీద= సూర్యునిమీద.

**వ్యాఖ్య:**– "ఆకాశంలోని చుక్కలను గౌరవిస్తాను, ప్రేమిస్తాను. ఆకాశంలో బాగా ప్రకాశించే సూర్యుణ్ణి మాత్రం ఎదురిస్తాను. అలాగే– ఆకలితో అల్లల్లాడిపోయే పేదలను అఱచి పిలుస్తాను. బొంగరంలా తిరిగే భూమిని ప్రతిఘటిస్తాను".

దాశరథి పేదల పక్షాన నిలబడే అభ్యుదయ కవి. భూమిమీది పేదప్రజల ఆకలిబాధలకు కారణం ధనవంతులు– వాళ్లకున్న భూసంపద. అందువల్ల భూస్వాముల మీద తిరుగబడుతాను. భూస్వాముల సంపద స్థిరమైనది కాదు. అది చలిస్తుంది బొంగరంలా.

ఇక ఆకాశంలో చుక్కలు బక్కగా కాంతిహీనమై, తిండికి ఏమీలేని పేదలలాగా ఉన్నాయి. అందుకు కారణం– కాంతినంతటిని తన దగ్గర దాచుకొన్న సూర్యుడు. కాబట్టి ధగధగమండే సూర్యునిమీద తిరుగబడి, అతని కాంతిలో కొంత చుక్కలకు పంచుమంటాను. అలా పంచకుంటే చుక్కలు శాశ్వతంగా బలహీనంగా ఉండిపోవలసిందే కదా! అతడు 'లోకబాంధవుడు' ఎట్లవుతాడు? అందువల్ల ఉన్నవాళ్లు లేనివాళ్లకు సంపదను పంచి ప్రజాశ్రేయస్సుకూ సంక్షేమానికీ పూనుకోవడం కర్తవ్యమని వ్యంగ్యంగా చాటుతున్నాడు దాశరథి. అలా ఆ మహాకవి ప్రజలకోసం భూమ్యాకాశాలను ప్రతిఘటిస్తానన్నాడు.

రూపక–సమాసోక్తి అలంకారాలతో అందగించే ఈ పద్యం తేటగీతి.

"భయపడను వాన గాలికి, వరద దెబ్బ
కాకలికి అశ్రువులకు త్రేతాగ్నికేని
వెలుగు చీకట్ల మధ్య తప్పించు కొనుచు
భండన మొనర్చు దివ్యకోదండి నేను"

('అగ్నిధార'- అంతర్నాదము'లో)

**అర్థాలు:-** త్రేతాగ్ని= త్రేత+అగ్ని= మూడు అగ్నులు- గార్హపత్యం, దక్షిణాగ్ని, ఆహవనీయం; భండనము+ఒనర్చు= యుద్ధం చేసే; దివ్య= దివిలో పుట్టింది, దేవతా సంబంధమైన; కోదండి= కోదండము (విల్లు) ధరించినవాడు విలుకాడు, ధనుర్ధరుడు, ధన్వి, ధానుష్కుడు.

**వ్యాఖ్య:-** దాశరథి తన ధీరవీర వ్యక్తిత్వాన్ని గూర్చి చెప్పిన మాట అది- "నేను తుఫానుకూ ఉవ్వెత్తుగా పొంగే ప్రవాహాలకూ, వాటి తాకిడికీ, కన్నీళ్లకూ చివరకు అగ్నిత్రయానికీ అయినాసరే బెదిరిపోయేవాణ్ణి కాను. వెలుగు చీకట్ల మధ్య ఎవరికీ దొరకకుండా తప్పించుకొంటూ యుద్ధం చేసే దివ్య ధానుష్కుణ్ణి".

'త్రేతాగ్ని' అనే ప్రయోగంవల్ల దాశరథికిగల పాండిత్యం, వైదిక సంస్కారం ప్రస్ఫుటమవుతున్నాయి. 'దివ్యకోదండి' కోదండం- ధనుస్సును పట్టుకొన్నవాడు శ్రీరాముడు. కోదండ ధారణం క్షత్రియ ధర్మం, ఆర్తులను దీనులను రక్షించి పోషించడం రాజధర్మం. మాయలు పన్నినరాక్షసులను గెలిచినవాడు రాముడు- అంటే దశరథుని పుత్రుడు- దాశరథి. అందుకే- దాశరథి కవి "దివ్యకోదండి నేను"- అన్నాడు.

మానవుల నెత్తురు తాగే మానవులు దానవులే. అలాంటి-

"దానవుల నంతమొందింప నేను కూడ
రామకృష్ణావతార ధారణము సేతు"

అన్నాడు దాశరథి. దాశరథి పూర్తిపేరు -'దాశరథి కృష్ణమాచారి' - అంటే అతని పేరులో రాముడు+కృష్ణుడు- ఇద్దరూ ఉన్నట్లే కదా!

"వెలుగు చీకట్ల మధ్య తప్పించుకొనుచు"- అనే చరణం బందీ అయిన దాశరథి, పోలీసుల కళ్ళుగప్పి తప్పించుకొని, రాత్రీ పగలూ అనక వెలుగు చీకట్ల

మధ్య కొన్ని మైళ్లు అడవుల్లో పరుగెత్తి నిజాంను ఎదిరించిన సమరయోధుడైన దాశరథి జీవితంలోని ఒక వీరవిప్లవ ఘట్టాన్ని ధ్వనింపజేస్తున్నది.

రూపక శోభితమైన ఈ పద్యం తేటగీతి.

"అంబర చుంబి సౌధముల కాయువు పోసెడి నీ శ్రమ ప్రభా
వంబు నెరుంగలేని ధనవంతుల బంగరు పళ్లెరాలలో
అంబలిపోసి త్రాగు సమయంబులు డగ్గరె లెమ్మ! నీ నవా
స్యంబున రుద్రనేత్ర విలయాగ్నుల కుంకుమ బొట్టు పెట్టుమా!"

('అగ్నిధార'- 'ఉస్సురనెదవు'లో)

**అర్థాలు:-** అంబరచుంబి= ఆకాశాన్ని ముద్దుపెట్టుకొనే, నింగిని తాకే; ఆయువు= ప్రాణం; ప్రభావంబున్= శక్తిని; అంబలి= పిండి నూకలు చేర్చి వండిన పదార్థం; డగ్గరె= సమీపించింది; నవ+ఆస్యంబున= కొత్త మొగంపై; కడిగిన నుదుటిపై; రుద్రనేత్ర విలయాగ్నుల= శివుని మూడవకంటియందలి వినాశకరమైన నిప్పుల వంటి.

**వ్యాఖ్య:-** "ఓ కూలిదానా! ఆకసాన్ని తాకే ఉన్నత రాజభవనాలకు ప్రాణం పోసే నీ శ్రమశక్తిని తెలియజాలని శ్రీమంతులకుండే బంగారు పళ్లెరాలలో, నీవు అంబలి పోసికొని త్రాగే మంచి సమయం సమీపిస్తున్నది. ఇక నీ నుదుట ఫాలాక్షుని మూడవకంటి ప్రళయాగ్నులవంటి కుంకుమబొట్టు పెట్టుకోవమ్మా!".

దాశరథి మహాకవి ఒకనాటి ఉదయం, హైదరాబాదులోని చార్మినారు వద్ద ఉన్న రాతికట్టడాలలో పనిచేస్తున్న కూలి ఆమెను చూశాడు. ఆమె ఒంటిపై సరిగా బట్టలు లేక, మట్టితట్టను తన నెత్తిపై పెట్టుకొని, ఉస్సురని బాధపడుతూ పనిచేస్తున్నది. అలా కష్టపడుతున్న కూలి ఆమెను చూచి వేదనతో వ్రాసిన పద్యమిది. అందుకే చివరకు అన్నాడిలా దాశరథి- ఓ కూలితల్లీ! నా కలంలో సిరా ఇంకేదాకా నీ గూర్చి కావ్యాలు వ్రాస్తాను. కలంలో సిరా ఇంకిపోతే ఊరుకోను. దానిలో నా రక్తం పోసి-

"అరుణ తరుణాక్షరాల పద్యాలు కూర్చి
ఆకలికి మాడిపోయెద నీ కొఱకయి"

అన్నాడు. అలా తన సానుభూతిని శోకార్ద్రుడై వ్యక్తం చేశాడు. అంతటి కరుణామయుడు దాశరథి. 'రుద్రనేత్రం'- ప్రళయానికి సంకేతం, విప్లవ చిహ్నం.

ధనికవర్గం శ్రామికుల శ్రమను గుర్తించే తరుణం వస్తుందనీ, శ్రామికుల వల్లనే, తాము నివసించే ఉన్నతసౌధాల నిర్మాణం జరిగింది- అనే సత్యాన్ని తెలుసుకుంటుందని ఈ పద్యంలో వ్యక్తం చేశాడు దాశరథి. "ధనవంతుల బంగరు పళ్లెరాలలో" అంబలి తాగే సమయం త్వరలో రానున్నదని అంటూ కూలిదానిని ఓదార్చాడు. నుదుట 'రుద్రనేత్ర విలయాగ్నుల' వంటి కుంకుమబొట్టు పెట్టుకొమ్మని, ఆమెకు విప్లవ చైతన్యాన్ని ప్రబోధించాడు. ఆమెకోసం తాను ఆకలికి మాడిపోతానని, శ్రామికవర్గంతోడి తన తాదాత్మ్యాన్ని వ్యక్తం చేశాడు దాశరథి.

అతిశయోక్తి రూపక అలంకార శోభితమైన ఈ పద్యం ఉత్పలవృత్తం.

"నాదొక వెఱ్ఱి; త్రాగుడున నాడును వీడును అమ్ముకొన్న ఉ
న్మాది వలెన్ కవిత్వమున నా సకలమ్మును కోలుపోయి, రా
త్రీదివముల్ రచించితిని తీయని కావ్యరస ప్రపంచముల్
వేదన యేదియో కలత వెట్టును గుండియ నెందుచేతనో?"

('అగ్నిధార' మహాలేఖిని'లో)

**అర్థాలు:-** వెఱ్ఱి= పిచ్చి, ఉన్మాదం; నాడు= దేశం, జనపదం; వీడు= పట్టణం; ఉన్మాది= చిత్త విభ్రమం గలవాడు, వెఱ్ఱివాడు; సకలమ్మును= సర్వాన్నీ; రాత్రీ దివముల్= రేలు పవలు; కావ్యరస ప్రపంచముల్= కావ్యాలకు సంబంధించిన నవరసాలతో కూడిన ప్రపంచం; వేదన= నొప్పి; కలత+పెట్టును= క్షోభింపజేస్తుంది, అలజడి రేపుతుంది.

**వ్యాఖ్య:-** "నేనొక వెఱ్ఱివాణ్ని. మద్యపానానికి బానిసై దేశాన్నీ పట్టణాన్నీ అమ్ముకొన్న ఉన్మాదిలాగా, కవిత్వం కోసం, నా సర్వం కోల్పోయి రాత్రీ పగలనక మధుర కావ్య జగత్తును సృష్టించాను. వ్రాయకుండ ఉండలేను. ఏదో అంతులేని వేదన నా హృదయంలో కలతను లేపుతుంటుంది. దానికి కారణం తెలియదు".

ఆవేశం, ఉద్రేకం, అధర్మ ప్రతిఘటనం- అనేవి దాశరథి జీవలక్షణాలు. ఆవేశం అంటే ఒళ్లెరుగనితనం; పారవశ్యం. కవిత్వం ఉదయించడానికి, కవి

హృదయంలో వేదన, సంఘర్షణ, ఆవేశం, అనుభూతి గాఢంగా ఉండాలని దాశరథి చెప్పాడు- "క్షోభలోంచే రాస్తుంటాను. క్షోభలేంది రాయలేను; అది నాకు వరం" అనే ఆతని మాటలు స్మరణీయాలు. అందుకే దాశరథి కలం వ్రాస్తుంటే వెనుకకు చూడదు. గబాగబ పద్యాలను లాగేస్తుంది. ఆతని 'భావసాగరము' పొంగిపొరలి పోతుండగా, పదావళులు ముద్దులు గార్చుతూ కళ్లముందు తాండవం చేస్తుంటాయి. ఫలితంగా కొండలనుండి దూకే జలపాతంలాగా పద్యధార ప్రవహిస్తుంటుంది- వేగంగా. ఆతని కలం ఎండకు మండిపోయి 'గ్రీష్మమహా ప్రబంధాలను' రచిస్తుంది. అంతేకాదు- ఆకాశంలోని నీలిమేఘాలు, ఆతని కలంలో చొరబడినప్పుడు, కవిత్వ పద్యాలు, ఆ కలం ముఖం నుండి వాకలు వాకలుగా ప్రవహిస్తాయి. అగ్నిధారలూ అమృత ధారలూ- రెండూ ఆతని లేఖిని నుండి ప్రసరిస్తాయి. అంగారం శృంగారం రెండూ సరసంగా సంసారం చేస్తాయి ఆతని కవితా ప్రపంచంలో. వేదన రసావేశం- రెంటి సమ్మేళనంవల్ల, కవిత్వరచనకు ధారాశుద్ధి సిద్ధిస్తుంది. చిన్ననాటినుండి దాశరథి వాక్కులో ఆశుధార ఉన్నది.

ఈ ఉత్పలమాల పద్యం ఉపమారూపకాలంకార, వృత్త్యనుప్రాసాలంకార సంశోభితం.

*"ఈ కొరగాని లోకమున కిప్పుడె నిప్పు రగిల్చి కాల్చి, నా*
*లో కదలాడు నూహలకు రూపమొసంగి పునస్సృజింతు, న*
*ఙ్ఞాకటకుందు పేదలకు బ్రహ్మ లిఖించిన కొంటె వ్రాతలో*
*వ్యాకరణమ్ము లేదు, రసభంగిమ కానగరా దదేలనో!"*

('రుద్రవీణ' 'స్వామిపూజ'లో)

**అర్థాలు:-** కొరగాని (కొఱ)= ప్రయోజనంలేని, ఉపయోగపడని; పునః+సృజింతున్= మళ్ళీ సృష్టిస్తాను; అఙ్ఞాకటన్= ఆకలి+ఆకలి= మిక్కిలి ఆకలిచేత; కుందు= క్రుంగు, దుఃఖించు; వ్యాకరణమ్ము= శబ్దశాస్త్రం, పదానుశాసనం; రసభంగిమ= రసంయొక్క అందం (భంగిమ-విధానం, అందం, తీరు, సొంపు)

**వ్యాఖ్య:**- దాశరథి లయకారుడైన శివునితో పలికిన పల్కులివి- "పేదలకు ప్రయోజనం కలిగించని ఈ లోకానికి ఇప్పుడే నిప్పంటించి కాల్చేస్తాను. నాలోని భావాలకు అనుకూలమైన రూపం కల్గిస్తూ, మళ్ళీ కొత్త లోకాన్ని సృష్టిస్తాను. ఎందుకంటే- మిక్కిలి ఆకలితో శోకిస్తున్న పేదప్రజల నొసట బ్రహ్మదేవుడు వ్రాసిన చెడ్డ (చిలిపి) భాషలో వ్యాకరణంలేదు. అన్నీ తప్పులున్నాయి. అది కొంటె వ్రాత. పైగా ఆతని భాషలో రససౌందర్యం లేదు. ఆతని వ్రాతంతా నీరసంగా ఉంది. ఏం కారణమో తెలియదు".

పేదటికాన్ని అనుభవించిన దాశరథి పేదలను చూచి కన్నీరు విడిచాడు. పేదలను పుట్టించిన బ్రహ్మను నిందించాడు. పేదల నొసట వ్రాసిన బ్రహ్మభాషలో అన్నీ వ్యాకరణ విరుద్ధ పదప్రయోగాలే. అంతా తప్పు వ్రాత. ఆతని వ్రాతలో రసదృష్టితో చూస్తే ఇంపు సొంపులు లేవు. భాషాపాండితీ, రససిద్ధీ లేని బ్రహ్మ వ్రాతవల్ల ప్రజలు పేదలై పుట్టారు. తప్పు ప్రజలది కాదు- వాళ్ళను పుట్టించిన బ్రహ్మదేవునిది. అందువల్ల ఈ పేద ప్రజలకు పనికిరాని ఈ లోకాన్ని కాల్చేస్తాను. పేదలులేని ఒక సుందరమైన, సిరులతో తులతూగే కళామయ లోకాన్ని మళ్ళీ సృష్టిస్తాను. పేదటికం లేని ఒక రసాత్మక సుఖప్రపంచాన్ని నిర్మిస్తాను- అని లయకారుడూ రుద్రమూర్తీ అయిన శివునితో తన బాధను వ్యక్తం చేశాడు. తన లక్ష్యాన్ని సూచించాడు. అందుకే చివరకు శివునితో అన్నాడు ఇలా- "స్వామీ! నీవు ఫాలనేత్రాన్ని తెఱచి, లోకాలు కాల్చివేసి తాండవం చెయ్. నేను తీగలు మీటుతూ 'రుద్రవీణ' మోగిస్తాను".

నిజామాబాద్ జైల్లో ఉన్నప్పుడు దాశరథికి తీవ్రజ్వరం వచ్చింది. అప్పుడాతడు 'సంధ్యాలయమూర్తి' అయిన శివుణ్ణి ప్రస్తుతించాడు. వెంటనే భోరున వర్షం కురిసింది. దాశరథి జ్వరం తగ్గింది. అందువల్ల, జైల్లో ఎవరికి జ్వరం వచ్చినా శివుని గూర్చిన పద్యాలు చదివేవాడు. ఫలితంగా వాళ్ల జ్వరాలు తగ్గేవట.

వృత్తం-ఉత్పలమాల; అలంకారం- వృత్త్యనుప్రాసం.

"చింతల తోపులో కురియు చిన్కులకున్ తడిముద్దయైన బా
లింత యొడిన్ శయించు పసిరెక్కల మొగ్గనుబోని బిడ్డకున్

బొంతలు లేవు కప్పుటకు; బొంది హిమంబయి పోవునేమొ? సా
గింతును రుద్రవీణ పయి నించుక వెచ్చని అగ్ని గీతముల్"

('రుద్రవీణ'- 'మూర్ఛన'లో)

**అర్థాలు:-** చింతలతోపులో= చింతచెట్లున్న వనంలో; బాలింత= బాలెంతరాలు యొక్క, ప్రసూతయొక్క; శయించు= శయనించు, పరుండు, నిదురించు; మొగ్గనుబోని= మొగ్గను పోలిన; బొంతలు= మెత్తగా కప్పుకోవడం కోసం, పరచుకోవడం కోసం పాతగుడ్డలను చేర్చి దట్టంగా కుట్టిన గంతలు; బొంది= మేను; హిమంబు+అయిపోవునేమొ= మంచు అయిపోతుందేమో; రుద్రవీణ= శివునివీణ; రుద్రుడు= శివునికి నామాంతరం. బ్రహ్మమానస పుత్రులైన ఏకాదశ రుద్రులలో ఒకడు; అగ్నిగీతముల్= అగ్నివలె వెచ్చదనం ఇచ్చే పాటలూ పద్యాలూ.

**వ్యాఖ్య:-** దాశరథి కరుణారసార్ద్ర హృదయాన్ని చూపించే అద్దం ఈ పద్యం. ఒక పేద బాలింత దయనీయ స్థితిని దర్శింపజేశాడు దాశరథి ఈ పద్యంలో.

"ఒక చింతచెట్ల వనంలో వానకురిసింది. ఆ వాన చినుకులకు తడిసి ముద్ద అయింది ఒక పేద బాలింత. ఆ బాలింత ఒడిలో పడుకొన్న పసి రెక్కల మొగ్గలాంటి బిడ్డకు కప్పుదామంటే ఆ తల్లివద్ద బొంతలు కూడా లేవు. పాపం! ఆ పసిపాప లేత మేను చలికి మంచై పోతుందేమో! నా రుద్రవీణ మీటి ఇంచుక వెచ్చని అగ్నిగీతాలను వినిపిస్తాను" అని భావం. పేదరికాన్ని అనుభవించి, కన్నీటి విలువను తెలిసిన అచ్చమైన కవి దాశరథి. దృశ్యాన్ని సాక్షాత్కరింపజేయడం కవి ప్రతిభలోని ఒక రేఖ. ఆ రేఖ ఈ పద్యంలో మెరుస్తున్నది.

ఇంకా- విరహతప్త అయిన ప్రియురాలిని గూర్చి, ఆకట తపించే పేద ఉద్యోగులను గూర్చి, తెలంగాణా రైతుల నిశ్శబ్ద గళాలను గూర్చి సానుభూతిమయుడై దాశరథి తన రుద్రవీణను మీటాడు.

రూపకాలంకార సంశోభితమైన ఉత్పలమాల హృదయాలను కరుణరసార్ద్రం చేస్తుంది.

# 9. వర్ణనలు

*"నరకానన్ బడి క్రుంగుచున్న నను గంధర్వాప్సరః కామినీ*
*తరుణస్వాదునవోప గూహన పథాంతర్వర్తిగా జేసి దు*
*ర్భర దారిద్ర్య పిశాచినీ రుధిర ధారాక్రూర దంష్ట్రా ప్రఘా*
*త రిరంసా పరిఖిన్నతన్ మరపు నొందన్ జేతువోయీ! కవీ!"*

(అగ్నిధార- కవీ!)

**అర్థాలు:-** నరకానన్= యమలోకంలో, దుర్గతిలో; క్రుంగుచున్న= అణగిపోతున్న; గంధర్వ+అప్సరః కామినీ= గంధర్వకాంతుల, అప్సరసల, 'గంధర్వులు' అంటే సువాసనను పొందేవాళ్ళు- హాహా హూహూ మొదలైన వాళ్లు, పాటలు పాడేవారు. దేవతలవల్ల పుట్టిన వారు గంధర్వులు. అప్సరలు- దేవకన్యలు, దేవ గణికలు- నీటివలన పుట్టినవారు అప్సరలు. ఊర్వశి మొదలైనవాళ్లు. విద్యాధరులు, అప్సరసలు, యక్షులు, రక్షస్సులు, గంధర్వులు, కింనరులు, పిశాచులు, గుహ్యకులు, సిద్ధులు, భూతాలు- వీరందరూ దేవతలవలన పుట్టిన వారు. దేవతాభేదాలకు సంబంధించినవాళ్లు; తరుణ= యౌవనంలో ఉన్న; స్వాదు= తియ్యని; నవ+ఉపగూహన పథ+అంతర్వర్తిగాన్= కొత్త కౌగిలింతల దారుల లోపల ఉండేవానిగా; దుర్భర దారిద్ర్య పిశాచినీ= భరింపరాని పేదఱికం అనే పిశాచ జాతిస్త్రీల యొక్క (మాంసాన్ని భుజించేవారు పిశాచులు); రుధిరధారా క్రూరదంష్ట్రా= నెత్తుటి ధారలుగల దారుణమైన కోఱపళ్లయొక్క; ప్రఘాత= బలమైన దెబ్బల రూపంలో; రిరంసా= రమించే కోరికల ఫలితంగా అనుభవించిన; పరిఖిన్నతన్= ఖేదాన్ని, దుఃఖాన్ని; మరపును+ఒందన్+చేతువు= మరచేటట్లుగా చేస్తావు.

**వ్యాఖ్య:-** లోకోత్తరంగా వర్ణించేవాడు కవి. ఆకలియొక్క మహత్త్వాన్ని చాటే పద్యమిది.

"ఓ కవీ! నీవు, నరకంలోపడి కుంగిపోతున్న నన్ను గంధర్వాంగనల అప్సరః కాంతల కమ్మని కౌగిలింతలలో తేలుస్తావయ్యా! దుర్భరదారిద్ర్య పిశాచ జాతిస్త్రీల యొక్క నెత్తుట తడిసిన కోఱపళ్లకు గాయపడిన నా దుఃఖాన్ని మరచిపోయేలా చేస్తావయ్యా! నీవు"- అని ఈ పద్యంలోని భావం. ఈ పద్యంలోని రెండు భావాలను రెండు సుదీర్ఘ సమాసాలలో చెప్పాడు దాశరథి. ప్రతిభా పాండిత్యాభ్యాసాలూ మూడూ

శబ్దభావచ్ఛందోవిశేషాలు మూడూ త్రివేణిలా సంగమించి సాగిన దాశరథి కవితాశక్తికి తార్కాణం ఈ పద్యం. కన్నీటిని తుడిచి, ఆనందాన్ని అందించేది కవిత్వం అనే సారవంతమైన భావాన్ని, సహృదయ నైవేద్యంగా అందించిన పద్యమిది. శ్రీనాథ మహాకవి పద్యధారా సౌందర్యాన్ని స్ఫురింపజేసే రచన ఇది.

మత్తేభ వృత్తంగా సాగిన ఈ పద్యం రూపకాలంకారభూషితం.

*"నినుగని కొండలన్ని రమణీ కుచపాళికలై, కపోల మో*
*హన ఫలకమ్ములై భ్రుకుటులై కుటిలాలక జాలమై సురాం*
*గనలయి రూపుదిద్దుకొనగా ఉలితో అమృతమ్ము చల్లి జీ*
*వనములు పోసి పోయెదవు; బ్రహ్మవు శిల్పికులావతంసమా!"*

(అగ్నిధార– 'శిల్పం')

**అర్థాలు:–** రమణీకుచ పాళికలు+ఐ= స్త్రీల స్తనాల పలకలపై; కపోల మోహన ఫలకమ్ములు+ఐ= పలకలవంటి చక్కని చెక్కిళ్లు కలవై, ఆశ్చర్యాన్నీ కలవరాన్నీ కలిగించే పలకలవంటి చెక్కిళ్ళు కలవై; భ్రుకుటులై= బొమముడులు కలవై; కుటిల+అలకజాలమై= వంకరైన నెటికురుల సమూహం కలవై; సుర+అంగనలై= దేవతాస్త్రీలై; రూపుదిద్దుకొనగా= ఆకారం ధరించగా, అందగించగా; జీవనములు= ప్రాణాలు, బతుకులు; బ్రహ్మవు= సృష్టికర్తవు; శిల్పికుల+అవతంసమా!= శిల్పకారుల సమూహంలో సిగబంతివి (శ్రేష్ఠుడవు).

**వ్యాఖ్య:–** ఓరుగల్లు శిల్పాలను చూచి ముగ్ధుడై దాశరథి శిల్పిని గూర్చి రచించిన పద్యాలు విశేష ప్రశస్తిని ఆర్జించాయి. వాటిలో ఒక పద్యం ఇది. శిలలను చెక్కి అందంగా మలిచేవాడు శిల్పి. శిల్పులలో శ్రేష్ఠుడు శిల్పి కులావతంసుడు.

"ఓ శిల్పి కులావతంసమా! నిన్ను చూడగానే కొండలన్ని స్త్రీల రమ్యస్తనములై చక్కని చెక్కిళ్లై, కమనీయమైన కనుబొమలై, వంకరలు తిరిగిన అందాల కురులై చివరకు సుందర సురాంగనలుగా రూపుదిద్దుకొంటాయి. వాటిలో నీవు ఉలితో అమృతం చల్లి ప్రాణాలు పోస్తావు. నీవు నిజంగా బ్రహ్మవు సుమా!" అని భావం ఈ పద్యానికి. కనిపించని వాటిని దర్శించి, లోకోత్తరంగా వర్ణించేవాడు కవి, క్రాంత దర్శి. దాశరథి క్రాంతదర్శి. మనోహరమైన ఈ శిల్పి పద్యాలు కవిసమ్రాట్ విశ్వనాథ

ప్రశంసలకు పాత్రమైనాయి. 'శిల్పి' ఖండికలోని ఒక్కొక్క పద్యం ఒక్కొక్క సువర్ణ కళాఖండం. ఈ చంపకవృత్తం రూపక-అతిశయోక్తి అలంకార సమ్మేళనం చేత సౌరభిస్తున్నది.

"రాలు మలంతు వీవని వరాలను కుప్పలు వోసి రాణి వా
సాలకు గొంచుబోయి ఒక చక్కని జాణను చెక్కుమంచు ర
త్నాల నొసంగినారు నరనాథులు; లేజవరాలి మోవి స్తం
భాలకు చెక్కినావు; ఉలి పన్నుల నొక్కులు తాకనట్లుగా"

('అగ్నిధార'- 'శిల్పి'లో)

**అర్థాలు:-** మలంతువు+ఈవు+అని= మలుస్తావు నీవని; వరాలను= వరహాలను, వరాహం (పంది) ముద్రగల బంగారు నాణేలను; జాణను= నేర్పుగల సుందరాంగిని; నరనాథులు= రాజులు; లేజవరాలు= లేత+జవరాలు= లేత వయస్సులో ఉన్న జవ్వని; మోవి= పెదవి; ఉలి పన్నుల= ఉలి యొక్కవాడి దంతాల అంచుల; నొక్కులు= తాకుటవల్ల కలిగే చిన్ని చిన్ని గీతల గుర్తులు.

**వ్యాఖ్య:-** శిలలను చెక్కి, వాటిని సుందర శిల్పాలుగా మలచే శిల్పి యొక్క కళానైపుణ్యాన్ని వర్ణించే పద్యమిది. ఈ పద్యం ఆ శిల్పిని సంబోధిస్తూ, ప్రశంసిస్తూ పలికిన పలుకులివి-

"ఓ శిల్పి శ్రేష్ఠుడా! నీవు రాళ్లను చెక్కి, వాటిని అందంగా చక్కని ప్రతిమలుగా విగ్రహాలుగా తీర్చిదిద్దుతావని తెలిసి, రాజులు, తమ రాణివాసాలకు నిన్ను తీసికొని వెళ్ళి, ఒక చక్కని జాణను చెక్కి ఇమ్మని నీకు వరహాల రతనాల కుప్పలిచ్చారు. వారి ఆదేశం మేరకు, నీవు నీ చాతుర్యం ప్రదర్శించి, జవ్వని పెదవికి ఉలిపంటి నొక్కులు కూడా కనిపించకుండా నున్నగా లేజవరాలిని స్తంభాలకు చెక్కావు".

ఈ పద్యం దాశరథి వర్ణనా ప్రతిభకు తార్కాణం. శిల్పిని గూర్చి వ్రాసిన ఎనిమిది పద్యాలలో ఇది ఒకటి. ప్రతిపద్యం ఒక అమూల్య రత్నం. శిల్పి లేజవరాలిని చెక్కినంత అందంగా, దాశరథి ఈ 'శిల్పి' పద్యాలను ముగ్ధ మనోహరంగా రచించాడు. చతురుడైన శిల్పిచేతిలో పడిన "ప్రతి వికార శిలయు ప్రతిమయై వెలుగొందు పడతివోలె

కులికి వలపురేపు" నట్లుగా, దాశరథి చేత రూపుదిద్దుకొన్న ప్రతి పద్యం హృద్యమై సుధామధురమై సహృదయ పాఠకులను అలరిస్తుంది.

ఈ ఉత్పలమాల పద్యం- వృత్త్యనుప్రాస, యమక శబ్దాలంకార సుందరం.

"నలుబది కోట్ల భారత జనమ్ముల వందల యేండ్ల బంధన
మ్ములు సడలించినావు, జయముల్ గొనినావు, త్రివర్ణ కాంతులన్
తళతళలాడు భారత పతాకము నాకము తాకునంత యె
త్తుల కెగయించినావు; పగతుర్ కొనియాడగ పెంచినాడవున్"

('అగ్నిధార'- 'క్షమామూర్తి'లో)

**అర్థాలు:-** బంధనమ్ములు= కట్లు, చెఱలు; పతాకము= జండా; నాకము= ఆకాశం, స్వర్గం; పగతుర్= శత్రువులు.

**వ్యాఖ్య:-** దాశరథి, మరికొందరు ఖైదీలు నిజామాబాదు జైలునుండి చికిత్సకోసం 1948 జనవరి 30నాడు, హైదరాబాదు కేంద్ర కారాగృహం చంచల్ గూడకు బయలుదేరే సమయంలో మహాత్మాగాంధీ హత్య వార్త అందింది. అందరూ దుఃఖసముద్రంలో మునిగిపోయారు. దాశరథి ప్రయాణం రద్దయింది. దాశరథి ఆవేదనతో దుఃఖం పొరలిపోతుండగా మహాత్ముణ్ని గురించి ఎన్నో పద్యాలు చెప్పాడు. అట్టి పద్యాలలో ఒకటి ఈ పద్యం.

"స్వామీ! గాంధీ మహాత్మా! నలుబైకోట్ల భారతీయుల బానిసతనం బంధనాలను తొలగించావు. ఆంగ్లేయులపై విజయాన్ని సాధించావు. మువ్వన్నెలతో తళతళలాడే భారత పతాకాన్ని ఆకాశం తాకేటంత ఎత్తులకు ఎగురవేశావు. శత్రువులు కూడా ప్రశంసించేలా భారతీయ గౌరవాన్ని పెంచావు" అని ఈ పద్యభావం.

1948లో భారతదేశ జనసంఖ్య దాదాపు నలభైకోట్లని ఈ పద్యం తెలుపుతున్నది. "భారత పతాకము నాకము తాకునంత యెత్తులకు"- అనే మాటలలోని వృత్త్యనుప్రాసం వల్ల ఈ చంపక పద్యం తళతళ లాడుతున్నది. దాశరథి పద్యం పరుగెత్తుతుంది తప్ప నడిచినట్లుండదు. దానినే ధారాశుద్ధి అంటారు. ధారాశుద్ధి కవిశబ్ద ప్రభుతను ప్రకటిస్తుంది. భావావేశం అలలెత్తితే పద్యధార ఏర్పడుతుంది.

ఈ పద్యాన్ని కాల్పనిక కవితాశాఖ అయిన స్మృతి కవిత్వంగా భావించవచ్చు. దాశరథి అభ్యుదయ భావనలో జాతీయత, దేశభక్తి కలసి ఉన్నాయి. దాశరథి జాతీయ నాయకులపట్ల విశేష గౌరవం కలవాడు. జాతీయ నాయకులైన గాంధీ నెహ్రూ వంటి వారిని ప్రశంసిస్తూ అనేక కవితాఖండికలు వ్రాశాడు. ఈ ఇద్దరిలోనూ గాంధీజీ అంటే మరీ పూజ్యభావం దాశరథికి. ఇందుకు 'మహేంద్రోదయం'లోని 'క్షమామూర్తి' కవితాపుష్పకంలోని 'అమృతమూర్తి' అనే కవితాఖండికలు ఉదాహరణాలు. 'అమృతమూర్తి' ఖండికలోని-

"బుద్ధుడవో సకల తప/ స్సిద్ధుడవో శంకరుడవో శ్రీవిష్ణువవో
వృద్ధుడవో యువకుడవో/ సిద్ధాంతింపంగ నీకె చెల్లు మహాత్మా!"

అనే పద్యం గాంధీజీపట్ల దాశరథికిగల గౌరవాన్ని ప్రస్ఫుటం చేస్తుంది.

"నీలో తేజము తగ్గిపోవునెడ నిందింతున్ కవోష్ణాస్రమున్
తైలం బట్టుల అశ్రుధారలను సంతప్తాజ్య ధారంబలెన్
జ్వాలాచేల విలోల తావక వపుర్వల్లీ విలాసంబుతో
భూలోకంబును సొంత మొక్క త్రుటి సమ్మోహింపగా జేయవే"

('అమృతాభిషేకము'- 'దీపాంగన'లో)

**అర్థాలు:-** తేజము= ప్రకాశం, పరాక్రమం; కవోష్ణ+అస్రమున్= కొంచెం వేడిగల నెత్తురు; తైలంబు+అట్టుల= నూనెవలె; అశ్రుధారలను= కన్నీటి జాలును; సంతప్త+ఆజ్య ధారన్‌బలెన్= మిక్కిలి వేడియైన నేతి జాలువలె; జ్వాలాచేల= మంట అనే వస్త్రం; విలోల= బాగుగా కదలే; తావక= నీ యొక్క; వపుః+వల్లీ- వపుర్వల్లీ= శరీరం అనే తీగ, తీగలాంటి మేను; విలాసంబుతోన్= శృంగార చేష్టా విశేషంబుతో; సొంతము= పూర్తిగా; త్రుటి= చాల కొద్దికాలంలో; సమ్మోహింపగాన్+చేయవే= మరులుకొనేటట్లు చేయాలి.

**వ్యాఖ్య:-** దాశరథి మహాకవి దీపాన్ని ఒక అంగన (మంచి అవయవాలుగల సుందరి)గా రూపించి వర్ణించాడు ఈ పద్యంలో-

"ఓ దీపాంగనా! నీలో తేజస్సు (కాంతి=నూనె, నెయ్యి- శక్తి) తగ్గిపోతున్నట్లయితే నా గోర్వెచ్చని నెత్తురును నీకు తైలంగా, నా కన్నీటి జాలును నీకు వేడి నేతిధారలాగా

అందిస్తాను. అలా నా శక్తిని గ్రహించి నీ మంటల చీరల కదలికతో నీ శరీర లతా శృంగార విన్యాసంతో ఈ భూలోకం మొత్తాన్ని ఒక సెకండులో (త్రుటిలో) వలపుల్లో తేలి తూలేలాగా చేయవే".

ప్రతిభామూర్తి అయిన దాశరథి 'దీపాంగన'ను అద్భుతంగా వర్ణించాడు. దీపాన్ని ప్రేయసిగా సంభావించాడు. అందుకే దీపాంగనలో తేజస్సు తగ్గితే తన నెత్తురును తైలంగా, తన కన్నీళ్లను నెయ్యిగా అందిస్తానన్నాడు. అలా తన నుండి శక్తిని గ్రహించి, విలాసంగా నర్తించి భూలోకమంతా ఒక్కక్షణంలో సమ్మోహం చెందేలా ప్రకాశించు మన్నాడు.

పర్షియన్ సంప్రదాయంలో దీపాన్ని ప్రేయసిగా, దీపపు పురుగును ప్రియునిగా వర్ణిస్తారు. ప్రేయసిని పరమాత్మగా, ప్రియుణ్ని భక్తునిగా సంకేతిస్తారు. దీపం, దీపం పురుగుల సంబంధం పరమాత్మ జీవాత్మల సంబంధంగా భావించడం పర్షియన్ సంప్రదాయం. ఆ సంప్రదాయాన్ని ఈ 'దీపాంగన' పద్యాల ద్వారా తెలుగులో ప్రవేశపెట్టాడు దాశరథి. అందుకే–

"దీపశిఖ పిల్చినది, చనుదెంచినాను
తనువు తనువెల్ల ఆజ్యపాత్రమ్ము వోలె"

అన్నాడు కవితా ప్రారంభంలోనే. తర్వాత–

"నాకున్ దీపశిఖా కుమారికకు ఈనాడా శతాబ్దాల ముం
దే కానుండెను పెండ్లి" అని కూడా చెప్పాడు.

దాశరథికి గల సంస్కృత భాషాపాండితిని తెలుపుతున్న ఈ శార్దూల వృత్తం ఉపమారూపకాలంకారాలతో భాసిస్తున్నది.

"ఇరులు నిశాసతీ భుజములెక్కి, శిరమ్మున నిక్కి, తారకా
తరుణి కపోల పాళికలు తాకి విహాయసవీధి ప్రాకి, చం
దురుపయి సోకి భూమిధర దుర్గమ వీధుల దూకి మెల్లగా
ధరపయి కాలుమోపిన వుదారములై హరినీల కాంతులన్"

('అమృతాభిషేకము'లోని 'తామసి')

**అర్థాలు:-** ఇరులు= చీకట్లు; నిశాసతీ= రాత్రి అనే స్త్రీ; శిరమ్మునన్= తలయందు; తారకాతరుణి= నక్షత్రం అనే జవ్వని; కపోలపాళికలు= పలకలలాంటి చెక్కిళ్లను; విహాయసవీధి= ఆకాశవీధి; భూమిధర= పర్వతం యొక్క; దుర్గమవీధులన్= చొరరాని ప్రదేశాలైన గుహలలో; ధరపయి= భూమిమీద; ఉదారములై= తిన్నదనం కలవై- గొప్పవై; హరినీల కాంతులన్= ఇంద్రనీల మణుల ప్రకాశంలాంటి నల్లదనంగలవై.

**వ్యాఖ్య:-** చీకట్ల వ్యాప్తిని వర్ణించే పద్యమిది. "చీకట్లు రాత్రి అనే వనిత యొక్క భుజాలెక్కి, గర్వించి ఆమె తలపై కూర్చొని, ఆ తరువాత ఆ చీకట్లు చుక్కలనే యువతుల చెక్కిళ్ల వరుసలను తాకి, గగనమంతా వ్యాపించి, అక్కడున్న చంద్రుణ్ని స్పృశించి, ఆ పిదప అవి పర్వతాల గుహల్లోకి దూకి, అనంతరం మెల్ల మెల్లగా నల్లని ఇంద్రనీలమణుల కాంతుల వంటి కాంతులు గలిగిన ఆ చీకట్లు భూమిమీద కాలు మోపాయి".

రాత్రి రాగానే చీకట్లు వస్తాయి కాబట్టి, చీకట్లు మొదట 'నిశాసతి' భుజా లెక్కాయట. "చందురుపయి సోకి"-అంటే చంద్రునిలోని మచ్చను సోకి- అని అర్థం. పర్వతాల గుహల్లో చీకట్లు ప్రవేశించడం అంటే గుహల్లో చీకట్లు ఉంటాయి కాబట్టి.

పద్యంలో ఒక క్రమమైన దృశ్యం ఉంది. నిశాసతి- తారకాతరుణి విహాయసవీధి- భూమిధర దుర్గమవీధి- చిట్టచివరకు భూమికి దిగినాయి. అంటే పైనుండి కిందికి దిగి అంతటా వ్యాపించాయి- చీకట్లు అని. ఇలా చీకట్లకు ఒక రూపం ఇచ్చి మన కళ్లముందు నిలిపాడు దాశరథి. నిశాసతి- తారకాతరుణి అనేవి చక్కని రూపకాలు సమాసాలు. ఫలితంగా రూపకాలంకారాల ప్రయోగం. ఎక్కి నిక్కి, తాకి, ప్రాకి, సోకి, దూకి అనేవి చక్కని అంత్యానుప్రాసలు. ఇలా ఈ చంపక పద్యం దాశరథికి గల దృశ్యప్రత్యక్షీకరణశక్తిని ప్రకటిస్తున్నది. భూమ్యాకాశాలను ఆవరించిన 'తామసి' (చీకటి)ని కళ్లకు కట్టిస్తున్నది.

*"నీ నయనాల నీలిమలు నింగిని మేఘములాయె, గర్జన*
*ధ్వానము లేకయే ప్రణయవర్షములన్ కురియించె ప్రేయసీ!*
*వానల నానిపోదునని బాల! భవచ్ఛికురాల నీల ఛ*
*త్రాన ప్రియమ్ముమీర తలదాచుకొనన్ పిలిపించి నావటే?"*

('కవితాపుష్పకం'- 'ప్రపాపాలిక'లో)

**అర్థాలు:–** నయనాల నీలిమలు= కళ్లలోని నల్లదనాలు; గర్జన ధ్వానము= మేఘాల ఉఱుముల ధ్వని; ప్రణయవర్షములన్= ప్రేమ అనే వానలను; ప్రేయసీ= ప్రియురాలా!; బాల= పదహారేళ్లకు లోబడిన కన్య; భవత్+చికురాల= నీ యొక్క వెంట్రుకల; నీలిఛత్రాన= నల్లని గొడుగు కింద.

**వ్యాఖ్య:–** 'ప్రపాపాలిక' అనే ఖండికలోని పద్యం ఇది. 'ప్రపా' అంటే చలి పందిరి, లేదా పానీయశాలిక. 'పాలిక' అంటే పాలించే స్త్రీ. ఇసుక ఎడారులలో అక్కడక్కడ బాటసారుల సౌకర్యంకోసం చలిపందిళ్లు (ప్రపలు) ఉంటాయి. ఆ చలి పందిళ్లలో దాహార్తులకు పానీయాలు అందిస్తుంది ఆ ప్రపాపాలిక. ఒక రకంగా ఎడారులలో కనిపించే– చల్లని గుడారం లాంటిది ఈ ప్రపా. ఆ ప్రపాపాలికను ప్రేయసిగా భావించి దాశరథి ఎనిమది పద్యాలు వ్రాశాడు. అందులోని ఒక పద్యం ఇది–

"ఓ ప్రియురాలా! నీ కళ్లలోని నల్లదనాలు ఆకాశంలో మేఘాలుగా మారాయి. అవి ఉఱుమకుండనే వలపు వానలను కురియించాయి. ఆ వానలో నేను నాని పోతానని తలచి ఓ బాలా! నీ కురులు అనే గొడుగు కింద తల దాచుకోవడానికి నన్ను పిలిపించావా?"

సాధారణంగా కన్నులలో తెల్లదనం నల్లదనం రెండూ ఉంటాయి. అందువల్ల, కాంతల కన్నులను నీలిమబ్బులుగా తెల్లని వెన్నెలలుగా వర్ణించడం కవి సంప్రదాయం. ఈ సంప్రదాయాన్ని దృష్టిలో పెట్టుకొని, ప్రపాపాలికను ప్రేయసిగా తలచి, ఆమె కనుల నీలిమలే ఎగిసి నింగిలో నీలిమేఘాలైన వన్నారు అందంగా. మరో విశేషమే మంటే, ఆ మేఘాలు గర్జించకుండగనే ప్రణయవర్షాలను కురిశాయని మనోహరంగా అన్నాడు. కనులకు వలపుబాసలు వచ్చు. అయితే, ఆ బాసలు సడిసేయవు. అందుకే ఆ కనుల నీలిమలు ఉఱుమకుండ వలపువానలు కురిశాయన్నాడు. ఆమె నీలికురుల గొడుకుకింద తలదాచుకోవడానికి ఆమె పిలిచిందనడం రమణీయం. రమణీయంగా రచించడమే కవిత్వం. "బాల భవచ్చికురాల నీలి ఛత్రాన"– అనే మాటలలో రూపకాలంకారం అందగించింది. ఒక రూపం కనులముందు వెల్గింది. వృత్త్యానుప్రాసం కూడా భాసించింది.

ఈ ఉత్పల పద్యంలో కాల్పనిక కవితారేఖ తళుక్కుమంటుంది.

'నయనాల గిన్నియలు' అన్నాడు దాశరథి మరో పద్యంలో. అలాంటి రూపకాలు ప్రయోగించడం ఫార్శీ ఉర్దూ సంప్రదాయం. దాశరథి తెలుగులో ఇలాంటి కొన్ని ఫార్శీ ఉర్దూ సంప్రదాయాలను ప్రవేశపెట్టాడు.

*"పాల సముద్రమే నడిచి వచ్చిన రీతి, హిమాచలాగ్ర శృం*
*గాలు కరాలు సాచి మనకై అరుదెంచిన భాతి, శాంతి స*
*త్యాలు మనుష్య రూపమును దాలిచి నేలకు డిగ్గినట్లు, గాం*
*ధీ లలితాత్ము డుజ్జ్వల మతిన్ భరతావనిపైన కాలిడెన్"*

('కవితాపుష్పకం'- 'అమృతమూర్తి')

**అర్థాలు:-** హిమ+అచల+అగ్రశృంగాలు= మంచుకొండ కొనకొమ్ములు; కరాలు సాచి= చేతులు చాచి; అరుదెంచిన= వచ్చిన; భాతి= వలె, రీతిగా; మనుష్య రూపమును= నరుని ఆకారాన్ని; డిగ్గినట్లు= కిందికి వచ్చినట్లు, దిగివచ్చినట్లు; లలిత+ఆత్ముడు= మనోజ్ఞమైన మనస్సు కలవాడు, మనోహరమైన స్వభావం గలవాడు; ఉజ్జ్వల మతిన్= ప్రకాశిస్తున్న బుద్ధితో; భరత+అవని= భారతభూమి.

**వ్యాఖ్య:-** గాంధీ మహనీయ వ్యక్తిత్వాన్ని ఈ సుందర పద్యంలో వ్యక్తం చేశాడు దాశరథి. "గాంధీ మనోజ్ఞమూర్తి; ఉజ్జ్వలంగా భాసించే మతిమంతుడు. పాల సముద్రమే నడిచివచ్చినట్లు, హిమాలయ శిఖరాలు చేతులు చాచి మనకోసం వచ్చినట్లు ఉంటాడు అతడు. శాంతి సత్యాలు మానవరూపం ధరించి భూమిమీదికి అవతరించినట్లుగా ఆతడు భరతఖండంపై అడుగు పెట్టాడు"- ఇదీ పద్య భావం.

గాంధీ మహాత్మునిపట్ల తనకున్న ప్రేమాదరాలను దాశరథి అనేక కవితా ఖండికల ద్వారా ప్రకటించాడు కవితాత్మకంగా. గాంధీ హత్య జరిగిననాడు దాశరథి నిజామాబాదు జైల్లో ఉన్నాడు. ఆ సందర్భంలో ఆతడు దుఃఖిస్తూ-

*"హిమగిరి శిఖాముఖాన వెల్గించినావు*
*దివ్య దీపాంకురము, దేశదేశములకు*
*యుగయుగమ్ముల చీకటు లుడిగిపోవ*
*గుండెలోనుండి నెత్తురుల్ పిండి పోసి"*

అని అంటూ ఎన్నో పద్యాలు వ్రాశాడు. 'అగ్నిధార'లో ఆ పద్యాలున్నాయి.

రూపకోత్ప్రేక్షాలంకారాలతో భాసిస్తున్న ఈ పద్యం ఉత్పల మాలగా సాగింది.

"తైలాలు లేకుండ వెలిగేటి దీపం
విద్యుత్తు లేకుండ వెలిసేటి దీపం
హృదయాలలో ఎపుడు నిలిచేటి దీపం
నిజమైన దీపం మా స్నేహదీపం
మనసులో దీపం మలిపితే పాపం

వర్ణాలు వర్గాలు వదిలితే స్నేహం
వేషాలు రోషాలు మలిపితే స్నేహం
ప్రాణాల నర్పించ గలిగితే స్నేహం
కష్టాల నష్టాల నోర్చితే స్నేహం

నిరుపేద అయితేమి ఎవడైతె ఏమి?
చదువేమి రానట్టి చవటయితె ఏమి?
అందాలు చందాలు లేకుంటె ఏమి?
నిన్ను కాచిన వాడె నిజమైన నేస్తం

దోస్తీని మించింది లేదు లోకాన
రత్నాల కంటె అది మిన్న తూకాన
మిత్రుడే కావాలి సుఖమున శోకాన
అతడు లేకున్నచో నగరమే కాన

చీకట్లలో దారి చూపేది నేస్తం
కళ్లు తలకెక్కితే దింపేది నేస్తం
మనలోని లోపాలు తెలిపేది నేస్తం
నిజమైన మనిషిగా నిలిపేది నేస్తం"

('కవితాపుష్పకం'లోని 'స్నేహగీతి')

**అర్థాలు:-** తైలం= నువ్వులనూనె; తిలలు అంటే నువ్వులు. తిలలనుండి వచ్చే రసం తైలం. ఈనాడు ఈమాటను అన్నిరకాల నూనెలకు వాడుతున్నారు; వర్ణాలు= కులాలు; వర్గాలు= భాగాలు; రోషం= కోపం; దోస్తీ= స్నేహం (దోస్తీ-ఉర్దూ పదం); తూకం= సమభారం, ప్రమాణం; తూకాన= బరువులో; కాన= అడవి; నేస్తం= స్నేహం (నేస్తకాడు- స్నేహితుడు- నేస్తకత్తె= స్నేహితురాలు); చవట= పనికిరానివాడు, శక్తిహీనుడు; చవట బారడం అంటే మొద్దుబారడం.

**వ్యాఖ్య:-** ఖండగతిలో వృత్త్యనుప్రాసలతో అంత్యానుప్రాసలతో హృదయంగమంగా నడిచిన ఈ గీతం, స్వచ్ఛమైన మైత్రీ స్వరూప స్వభావాలను వివరిస్తున్నది. మొదటి పంక్తులలో స్నేహాన్ని దీపంగా రూపించాడు- దాశరథి. హృదయాలలో ఉండేది స్నేహం. అందుకే అది వెల్గడానికి, నూనెగానీ విద్యుత్తుగానీ అవసరం లేదన్నాడు. త్యాగమన్నది స్నేహ లక్షణమన్న విషయాన్ని ధ్వనింపజేశాడు ఈ కవితలో కవి.

లోపాలుగానీ పాపాలుగానీ ఏవీ చేయకుండా, మంచి చెడూ తెలిపి మానవతా మార్గంలో బతుకుసాగేలా మిత్రుడు సంస్కర్తగా సహకరిస్తాడు.

చిన్న చిన్న పాదాలలో మిన్నువలె ఉన్నతమైన భావాలను పొదిగినవాడు దాశరథి.

"దోస్తీనిమించింది లేదు లోకాన
రత్నాలకంటె అది మిన్న తూకాన"

అనే పంక్తులు హృదయాలను కదిలిస్తాయి. రమణీయార్థాన్ని కమనీయంగా చెప్పిన సందర్భమిది.

స్నేహాన్ని గూర్చి ఆదినుండి మహాకవులు అనేక విషయాలు చెప్పారు-

"మిత్రుడే కావాలి సుఖమున శోకాన".

"నిన్ను కాచిన వాడె నిజమైన నేస్తం".

"కష్టాల నష్టాల నోర్చితే స్నేహం".

ఈ పంక్తులను చదువుతున్నప్పుడు 'ఆంధ్ర మహాభారతం' శల్యపర్వంలో తిక్కన మహాకవి చెప్పిన- "మిత్రునకుం గీడువాటిల్లి నెడ నేర్పుగలుగునేని మైత్రి పరుఁడైన పౌరుషశాలి యది శమింపఁజేయు".

"దోస్తీని మించింది లేదు లోకాన"- అని పంక్తిని చూస్తే-

"మైత్రింబోలెడు ధర్మము
ధాత్రీ దివిజులక లేదు దాని నడపినం
బుత్రా యే కర్మంబు ప
విత్రతయును వలవదది వివేకముఁ జేర్చున్"

అని తిక్కన పల్కిన భారత శాంతిపర్వపద్యం స్ఫురిస్తుంది మనస్సులో.

అలాగే-"ప్రాణాల నర్పించగలిగితే స్నేహం" అనే చరణాన్ని పరికిస్తుంటే,

"ప్రాణ సముఁడైన సఖునకుఁ
బ్రాణములీఁ గనుట చెలిమి ఫలము"

అని చెప్పిన పిల్లలమఱ్ఱి పినవీరభద్రుని జైమినీ భారత పద్యం స్మృతి పథాన మెదులుతుంది.

"కష్టాల నష్టాల నోర్చితే స్నేహం
చీకట్లలో దారి చూపేది నేస్తం"

అనే చరణాలు, భర్తృహరి సుభాషితాలను చక్కని తెలుగులో అనువదిస్తూ ఏనుగు లక్ష్మణకవి రచించిన-

"అఘమువలన మరల్చు హితార్థ కలితుఁ
జేయు గోప్యంబు దాచుఁ బోషించు గుణము
విడువఁడా పన్ను లేవడి వేళ నిచ్చు
మిత్రుడీ లక్షణంబుల మెలఁగుచుండు"

అనే పద్యం టక్కన జ్ఞాపకం వస్తుంది. విషయం సుప్రసిద్ధమైనా ఆ విషయం చెప్పే తీరులో కవి ప్రతిభ వ్యక్తమవుతుంది. దాశరథి ప్రతిభామూర్తి.

# 10. ప్రబోధం

"పటుబాహాబలురైన ఆంధ్రుల గత ప్రాశస్త్యముల్ వల్లె వే
యుటలో కొన్ని తరాలు దాటినవి; పూర్వోదంతముల్ నేటి సం
కటముల్ తీర్పవు గాక; నాటి జ్వలితాంగారమ్ము లీనాటి కుం
పటిలో బూడిద కప్పుకొన్నవి రగుల్పన్ లెమ్ము, వీరాంధ్రుడా!"

('అగ్నిధార'- 'వీరాంధ్రుడా'లో)

**అర్థాలు:-** పటుబాహాబలురు= నేర్పు గలిగి భుజబలం గలవారు; గత ప్రాశస్త్యముల్= కడచిన కాలంలోని ప్రసిద్ధ విషయాలను; వల్లెవేయుట= మరల మరల చదువుట; తరాలు= పురుషాంతరాలు; తరము= పురుషునియొక్క జీవితకాలం; పూర్వ+ఉదంతముల్= గతకాలపు వృత్తాంతాలు; సంకటముల్= ఇఱుకులు, కష్టాలు; జ్వలిత+అంగారమ్ములు= మండిన నిప్పులు; రగుల్పన్= మండించడానికి; వీర+ఆంధ్రుడా= వీరుడైన తెలుగువాడా!

**వ్యాఖ్య:-** "ఓ వీరాంధ్రుడా! గొప్ప శక్తిమంతులైన ఆంధ్రుల గతవైభవం వల్లె వేయడంలో కొన్నితరాలు దాటిపోయినవి. పూర్వకాలంలో జరిగిన వృత్తాంతాలు ఈనాటి కష్టాలను తీర్చలేవు. ప్రస్తుతం అనే కుంపటిలో గతకాలపు మండుటగ్నులు బూడిద కప్పుకొని ఉన్నాయి. వాటిని తిరిగి రగుల్కొల్పడానికి లే"- అని ఈ పద్య భావం.

జాతీయోద్యమ కవిత్వంలో గతవైభవస్మరణం ఒకటి. జాతీయ కవి అయిన దాశరథి, ఆ దృష్టితో అనేక కవితలు వ్రాశాడు. అయితే ఈ పద్యంలో- కేవలం ఆంధ్రుల గతవైభవస్మరణంవల్ల గాక ప్రజల సమస్యలను పరిష్కరించడం వల్లనే తెలుగుజాతికి అభ్యుదయం కలుగుతుందనీ, సమైక్యం సిద్ధిస్తుందనీ ఆంధ్రులను ప్రబోధించాడు దాశరథి- వైతాళికుడై. గతాన్ని నిరసించడం అభ్యుదయ కవిత్వ లక్షణం. ఆ లక్షణం ఈ పద్యంలో ఉంది. దాశరథి అచ్చమైన అభ్యుదయ కవి. ఈ మత్తేభవృత్తం రూపకాలంకార సందీప్తం.

# 11. ఆశావాదం

"ఈ శిథిలాలయమ్మున జనించిన చిక్కని శర్వరీ తమో
రాశి శిఖాగ్రసీమ పదరా! ఒక దీపము పెట్టి వత్త మా
వేశములేని ఈ బ్రదుకు వీధుల వెచ్చని దీపమాలికా
పేశలకాంతి నింపుదము పెక్కుతరాల తమమ్ము లింకగన్"

(మహేంద్రోదయం- 'గుండెలో దీపాలు'లో)

**అర్థాలు:-** శిథిల+ఆలయమ్మునన్= సంధులు సడలిన పాడువడిన గుడిలో; జనించిన= పుట్టిన; శర్వరీతమస్+రాశి= రాత్రియందలి చీకట్ల గుంపుయొక్క; శిఖ+అగ్రసీమ= తల అంచుపై, నెత్తిమీద; పదరా= వెంట నడువరా; ఆవేశము= వేగిరపాటు; దీపమాలికా= దీపాలవరుస యొక్క; పేశలకాంతి= మెత్తని అందాల వెలుగు; పెక్కుతరాల తమమ్ములు+ఇంకగన్= తరతరాల చీకట్లు నశించేలాగా.

**వ్యాఖ్య:-** దాశరథి ఆశావాది. అందుకు ఉదాహరణం ఈ పద్యం. "ఈ పాడువడ్డ ఆలయంలో చిక్కని రాతిరి చీకట్లు అలముకొన్నవి. ఆ చీకట్ల నెత్తిమీద ఒక దీపం వెలిగిద్దాం పద! ఆవేశంలేని మన బతుకు బజారులలోని తరతరాల తమస్సులు ఇంకిపోయేలాగా దీపాలను పెట్టి వెలుగులు నింపివేద్దాం రా"- అని ఈ పద్యంలోని భావం. ఈ భావాన్ని చెప్పిన తీరు మాత్రం రమణీయంగా, చదువరుల ఎదలను వెలిగించేలా ఉన్నది. 'శర్వరీ తమోరాశి శిఖాగ్రసీమ', 'దీపమాలికా పేశలకాంతి' అనే రమణీయ సమాసాలు దాశరథి రచనా పాటవాన్ని చాటుతున్నాయి. 'పదరా' అని యతిస్థానంలో 'రా' వేయడంతో ఛందం అందం విందులు చేసింది. 'పెక్కు తరాల తమమ్ములింకగన్' అనే మాటలు చీకట్లను తరుమడానికి పరుగెత్తినట్లే కనిపిస్తున్నాయి. మన మనస్సులను, తనవైపు లాక్కునే మహా విద్యుద్వాహిని దాశరథి కవిత.

ఈ ఉత్పలమాల పద్యం రూపక శోభితం.

# 12. శాంతి ప్రియత్వం

"పువ్వులు ముండ్లుగా, మధుర మోహన కౌముది నిప్పుమంటగా
నవ్వులు వాడియమ్ములుగ నాకనిపించును నీవు లేనిచో;
గవ్వలు మేలి రవ్వలుగ, కాననముల్ నవనందనాలుగా
గువ్వలు రాజహంసలుగ గోచరమౌ గదె నీవు గల్గుచో"

('కవితాపుష్పకం'- 'శాంతి'లో)

**అర్థాలు:-** మధురమోహన కౌముది= తియ్యని అందాల వెన్నెల; వాడి+అమ్ములు గన్= నిశితమైన బాణాలుగా; మేలిరవ్వలుగన్= మంచి వజ్రాలుగా; కాననముల్= అడవులు; నవనందనాలుగా= కొత్త నందన వనాలుగా (నందనం= ఇంద్రుని ఉద్యానవనం); రాజహంసలుగ= శ్రేష్ఠమైన హంసలుగా (ఎఱ్ఱని ముక్కు, కాళ్లు గలిగిన హంసలు- రాజహంసలు); గోచరము+ఔగదె= కనిపిస్తాయి గదా!; నీవు+కల్గుచో= నీవున్నట్లయితే.

**వ్యాఖ్య:-** సామ్యవాదం, ప్రజాస్వామ్యం, విశ్వమానవత, శాంతి, విప్లవ చైతన్యం, దేశభక్తి అనేవి దాశరథి కవిత్వంలో ప్రధానంగా కనిపించే లక్షణాలు. ఈ పద్యం దాశరథి శాంతి ప్రియత్వాన్ని సరసంగా చాటుతుంది. శాంతి కాంతతో దాశరథి ప్రేమతో పల్కిన పల్కులివి- "ఓ శాంతీ! నీవు లేకుంటే నాకు పూలు ముళ్లుగా, నిండు వెన్నెలలు నిప్పుమంటగా, నవ్వులు బాణాలుగా తోస్తాయి. నీవుంటే- గవ్వలు రవ్వలుగా, అరణ్యాలు అందాల నందన వనాలుగా, గువ్వలు రాజహంసలుగా నాకు గోచరిస్తాయి" ఇదీ ఈ పద్యభావం. శాంతి శ్రీ సాన్నిధ్యం ఎలాంటిదో శృంగార రసరేఖా సుందరంగా చెప్పాడు దాశరథి. దాశరథిది అమృతలేఖిని. ఆ లేఖినీ స్పర్శతో ప్రతి పద్యం కళకళలాడుతుంటుంది.

ఈ ఉత్పలమాలలో రూపకాలంకార మాలికా పరిమళాలున్నాయి.

# 13. లోకజ్ఞత

*"రావణు డల్లనాడు జలరాశికి నావల లంకలో దశ*
*గ్రీవములన్ చెలంగ నడగించితి, విప్డు ధరిత్రి వేనవేల్*
*గా విలసిల్లు ఒంటితల రావణులన్ హరియింప రాగదే*
*దైవత వైరి నిర్దళన! దాశరథీ! కరుణాపయోనిధీ!*

('అభినవ'- 'దాశరథి శతకము'లో)

**అర్థాలు:-** అల్లనాడు= ఆ ప్రసిద్ధమైన ఒక దినాన, ఆ ప్రసిద్ధకాలాన; జలరాశికిన్= సముద్రానికి; ఆవల= అవతల; దశగ్రీవములన్= పది కంఠాలతో; చెలంగన్= మిక్కిలి విజృంభించగా, అతిశయించగా; అడగించితివి= అణగగొట్టితివి, వధించితివి; ధరిత్రి= భూమిమీద; వేనవేల్గా= వేలకు మించి; విలసిల్లు= ప్రకాశించు; ఒంటితల రావణులన్= ఒక తలగలిగిన రావణాసురులను; హరియింప= వధింప; దైవతవైరి= దేవతల శత్రువులైన రాక్షసులను; నిర్దళన= చంపేవాడా!; దాశరథీ!= దశరథుని పుత్రుడవైన శ్రీరామచంద్రుడా!; కరుణాపయోనిధీ!= కరుణాపయస్+నిధీ= దయా సముద్రుడా! (పయస్+నిధి= నీటిరాశి= సముద్రం).

**వ్యాఖ్య:-** భద్రాచల రామదాసు వ్రాసిన దాశరథి శతకం భక్తికి సంబంధించింది. ఆ శతకంలోని మకుటాన్నే గ్రహించి, దాశరథి వ్రాసిన ఈ శతకం ఈనాటి సమాజాన్ని మర్మస్పృక్కుగా విమర్శించడానికి ఉద్దేశింపబడింది. ప్రముఖ చలనచిత్ర నిర్మాత చక్రపాణిగారి ప్రేరణచే దాశరథి ఈ శతకాన్ని వ్రాశాడు.

"అలనాడు సముద్రానికి ఆవల లంకలో పది తలలతో చెలరేగిన రావణాసురుణ్ని సంహరించావు. మరి ఇప్పుడు ఈ భూమిమీద ఒంటితల రావణులు వేల సంఖ్యలో ఉన్నారు. వాళ్లను చంపడానికి రావయ్యా రామయ్యా!"- అంటూ రాజైన ఆ దాశరథిని కవిరాజైన ఈ దాశరథి ప్రార్థించాడు.

'ఒంటితల రావణులన్' అని అనడం భావస్ఫోరకంగా ఉంది. శ్రీరామునికి- "దైవతవైరి నిర్దళన"- (రాక్షసులను సంహరించిన వాడా!) అనే సంబోధన సాభిప్రాయంగా ఉంది. పరికరాలంకార శోభితమైంది ఈ పద్యం. ఆధునిక సమాజంలో రాక్షస కృత్యాలు అధికమవుతున్నాయని చెప్పే పద్యమిది.

ఈ ఉత్పల వృత్తంలో రూపకం దీపిస్తున్నది.

*"ఓటుకు పచ్చనోటు నిడ నోపినవాడె ప్రశాసకుండగున్*
*నోటున కోటు నమ్ముకొని నోటికి తాళము వేసికొన్న మా*
*బోటి దరిద్ర మానవుల పొట్టను పెట్టుకొనంగ వచ్చు, ఆ*
*తాటకి నెట్లు కూల్చెదవొ? దాశరథీ! కరుణాపయోనిధీ!"*

(అభినవ దాశరథీ శతకం)

**అర్థాలు:-** పచ్చనోటును= పచ్చని ఐదురూపాయల నోటును (ఈ కాలంలో ఐదువందల పచ్చనోటు); ఇడన్= ఇవ్వడానికి; ఓపినవాడె= సమర్థుడైనవాడే, ధనవంతుడే; ప్రశాసకుండు= పరిపాలకుడు, ప్రజాప్రతినిధి (శాసించువాడు శాసకుడు, బాగుగా శిక్షించేవాడు, ఆజ్ఞాపించేవాడు); నోటికి తాళము వేసికొన్న= నోరు మూసికొన్న; మా బోటి= మావంటి; దరిద్ర మానవుల= పేదవాళ్లను; పొట్టను పెట్టుకొనంగవచ్చు= చంపే, నశింపజేసే; తాటకి= తాటక- ఒక రాక్షసస్త్రీ, సునందుని భార్య. మారీచ సుబాహుల తల్లి, సుకేతుడు అనే యక్షుని కూతురు. వేయి ఏనుగుల బలం గలది. శ్రీరామచంద్రుడు ఈమెను చంపాడు.

**వ్యాఖ్య:-** ఈనాటి ప్రజాస్వామ్యం ధనికస్వామ్యం పాలవుతున్నదని దాశరథి ఆవేదనను వ్యక్తం చేస్తూ వ్రాసిన పద్యమిది. ప్రజాస్వామ్యంలో గుణం కాదు కావలసింది- గణం. ఏ రాజకీయపార్టీ ఎన్నికలలో ఎక్కువ ఓట్లు సంపాదించుకుంటుందో ఆ పార్టీ ప్రభుత్వాన్ని ఏర్పాటు చేసి, దేశాన్ని పాలిస్తుంది. అందువల్ల 'ఓటు'కు ప్రాధాన్యం హెచ్చింది. దాన్ని గూర్చి చెప్పిన పద్యమిది-

"ఓటుకు పచ్చనోటును ఇవ్వగల్గినవాడే పాలకుడౌతాడు. నోటుకోసం ఓటును అమ్ముకొని, 'నోటికి తాళము' వేసికొనే మాలాంటి దరిద్రులను మింగే తాటకిని ఏ విధంగా కూలుస్తావో దాశరథీ!"- అని తన బాధను ప్రభువైన రామునికి చెప్పుకొన్నాడు దాశరథి. 'తాటకి' అనే మాట ఓట్లనుకొనే ధనికులకు ప్రతీక- 'నోటికి తాళము వేసికొన్న' అంటే- ప్రభుత్వాన్ని నిలదీసే హక్కు ఓట్లను అమ్ముకొన్న దరిద్రుల కుండదు అని అర్థం. ఆధునిక భావాలను పద్యంలో ప్రకటించవచ్చని దాశరథి నిరూపించాడు.

వృత్త్యనుప్రాసలతో రూపక సమాసోక్త్యలంకృతులతో భాసించే ఈ పద్యం ఉత్పలమాల.

"ఎవ్వడు గట్టిగా అరచు, నెవ్వడు మోసము సేయజాలు, నిం
కెవ్వడు కాళ్లు పట్టుకొనియే క్షణమాత్ర గ్రహించు జుట్టు, వా
డివ్వసుధాస్థలిన్ గణుతికెక్కు ధురంధరుడంచు, వానికిన్
తవ్వల కొద్ది రవ్వలట! దాశరథీ! కరుణాపయోనిధీ!"

(అభినవదాశరథీ శతకము)

**అర్థాలు:-** క్షణమాత్ర= వెంటనే (క్షణం= నాలుగు నిమిషాలు); వసుధాస్థలిన్= భూమండలంలో; గణుతికి+ఎక్కు= ప్రసిద్ధి వహించు; ధురంధరుడు= భారం వహించేవాడు; తవ్వల= రెండు సోలల కొలదిగల మాన విశేషం, ధాన్యం కొలతలోని ఒక విశేషం; రవ్వలు= వజ్రాలు; దాశరథి= దశరథుని కుమారుడైన శ్రీరాముడు; కరుణాపయస్+నిధీ!= దయాసముద్రుడా!; పయస్+నిధి= జలరాశి= సముద్రం).

**వ్యాఖ్య:-** ఈ పద్యం దాశరథి రచించిన అభినవ దాశరథి శతకం (1962)లోనిది. ఈ శతకం నవ్యసంప్రదాయ మార్గానికి సంబంధించిందే. ఉత్పల-చంపక వృత్తాలతో 'దాశరథీ కరుణాపయోనిధీ!'- అనే మకుటంతో సాగిన శతకమిది. ప్రముఖ చలనచిత్ర నిర్మాతలూ రచయితలూ 'యువ' పత్రికాధిపతులూ అయిన శ్రీ చక్రపాణి ఆదేశం ప్రకారం, దాశరథి ఈ శతకాన్ని రచించాడు. ఆధునిక లోకంలోని ఎన్నో విషయాలను వివరిస్తూ దాశరథి, ఆధునిక మార్గ సంచారియై ఈ శతకం రచించి ఆ భద్రాద్రి రామునికి అంకితం చేశాడు. ఈ శతకం మొదట 'యువ' మాసపత్రికలో ధారవాహికంగా ప్రచురితం. ప్రముఖ చిత్రకారులు శ్రీ బాపు ఈ పద్యాలకు చక్కని చిత్రాలు సమకూర్చారు. ఈ శతకంలో 110 పద్యాలున్నాయి.

"ఎవ్వడు గట్టిగా అరుస్తాడో, ఎవ్వడు మోసం చేయగలుగుతాడో, ఇంకా ఎవ్వడు కాళ్ళుపట్టుకొని అవకాశం రాగానే రంగుమార్చి, వెంటనే జుట్టు పట్టుకొంటాడో అలాంటివాడు ఈ ప్రపంచంలో 'ధురంధరుడు' అని పేరుకెక్కుతాడు. అలాంటివానికే తవ్వలకొద్ది రవ్వలు (కోట్లకొద్ది ధనం) లభిస్తాయట"- అని ఈ పద్యభావం.

ఈనాటి సమాజంలోని మానవుని దుశ్శీలాన్ని ఎత్తిచూపాడు దాశరథి. అవకాశాన్ని బట్టి మారే మానవ స్వభావాన్ని మఱుగులేని మాటలలో తెలిపాడు. "అందితే సిగ అందకుంటే కాళ్లు" అని సామెత, "సామెత పుట్టిననాటి మానవ స్వభావం వేఱు; నేటి మానవ స్వభావం వేఱు. ఒక క్రియ చేయుచునే మఱొక్కదానిని గూర్చి తక్షణమే తలచుచుండును. ఆ భావమే పైన ప్రపంచితమైనది"- అని ఈ పద్యాన్ని గూర్చి మహావిమర్శకులు శ్రీనిడుదవోలు వేంకటరావుగారు ఈ శతక సమీక్షలో వ్రాసిన మాటలు ఈ సందర్భంలో గమనింపదగినవి.

ఈ ఉత్పలమాల వృత్తం, వృత్త్యనుప్రాస- రూపకాలంకారాలతో ఉల్లాలను అలరిస్తున్నది.

## 14. నిర్వచనాలు

(కవిత్వ- విప్లవ నిర్వచనాలు)

"దూరాన పొడిగాలి దెబ్బలకు
తునాతునకలైపోయిన ఆకులతో
ముసలిమొహం పడిన వృక్షంమీద
యౌవనం చిగిరించడం కవిత్వం"

"రోజూ కనపడే నక్షత్రాల్లోనే
రోజూ కనపడని కొత్తదనం చూచి
రోజూ పొందని ఆనందానుభూతి
పొందడం అంటేనే కవిత్వం"

"మనసు మల్లె పొదల్లోంచి
పసందైన వాసనలు వీచి
అవి పద్యాల సీసాల్లో
అనంతకాలం నిలిస్తే కవిత్వం"

('పునర్నవం'లోని- 'పునర్నవం'లో)

**అర్థాలు:-** నక్షత్రాల్లోనే= చుక్కలలోనే; ఆనంద+అనుభూతి= సంతోషాన్ని అనుభవించుట.

**వ్యాఖ్య:-** "దూరాన... కవిత్వం".

ప్రాచీన ఆలంకారికులూ సాహితీవేత్తలూ కవిత్వం అంటే ఏమిటో రకరకాల నిర్వచనాలను తెలిపారు. 'కవిః' అంటే- చాతుర్యంతో వర్ణించేవాడు- "కవయతి చాతుర్యేణ వర్ణయతీతి కవి" అని అమరకోశం నిర్వచనం. కవికర్మ- కావ్యం లేదా కవిత్వం. రసాత్మకమైన వాక్యం కావ్యం- "వాక్యం రసాత్మకం కావ్యమ్" అని కూడా అన్నారు పెద్దలు. రమణీయమైన అర్థాన్ని ప్రతిపాదించే శబ్దం కావ్యం- "రమణీయార్థ ప్రతిపాదక శబ్దః కావ్యమ్". ఈ నిర్వచనం అందరి అంగీకారాన్ని పొందింది. ఒకరకంగా చెప్పాలంటే చమత్కారవత్వాన్ని కలిగించే శబ్దం కావ్యం లేదా కవిత్వం అని ఒక్కమాటలో గ్రహించవచ్చు. అందుకే- దాశరథి చమత్కారంగా చెప్పాడు కవిత్వమంటే ఏమిటో, తన భాషలో ఊహతో- ఆకులు రాలిన చెట్లు మళ్లీ చిగురించడం కవిత్వం అన్నారు. చెట్టు తాను కోల్పోయిన యౌవనాన్ని మళ్ళీ పొందుతుంది- చిగుళ్లువేసి. అందుకే మళ్లీ మళ్లీ కొత్తదనాన్ని పొందుతుంది. ఎప్పుడు విన్నా, చిగిరించిన చెట్టులాగా కొత్త కొత్తగా మనసుకు కనిపిస్తే- అనిపిస్తే అది కవిత్వం. నిత్యనూతన ఆనందాన్ని కలిగించేది కవిత్వం. అందుకే ఈ కవితకు 'పునర్నవం'- పునఃనవం- మళ్లీ కొత్తగా భాసించేది అని పేరు పెట్టారు దాశరథి. చదివినప్పుడల్లా కొత్తగా అనిపించేది కవిత్వం. దానికి పాతదనం ఉండదు. కవిత్వం ఎప్పుడూ కొత్తగా ఉంటుందని చెప్పడానికి ముసలి చెట్టుమీద యౌవనం చిగిరించడం- అనే ఉదాహరణం చూపారు. ఇది కవిత్వానికి సోదాహరణ నిర్వచనం.

"రోజూ కనపడే... కవిత్వం".

కవిత్వానికి దాశరథి చెప్పిన మరో సోదాహరణ నిర్వచనం ఇది. రోజూ చూచే చుక్కలలో రోజూ చూడని ఒక కొత్తదనం చూడగలగాలి. చూచి కొత్త ఆనందాన్ని పొందాలి. అలా ఎప్పుడూ నవ్యానందాన్ని కలిగించగలిగితే అది 'కవిత్వం' అన్నారు దాశరథి. కవిత్వం పునఃపునః నవీనమైనదనీ నిత్యానంద ప్రదమైనదనీ భావం.

"మనసు మల్లెపొదల్లోంచి... కవిత్వం".

ఇది మరొక సోదాహరణ కవితా నిర్వచనం. కవి మనస్సు మొదట మల్లెపొదలా ఉండాలి. మల్లెలాంటి ఆ మనస్సులో 'వాసనలు' అనే భావాలు (ఊహలు) తరగెత్తాలి. ఆ భావాలను ఎటూ పోకుండ పద్యాలలో బిగించాలి. ఆ పద్యాలు కాలాన్ని గెలుస్తూ నిత్యం కొత్తగా అనిపించాలి– అప్పుడు ఆ పద్యాలు కవిత్వం అనిపించుకోగలుగుతాయి.

ఈ సందర్భంలో 'పద్యాల సీసాలు' అనే రూపక సమాసం గమనింపదగినది. భావాలను పద్యాలనే సీసాలలో ఎందుకు పోదగాలి? ఇక్కడ 'సీసాలు' అంటే సీసపద్యాలు కాదు. పద్యాలు అనే గాజు పాత్రలు– అని అర్థం. సాధారణంగా సుగంధరసాలను గాజుపాత్రలలో భద్రపరుస్తారు గదా!

మల్లికా సుమగంధంలాంటి భావాలను కవి పద్యంలో బిగించాలట. పద్యం, ఛందస్సు యొక్క రూపం. పద్యలక్షణం చెప్పే శాస్త్రాన్ని 'ఛందస్సు' అంటారు. ఛందస్సులు అనేక విధాలు. గేయం కూడా ఛందోమయమే. గేయాన్ని 'మాత్రాచ్ఛందస్సు' అంటారు. 'మాత్ర' ఒక కాలమానం– రెప్పపాటు కాలం. లఘువుకు ఒక మాత్ర; గురువుకు రెండు మాత్రలు. 'ఛందస్సు' అంటే ఆహ్లాదాన్ని కలిగించేది అని అర్థం. 'ఛందస్సు' భావాలను కప్పుకొని ఉంటుంది అంటే భావానికి ఆచ్ఛాదనం ఛందం. పాదబద్ధమైనది పద్యం. పద్యంలో గణాలు, యతులు, ప్రాసలు ఉంటాయి. పద్యం గానయోగ్యం. చెవికి ఇంపైనది. మరో విశేషమేమంటే కచ్చితమైన నియమాలు కలిగిన పద్యం చాలాకాలం ఉంటుంది. ఒకరకంగా, కాలాన్ని జయిస్తుంది. అందుకే మన ప్రాచీనులు సర్వశాస్త్రాలను కావ్యాలను శ్లోకాల్లో పద్యాల్లో రచించారు. మరో అంశమేమంటే– పద్యం గణ – యతిప్రాసలవల్ల ధారణకు సులభంగా ఉంటుంది. పద్యవేత్తలు ఏకాగ్రతతో పద్యాన్ని ఒక్కసారి చదివితేచాలు. దానిని తిరిగి అప్పచెప్ప వచ్చు. అందులో ఆ సౌలభ్యం ఉంటుంది. కాలాన్ని జయించాలనే ఆశయమున్న కవులు, కావ్యాలను కాలానికి ఎదురీది నిలిచే పద్యాల ద్వారా తమ భావాలను ప్రసారం చేస్తారు; ప్రకటిస్తారు.

ఈ సందర్భంలో దాశరథి మాటలు మననీయాలు– "నాకు స్థలాన్ని ఆక్రమించుకోవడం మీద నమ్మకం లేదు. కాలాన్ని ఆక్రమించాలనే ఆశ తప్ప. అందుకే వచనం పలకడానికి అంతగా ఇష్టపడలేదు"– అని అన్నాడు– 'పునర్నవం' సంపుటిలోని తమ 'మననం'లో. దాశరథి కవిత్వం పద్య, గేయ, వచన కవితారూపాలలో ఉన్నా

పద్యాలే ఎక్కువ. కాలాన్ని ఆక్రమించేది పద్యం. ఆక్రమించలేనిది వచనం. అందుకే వచనంలో వ్రాయడం తన కిష్టంలేదన్నాడు దాశరథి. అందుకే మల్లె పరిమళాల వంటి భావాలను పద్యాలసీసాల్లో భద్రపరుచమన్నాడు. ఆ పరిమళాలు నిత్యనూతనంగా ఉండే ఆనందాన్ని అందిస్తాయి.

"A thing of beauty is joy forever"- అందమైన వస్తువు ఎప్పుడూ ఆనందింపజేస్తూనే ఉంటుంది- పువ్వులాగా దివ్వెలాగా రవ్వలాగా రవిలాగా. కవిత్వం అందమైన వస్తువు చంద్రబింబంలా, దాని లక్షణం నిత్యం ఆనందింపజేయడం. సందేశం అందించడమనే లక్షణం అనివార్యం కాదు. ఇలాంటి కవితాసృష్టికి వ్యుత్పత్తి (పాండిత్యం), భావనాబలం, శిల్పం- ఈ మూడు సమ నిష్పత్తిలో సమ్మేళనం చెందాలి.

అభ్యుదయ భావజాలాన్ని గేయాలలో వచన కవితలోనే గాక పద్యంలోనూ పొదిగిన విద్వన్మూర్తి దాశరథి. ఆయన కవిత్వం 'పునర్నవం'.

"విప్లవమంటే మృత్యువు
విలయతాండవం కాదు
విప్లవమంటే బాంబుల
వికటాట్టహాసం కాదు

విప్లవ మంటే రక్తం
వెదజల్లుట కాదర్రా
పీన్గుల గుట్టలనుండి
విప్లవాలు రావర్రా

ప్రజలను మేల్కొల్పాలి
నిజమేదో తెల్పాలి
హృదయాల్లో
విప్లవాలు ఎదగాలి

('ఆలోచనాలోచనాలు'లో 'యేది విప్లవం'లో)

"నిన్ను నీవు తెలుసుకుని
నీ కన్నులు తెరుచుకుని
విజృంభించినప్పుడదే
విప్లవమని నేనంటా"

("తిమిరంతో సమరం"లోని 'మనిషీ-మనీ-పని'లో)

**అర్థాలు:-** మృత్యువు= మరణం, మరణాధిదేవత; విలయం= ప్రళయం; తాండవం= ఉద్ధతమైన నృత్యం; విప్లవము= దేశ ఉపద్రవం, నాశనం, శాసనాన్ని ఉల్లంఘించడం; వికట+అట్టహాసం= ఎదురు తిరుగుతూ వంకరగా పెద్ద నవ్వు నవ్వడం; విజృంభించి= చెలరేగి, వికసించి.

**వ్యాఖ్య:-** విప్లవ శబ్దానికి అనేకార్థాలున్నాయి- నీటిలో కొట్టుకొనిపోవడం అనీ, పరస్పర విరోధం అనీ, క్షోభ అనీ, రహస్యాన్ని బయటపెట్టడం అనీ శాసనోల్లంఘనం అనీ నాశనమనీ.

ఈ రోజుల్లో 'విప్లవము'- అనే మాట క్రాంతి, గొప్పమార్పు అనే అర్థాల్లో ప్రయోగింపబడుతున్నది. విప్లవాన్ని ఇంగ్లీషులో 'Revolution' అంటారు. విప్లవ వాదులు సాయుధ సమరాన్ని సమర్థిస్తారు. సాయుధవిప్లవం ద్వారా సామాజికమైన మార్పు సాధ్యమని నమ్మి, దానిని ప్రచారం చేస్తారు. విప్లవ కవిత్వాన్ని 'Revolutionary Poetry' అని అంటారు.

తెలంగాణా నిజాం నవాబు దుష్టత్వాన్ని ఎదిరించి, ధిక్కరించిన దాశరథి తెలంగాణా విప్లవ వీరుడు, విప్లవకవి. స్వయంగా విప్లవం తెచ్చిన దాశరథి తన అనుభవాన్ని పురస్కరించుకొని నిజమైన విప్లవం అంటే ఏమిటో పై పంక్తుల్లో విప్పి చెప్పాడు. విప్లవమంటే చావు-ప్రళయతాండవం కాదు- బాంబుల వికటాట్టహాసం కాదు. నెత్తురును వెదజల్లడం కాదు. అందరూ చనిపోతే విప్లవం రాదు. నిర్మూలనం నుండి నిర్మాణం జరుగదు. ప్రజలకు నిజం చెప్పి, వాళ్ల కళ్లు తెరిపించాలి. ప్రజల మనస్సుల్లో విప్లవాలు నాటుకోవాలి. నిజం చెప్పి, వాళ్ల కళ్లు తెరిపించాలి. మొదట ప్రతివాడు తనను తెలిసికోవాలి. యథార్థాన్ని గ్రహించాలి. తర్వాత- శిరస్సెత్తి చెలరేగాలి. వికాసాన్ని అభ్యుదయాన్ని ఆశించి, మార్పుకోసం ప్రయత్నించడమే విప్లవం అని దాశరథి మహాకవి అభిప్రాయం.

ఈ కవితలో 'అపహ్నుతి' అలంకారం రేఖా మాత్రంగా భాసిస్తున్నది.

# 15. దాశరథి రుబాయీలు

"పడవ నడపలేనివాడు నావికుడు
పదము పాడరాని వాడు గాయకుడు
అందుకనే వేదనతో నేనంటాను
ప్రజల నడప లేనివాడు నాయకుడు"

('ఆలోచనాలోచనాలు'లో 'నేనంటాను')

**వ్యాఖ్య:-** దాశరథి మహాకవి తెలుగు రుబాయీ ప్రయోక్త. 'రుబాయీ' అరబ్బీ భాషాపదం. 'రుబా' అంటే 'నాలుగు' అని అర్థం. రుబాయీ అంటే శబ్దార్థం నాలుగు భాగాలు కలిగి ఉండడం. ఫారసీలో మొదట రుబాయీ ప్రక్రియ వెలువడింది. ఆ తరువాత అరబ్బీ సాహిత్యంలో రుబాయీలు వెలువడ్డాయి. ఈ రుబాయీ కవితా ప్రక్రియ గులాబీపూవులా ఇరాన్ నుండి మనదేశం వచ్చింది. ఉర్దూలో పదహారవ శతాబ్దం నుండి రుబాయీలు వస్తున్నాయి. హిందీలో రుబాయీ, చౌపాయీగా రూపుదిద్దుకొన్నది. ఇరాన్ దేశీయుడూ ప్రతిభావంతుడూ అయిన ఉమర్ ఖయ్యాం పదకొండవ శతాబ్దంలో ఫారసీలో ఆణిముత్యాలలాంటి రుబాయీలను రచించాడు. రుబాయీ మాత్రాచ్ఛందో విశేషం. నాలుగుపాదాల ముక్తకం. ప్రతిపాదం సమమాత్రాకం. రుబాయీలోని మూడవపాదానికి తప్ప మిగిలిన పాదాలకు అంత్యప్రాస ఉంటుంది. అంత్యప్రాసను 'రదీఫ్' అంటారు. రుబాయీలో అంత్యప్రాసకు ముందు మరో అనుప్రాస ఉండడం వాంఛనీయం. దానిని 'ఖాఫియా' అంటారు. రుబాయీలో కొందరు కవులు కలంపేరు (తఖల్లుస్)ను ప్రయోగిస్తారు. అయితే అది అనివార్యం మాత్రం కాదు. మాత్రాచ్ఛందంలోని ఏ గతిలోనైనా రుబాయీ రచించవచ్చు. రుబాయీలోని నాలుగు పాదాల చివర తుల్యప్రాస ఉంటే ఆ రుబాయీని 'రుబాయీ తరానా' అంటారు. రుబాయీలో ప్రధానంగా ఒకే ఒక్క భావముంటుంది. రుబాయీలోని నాల్గవ పాదం ప్రధానమైనది. ఇందులో మూడు పాదాలసారం ఇమిడి ఉంటుంది. ఈ ముగింపు పాదంలో కవి ప్రతిభ, చమత్కృతి, ప్రౌఢిమ ప్రస్ఫుటమవుతాయి. బిందువులో సింధువును ఇమిడ్చినంత పని అవుతుంది ఒక రుబాయీని రచించడమంటే.

పైన పేర్కొన్న రుబాయీ త్రిశ్రగతిలో సాగింది. మూడవపాదంలో రెండు మాత్రలు అధికంగా ఉన్నాయి. అయినా తాళబద్ధంగా రాగాత్మకంగా సాగే గేయం కాబట్టి ఊపులో ఆ మాత్రాధిక్యం ఏర్పడడం లేదు. 'నేనంటాను' అనే బదులు 'అంటాను' అంటే సరిపోతాయి మాత్రలు.

ఈ రుబాయీ నాల్గవపాదంలోని భావం అతి ముఖ్యం. అదే కవిహృదయం. ఈ కాలంలో ప్రజాస్వామ్యయుగంలో, పలుపార్టీలూ, బహునాయకత్వాలూ అనివార్యం. ఒక్కొక్క నియోజకవర్గానికి, ఒక్కొక్క నాయకుడు ఎన్నికవుతాడు. సముజ్జ్వల వ్యక్తిత్వం వల్ల కాక, ఉదారచరిత్రవల్ల కాక, సంపదవల్ల, సత్తువవల్ల, సిఫారసులవల్ల, పైరవీవల్ల- ఈ సర్వశక్తులవల్ల ఎన్నికలలో నాయకులు ఎన్నికవుతున్నారు. నాయకుడని పేరు గడిస్తున్నారు. ఈ విధానం కేవలం రాజకీయ రంగానికే కాదు మానవ జీవన సకల రంగాలలో ఈ ధోరణి కొనసాగుతునే ఉంది. ఒక రకంగా ఇది ఆధునిక యుగ లక్షణమేమో! అని అనుకునేటంత బలంగా ముదిరిపోయింది. పూర్వం ఒక వ్యక్తి యొక్క సామర్థ్యంవల్ల, అతనికి నాయకత్వం సిద్ధించేది. ఆ సామర్థ్యం సహజ ధైర్యసాహస దాన త్యాగ పరోపకార గుణాదులవల్ల ప్రాప్తించేది. అందువల్లనే ఆనాడు ప్రభువులై నాయకులై ప్రజలను న్యాయమార్గంలో నడిపేవారు. కాని, ఈనాటి పద్ధతి దానికి వ్యతిరేకం. ఈనాటి నాయకులు ప్రజలను నడుపలేక పోతున్నారు. అందుకే దాశరథి "వేదనతో నేనంటాను" అంటూ తన ఆవేదనను వ్యక్తం చేశాడు.

'ప్రజల నడపలేనివాడు నాయకుడు'- అనే ప్రధాన భావాన్ని చెప్పడానికి సమాంతరమైన రెండు భావాలను ఆధునిక జీవనరంగాలనుండి ఎన్నుకొని మొదట రెండు పాదాలను నిర్మించాడు. అలా ఈ రుబాయీ చివరి పాదంలో దాశరథి, చెప్పదలచుకొన్న ముఖ్య భావాన్ని ప్రతిభతో ప్రౌఢిమతో వ్యక్తం చేసి ఆనందింప జేశాడు. ఈ విధంగా వర్తమాన నాయకత్వంలోని అసమర్థతనూ బలహీనతనూ ఈ రుబాయీ అధిక్షేపాత్మకంగా సూచిస్తున్నది. సహృదయ పాఠకులను అలరిస్తున్నది.

నాయక శబ్దానికి నేత, ప్రభువు, స్వామి- అనేవి పర్యాయ పదాలు. నాయకుడు, నేత- అనేవి ఈనాడు ప్రాచుర్యం పొందిన మాటలు. నాయకుడు, నేత- అంటే సేవకులను నియోగించేవాడు- "నయతి వినియుంక్తే సేవకాన్ ఇతి నాయకః" అని వ్యుత్పత్త్యర్థం. 'ప్రజా' శబ్దానికి-జనులనీ, సంతానమనీ అర్థాలు.

"నవబాష్పధారలో నవ్వు కాగలవు
ముళ్లతీగెలలోన పువ్వు కాగలవు
యత్నించి చూడమని అంటాను నేను
రాళ్ల రాసులలోన రవ్వ కాగలవు"

**వ్యాఖ్య:**– ఖండగతిలో సాగిన రుబాయీ ఇది. సమమాత్రాకంగానూ, 'ఖాఫియా' సహితంగానూ ఉంది. ప్రయత్నం చేస్తే మానవుడు మంచిఫలితాన్ని పొందగలుగుతాడు అని ఉపదేశిస్తున్నది ఈ రుబాయీ. ప్రయత్న లోపం మంచిది కాదు. "ఉద్యోగః పురుష లక్షణమ్"– ప్రయత్నించడం పురుష లక్షణం. ప్రయత్నశీలుడైన పురుష తిలకుణ్ని సంపద వరిస్తుంది. "ఉద్యోగినం పురుష సింహముపైతి లక్ష్మీః" అనే సూక్తులు ఈ సందర్భంలో స్ఫురిస్తాయి. ప్రయత్నించినా ఫలం దక్కకుంటే అది మానవదోషం కాదు– "యత్నేకృతే యది నసిద్ధ్యతి కోఽత్ర దోషః"– అని సుభాషితం. Hard work is next name for luck''- అని ఆంగ్లసూక్తి. ఈ సూక్తుల సారాన్నే ఉదాహరణ రమ్యంగా ఉల్లేఖిస్తున్నది ఈ రుబాయీ. ఓ మానవుడా! నీవు యత్నిస్తే బాష్పంలో నవ్వువవుతావు, ముళ్లల్లో పువ్వువవుతావు, రాళ్లల్లో రవ్వవవుతావు– అని మూడు ఉదాహరణాలతో ముచ్చటగా చెప్పాడు దాశరథి. ఈ రచనలో చిత్రమేమంటే 'బాష్పం' (కన్నీరు) నవ్వుకు వ్యతిరేకం, ముళ్లకు పువ్వు వ్యతిరేకం, రాళ్లకు రవ్వ వ్యతిరేకం. బాష్పధార ముళ్లతీగ, రాళ్లు– కష్టానికి సంకేతాలు. నవ్వు, పువ్వు, రవ్వ– సుఖాన్ని కలిగించేవి. ప్రయత్నిస్తే కష్టాలే ఇష్టసుఖాలవుతాయి– అని సందేశం. ఏడ్చినవాడు నవ్వడం, గులాబీ– మొగలి పూలచెట్లకు ముళ్లుండడం, రవ్వలు కూడా ఒక విధమైన శ్రేష్ఠమైన రాళ్లు కావడం– మనకు తెలిసిందే. నవ్వు కావాలన్నా, పువ్వు కావాలన్నా రవ్వకావాలన్నా ప్రయత్నం చేయాలని కవి బోధ.

"ఒక్కొక్క యడుగడుగె ఒగి ముందుఁబెట్టితే
నెక్కువౌ కొండైనా నెక్కుఁగొనకు"

అని అన్నాడు అన్నమయ్య. అందుకే దాశరథి అన్నాడు– "యత్నించి చూడమని". పండైనా పిండితేగాని రసం రాదు కదా! ఇలా ఈ రుబాయీ చూస్తే చిన్నది, ఆలోచిస్తే మిన్నది. ఆలోచనామృతం సాహిత్యం కదా!

"నిప్పులోంచి అప్పుడపుడు పొగ పుడుతుంది
నీళ్లలోంచి విద్యుత్తను సెగ పుడుతుంది
ఈ దానవలోకంలో ఎన్నటికైనా
మానవులని 'పిలువదగిన తెగ పుడుతుంది" ('జ్వాలా లేఖిని')

**వ్యాఖ్య:-** ఈనాటి సమాజంలో దినందినం దానవత్వం ప్రబలిపోతున్నది. మానవత్వం క్రమంగా మాయమవుతున్నది. కలియుగ ప్రభావమేమో! ఏమైనా- హింసకూ అశాంతికీ స్వార్థానికీ సరిహద్దులు లేకుండ పోతున్నాయి. మంచికీ త్యాగానికీ మనస్సులలో మరీ చోటు తగ్గిపోతున్నది. ఫలితంగా మానవత నిండుగా ఉండాలని కోరుకొనేవాళ్లకు ఒకరకంగా ఈ లోకం దానవలోకంగా కనిపిస్తున్నది. దాశరథి మానవతావాది.

"హింసావాదాలన్నీ ఇఱ్ఱింకులింకాలి
మానవతావాద మొకటే మహిలో విలసిల్లాలి"

అని గొంతెత్తి చాటిన మహాకవి. మరి ఆయన కంటికి ఈ లోకం దానవలోకం వలెనే అగుపించడం అసహజమేమీ కాదు. మరి ఆయన మానవత విలసిల్లే మానవ లోకాన్ని అపేక్షించకుండ ఎలా ఉంటాడు? ఎండకాలంలో వర్షాలు దాగున్నాయనీ, ఎడారి పొలాలలో గంగలు పొంగుతాయనీ, జైలులో ప్రజల రాజ్యాలున్నాయనీ, నిరుపేద నెత్తురు చుక్కలో విప్లవాలున్నాయనీ ప్రగాఢ విశ్వాసమున్న ఆశావాది దాశరథి.

నిప్పులోంచి పొగ పుట్టేలాగా, నీళ్లల్లోంచి విద్యుత్ జ్వాల పుట్టేలాగా ఈ రాక్షస లోకం నుండి మానవులని పిలువదగిన తెగ- ఒక జాతి పుట్టి తీరుతుందని గాఢంగా ఆశిస్తున్నాడు దాశరథి. తిమిరంలో దీపం పెట్టాలనే ఆశావాది ఆయన.

"నీళ్లల్లో విద్యుత్తను సెగ"- అంటే Hydro-electricity- జలవిద్యుత్తు.

ఈ రుబాయీ మూడవ పాదంలో ఒక మాత్ర అధికంగా ఉంది. ఆ మాత్రాధిక్యం వల్ల అర్థస్ఫూర్తి నిండుగా కలుగుతుంది- వ్యావహారిక భాషా ప్రయోగ విధానంలో.

ఇలా మానవతా, ఆశావాదాల సరస సమ్మేళనం ఈ రుబాయిలో భాసిస్తున్నది.

"పానీయం వేరైనా దాహం ఒకటే
మోతాదులు వేరైనా మోహం ఒకటే
పంచేంద్రియ పరినిర్మిత పంజరమైనా
పంచప్రాణములున్నా దేహం ఒకటే" ('జ్వాలా లేఖిని')

"ఎన్నెన్ని మతాలకైన సూత్రం ఒకటే
పాత్రలెన్ని కనపడినా చిత్రం ఒకటే
ఒక చెట్టుకు ఎన్నెన్నో కొమ్మలు వున్నా
అన్నిటికీ తరుమూలం మాత్రం ఒకటే" ('నేత్రపర్వం'లో)

**వ్యాఖ్య:-** దాశరథి మొదటినుండి సమైక్యవాది. అఖండతావాది, భిన్నత్వంలో ఏకత్వం కలిగిన మనదేశం లక్షణానికి ఈ రుబాయిలు అద్దం పట్టుతున్నాయి.

'పానీయం' అంటే తాగదగింది అని అర్థం. పాలు, మజ్జిగ, మధువు, ఫలరసాలు- ఇలా ఎన్నెన్నో స్ఫురిస్తాయి- 'పానీయం' అన్నప్పుడు. 'దాహం' అంటే దప్పి, మరో అర్థం కాలడం, ఈ 'దాహం' చల్లబడడానికే పానీయాలు తాగడం. పానీయాలు వేరైనా దాహం మాత్రం ఒక్కటే. అలాగే- 'మోతాదులు' అంటే పరిమితులు వేరైనా మోహం అంటే- వలపు మాత్రం ఒకటే. 'మోహ' శబ్దానికి అజ్ఞానం, మూర్ఛ అనే అర్థాలు కూడా ఉన్నాయి. ఈ సందర్భంలో మాత్రం వలపే. అలాగే పంచేంద్రియాలూ పంచప్రాణాలూ ఉన్నా దేహం మాత్రం ఒకటే.

పంచ- ఇంద్రియాలు-లో చెవి, చర్మం, కన్ను, నాల్క, ముక్కు అనేవి జ్ఞానేంద్రియాలు. మాట, చేతులు, కాళ్లు, గుదము (మూడి), ఉపస్థ (స్త్రీ పురుషుల రహస్యావయవం) అనేవి కర్మ-ఇంద్రియాలు.

ఇక పంచప్రాణాలు:- ప్రాణం అంటే గాలి- వాయువు. మన దేహంలో ఐదు రకాల వాయువులు (ప్రాణాలు) ఉంటాయి. 1) ప్రాణం- ఇది హృదయంలో ఉంటుంది. 2) అపానం- ఇది గుదంలో ఉంటుంది. 3) సమానం- ఇది

నాభిమండలంలో ఉంటుంది. 4) ఉదానం- ఇది కంఠంలో ఉంటుంది. 5) వ్యానం- ఇది శరీరమంతటా వ్యాపించి ఉంటుంది. అలా పంజరం లాంటి శరీరంలో- పంచజ్ఞాన- కర్మ ఇంద్రియాలూ, పంచప్రాణాలూ వేర్వేరుగా ఉన్నా, శరీరం మాత్రం ఒకటే- అని మొదటి రుబాయిలో సమైక్య దృక్పథాన్ని వ్యక్తం చేశాడు దాశరథి.

ఇక రెండవ రుబాయీ. మతాలు విభిన్నంగా ఉన్నా, వాటిలో ఉండే సూత్రం సత్యం, శాంతి, ప్రేమ. ఏ మతమైనా వీటినే చాటుతుంది. అలాగే పాత్రలు వేరైనా చిత్రం (రూపకం-సినిమా) మాత్రం ఒకటే. అట్లే- తరువుకు (చెట్టుకు) కొమ్మలెన్నున్నా ఆ చెట్టు మూలం అంటే వేరు మాత్రం ఒకటే. ఈ విధంగా దాశరథి భిన్నత్వంలో ఏకత్వాన్ని అనేక ఉదాహరణాలతో చెప్పాడు.

దాశరథి తెలంగాణా కోటి రత్నాలతో తృప్తి పడక మూడు కోట్ల (ఆనాటి తెలుగుల సంఖ్య) హృదయవీణా సమైక్యగాన సంసిద్ధికోసం తపించి, విశాల కవితా విపంచిపై మహాంధ్రోదయ రాగాలను పలికించినాడు-

*"మూడుకోటుల నొక్కటే ముడిబిగించి*
*పాడినాను మహాంధ్ర సౌభాగ్యగీతి"*

అని చెప్పుకొన్నాడు. అంతేకాదు-

*"జండా ఒక్కటె మూడు వన్నెలది దేశం బొక్కటే భారతా*
*ఖండాసేతు హిమాచలోర్వర"*

అని భారతజాతి సమగ్రతనూ అఖండతనూ చాటిన మేటి జాతీయ కవి దాశరథి.

దాశరథి 'కవితాపుష్పకం' ఏకత్వం అనే పెట్రోలుతో ఎగురుతుంది. ఏకంగా ఉండి లోకాన్ని స్వర్గం చేద్దామన్న సమైక్యవాది దాశరథి.

*"నిర్భయంగా వచ్చాను, నిర్భయంగా వెళతాను*
*ఉచ్ఛ్వసిస్తూ వచ్చాను నిశ్వసిస్తూ వెళతాను*
*మృత్యువు నృత్యం చూపి జడిపిస్తా రెందుకని?*
*భయమెందుకు? నా ఇంటికి నే వెళతాను"*

('జ్వాలాలేఖిని'లో)

**వ్యాఖ్య:-** ఈ రుబాయిా మృత్యువుకు భయపడని, కాలాన్ని జయించిన దాశరథి వ్యక్తిత్వాన్ని ఎత్తి చూపుతున్నది. తన ఇంటికి తాను వెళ్లుతున్నట్లుగా మృత్యువు దగ్గరికి వెళ్లుతానన్నాడు దాశరథి. నిజానికి అందరి గమ్యం మృత్యువే అనే తత్త్వాన్ని ఈ రుబాయిాలో సహజసుందరంగా చెప్పాడు.

"ఓ నిజాము పిశాచమా కానరాడు
నిన్ను బోలినరాజు మాకెన్నడేని"

"ముసలి నక్కకు రాచరికంబు దక్కునే"

"మా నిజాం రాజు జన్మజన్మాల బూజు"

"దిగిపోవోయ్ తెగిపోవోయ్
తెగిపోవోయ్ దిగిపోవోయ్"

అని నిజాంకు వ్యతిరేకంగా గళమెత్తి ధిక్కరించిన కవి వీరసింహం దాశరథి. ఆయనకు భయపడడం చేతకాని పని. "భూమి బొంగరము మీద" "ధగధగమందు లోకబాంధవుని మీద"- తిరుగబడుతానని చెప్పుకొన్న దాశరథికి భయమెక్కడిది?"

"వీణియ తీగపై పదనుపెట్టిన నా కరవాలధారతో
గానము నాలపించెద స్వకంఠము నత్తరణం బొనర్చి స్వ
ర్గానకు భూమినుండి రసగంగలు చిమ్మెద"

అని ఘంటాఘోషంగా ఎలుగెత్తిన దాశరథికి భయమెక్కడిది? తానే ముక్తకంఠంతో ప్రకటించాడు- ఏమని?

"ప్రాణులను కోట్లుకోట్లుగా వాతగొనెడి
మృత్యువుకు భర్త నేను; బలిష్ఠమైన
నా నరాలలో మృత్యు కన్యకను పిండి
కోట్ల పిల్లల పెట్టించుకొందు నేడు"

"భయపడను వానగాలికి, వరద దెబ్బ
కాకలికి, అశ్రువులకు త్రేతాగ్నికేని

వెలుగు చీకట్ల మధ్య తప్పించుకొనుచు
భండన మొనర్చు దివ్య కోదండి నేను' - అని.

"మృత్యువు నృత్యం చూపి జడిపిస్తారెందుకని?
భయమెందుకు నా ఇంటికి నే వెళతాను"- అనే మాటలు.

"యతోవా ఇమాని భూతాని జాయంతే, యేన జాతాని జీవంతి
యత్ప్రయంత్యభిసంవిశంతి, తద్విజిజ్ఞాసస్వ, తద్బ్రహ్మేతి"

అనే ప్రమాణంచేత, లోకాలు పరబ్రహ్మయందే పుట్టి, పెరిగి, గిట్టుతాయి.

"ఎవ్వనిచే జనించు జగమెవ్వని లోపలనుండు లీనమై
యెవ్వనియందుడిందు పరమేశ్వరు డెవ్వడు"

అనే పోతన పద్యం స్ఫురిస్తుంది ఈ సందర్భంలో.

అందుకే అన్నాడు దాశరథి- "ఏ ఇంటి నుండి నిర్భయంగా బయలుదేరి వచ్చానో, నిర్భయంగా అక్కడికే వెళతాను. నా ఇంటికి నేను పోవడానికి భయం దేనికి?" అని అన్నాడు. జనన మరణ రహస్యాలు తెలిసిన వేదాంతి దాశరథి. అందుకే మృత్యువుకు భయపడలేదు. పైగా అదే తన ఇల్లు అన్నాడు. అలా ఎవరనగలరు? మహాకవి ఒక్క దాశరథి తప్ప.

ఈ రుబాయిలో మూడవ పాదంలో రెండు మాత్రలూ నాల్గవ పాదంలో ఐదు మాత్రలు తగ్గినాయి. మాత్రలు తగ్గినా మహార్థానికి లోటు కలుగలేదు.

## 16. దాశరథి గజళ్లు

"రమ్మంటే చాలుగానీ రాజ్యాలు విడిచి రానా
నీ చిన్ని నవ్వుకోసం స్వర్గాలు గడిచి రానా

ఏడేడు సాగరాలు ఎన్నెన్నొ పర్వతాలు
ఎంతెంతొ దూరమైనా బ్రతుకంత నడిచి రానా

కనులందు మంచులాగా కలలన్ని కరగిపోగా
కావేరివోలె పొంగే కన్నీరు తుడిచి రానా

నీ వున్న మేడ గదిలో నను చేరనీయరేమో
జలతారు చీరకట్టి సిగపూలు ముడిచి రానా

పగబూని కరకువారు బంధించి ఉంచినారు
ఏనాటికైనగానీ ఈ గోడ దూకి రానా"

('జ్వాలాలేఖిని'లోని 'సాఖీనామా'లో)

**వ్యాఖ్య:-** ఇది గజల్. 'గజల్' అనేది అరబ్బీ భాషా పదం. ఈ పదాన్ని ఫారశీ ఉర్దూ భాషలు స్వీకరించాయి. ఆ తరువాత అనేక భాషలు ఆ పదాన్ని అనువదించకుండ అలాగే వాడుకున్నాయి. 'గజల్' అంటే- ప్రియురాలితో ఏకాంతంలో జరిపే ప్రణయ సల్లాపం అని అర్థం. 'ఇంతులతో మంతనాలు'- అన్నాడు దాశరథి. గజల్ అనే కవితా ప్రక్రియ మొదట అరబ్బీ భాషలో ప్రభవించి, ఫారసీలోకి ప్రవేశించింది. అక్కడ నుండి 'తుర్కీ' ఉర్దూ భాషలలోకి వ్యాపించింది.

ప్రారంభదశలో అరబ్బీ భాషలో ప్రయుక్తమైనప్పుడు గజల్ ప్రక్రియలోని ప్రధాన వస్తువు శృంగారమే. కాలానుగుణంగా మానవ సమాజంలో వచ్చిన మార్పులవల్ల గజల్ వస్తువులో కూడా మార్పులు వచ్చాయి. ఫలితంగా గజల్లలో శృంగారానికి బదులుగా సాంఘిక సంస్కరణలు, స్వేచ్ఛాప్రియత్వం, అధిక్షేపం, హాస్యం, మతబోధ, ముఖస్తుతి, విద్వేషం- ఇలా ఎన్నో ప్రవేశించాయి. ఇంతటి వస్తువైవిధ్యంవల్ల గజల్ అంటే కవిత్వమే- కవిత్వమంటే గజలే అన్నంతగా ప్రశస్తి ఏర్పడింది. ఉర్దూ హిందీ ఈ శక్తిమంతమైన గజల్ ప్రక్రియ చేత సుసంపన్నమైనాయి. దాశరథి ఆంగ్ల, ఉర్దూ భాషావేత్త. అందులోనూ మహాకవి. కాబట్టి ఆయన ఉర్దూ ఫారశీ, హిందీ భాషల ఇంగ్లీషు భాషల నుండి అనేక రచనలను ఆంధ్రీకరించాడు. ఈ గజల్ ప్రక్రియను దాశరథి 1966లో మొట్ట మొదటిసారిగా ప్రవేశపెట్టారు. అందువల్ల ఆయన తెలుగు గజల్ ప్రయోక్తగా ప్రసిద్ధులు. ఆయన మొత్తం పదకొండు గజల్లను వ్రాశారు.

గజల్ మాత్రాగణబద్ధమైన గేయ కవితా ప్రక్రియ. గేయచ్ఛందస్సులోని ఏ గతిలోనైనా గజల్‌ను రచించవచ్చు. గజల్‌లోని పాదాలన్నింటిలో మాత్రా సంఖ్యా సమత్వం ఉండాలి. గజల్ పాట కాబట్టి గజల్‌లోని మొదటి రెండు పాదాలను 'పల్లవి'గా భావించవచ్చు. చెప్పదలచుకున్న భావం ఈ రెండు పాదాలలో ముగిసి తీరాలి. రెండు పాదాల కవితను 'షేర్' అంటారు. 'షేర్'ను పాటలోని 'చరణం'గా భావించవచ్చు. అంటే– ప్రతిషేర్ రెండు సమభాగాలుగా విరుగుతుందని అర్థం. గజల్‌లోని మొదటి షేర్‌ను 'మత్లా' అంటారు. చిట్టచివరి షేర్‌ను 'మఖ్తా' అంటారు. ఈ 'మఖ్తా'లో కవి తన కలంపేరును ('తఖల్లుస్'ను) తెలుపుకుంటాడు. గజల్‌లో 5 మొదలుకొని ఎన్ని షేర్లైనా ఉండవచ్చు. సాధారణంగా పదిహేను షేర్లకు మించవు. గజల్ మొదటి షేర్ అయిన 'మత్లా'లో రెండు పాదాలకూ చివర ఖాఫియా, రదీఫ్ అనే అంత్యప్రాసలుంటాయి. మిగతా షేర్లలో, రెండవ పాదానికి మాత్రమే, ఈ అంత్యప్రాస నియమం ఉంటుంది. 'ఖాఫియా' అంటే ప్రతిషేర్‌లోని చివరి పదం కంటె ముందున్న ప్రాస పదం. షేర్‌లోని చిట్టచివరి పదాన్ని 'రదీఫ్' అంటారు. కొందరు కవులు 'రదీఫ్' లేకుండ ఖాఫియా నియమంతోనే షేర్లను పూర్తి చేస్తారు. గజల్‌లో ఏ షేర్ భావం ఆ షేర్‌కే. అందుకే గజల్‌లో ఒకే విషయం చెప్పాలనే నియమం లేదు. గజల్ కవితలోని ప్రధాన నియమం క్లుప్తత. అందుకే గజల్ వ్రాయడమంటే రవ్వను చెక్కడం లాంటిదని అన్నాడు దాశరథి. ఆయన గజల్‌కు మంజరి, వల్లరి అనే పేర్లు పెట్టారు. దాశరథి తఖల్లుస్ (కలంపేరు) 'శరథి'.

"రమ్మంటే చాలుగానీ రాజ్యాలు విడిచి రానా" అనేది దాశరథి రచించిన మొదటి గజల్. ఇందులో మొదటి రెండు పాదాలను, పల్లవిగా భావిస్తే మిగిలినవి నాలుగు చరణాలు.

ఖండగతిలో నడిచిన ఈ గజల్ ప్రణయ భావాత్మకమైనది. విప్రలంభ శృంగారం ఇందులో పోషింపబడింది. కారాగారంలో బంధింపబడిన ఒక ప్రియుడు, ప్రేయసి కోసం పడే తపన, విరహబాధ ఈ గజల్‌కు ప్రాణం. ప్రియురాలు రమ్మంటె చాలు ప్రియుడు రాజ్యాలు విడిచి వస్తాడట! ఆమె నవ్వుకోసం 'స్వర్గాలు దాటి' వస్తాడట! అంతేకాదు ఆమెకోసం ప్రియుడు, సాగరాలు పర్వతాలు దాటడమే కాక 'బ్రతుకంతా'

నడిచివస్తాడట. ఎంత ప్రగాఢప్రణయం. ఆ ప్రియురాలి మేడలోని గదిలోకి ప్రియుణ్ని రానివ్వరు. అపుడు తాను "జలతారు చీరకట్టి సిగపూలు ముడిచి" ఆడువేషంలో వచ్చి కలుస్తానన్నాడు. శత్రువులు ఆ ప్రియుణ్ని జైల్లో బంధించారు. అయినా ఈ జైలు గోడ పొడిచి రానా" అని ప్రియురాలిని తలచుకుని తపిస్తూ అన్నమాటలు సహృదయ పాఠకులను రసార్ద్రులను చేస్తున్నాయి.

"పగబూని కరకువారు... గోడపొడిచి రానా". అనే చరణం బానిస అయిన వ్యక్తి యొక్క వియోగ శృంగారాన్ని సూచిస్తూనే, మరోవైపు వ్యక్తి స్వేచ్ఛా ప్రియత్వాన్ని వ్యక్తం చేస్తున్నది. ఇలా ఈ పదిపంక్తుల గజల్‌లో దాశరథి ప్రియుని విరహాలాపనను ప్రియురాలిపట్ల ప్రియునికున్న సాంద్రానురాగాన్నీ రసరమ్యంగా చిత్రించారు.

ఈ గజల్‌లోని పంక్తులలో 'రానా' అనే పదం 'రదీఫ్' (అంత్యప్రాస). ఈ అంత్యప్రాసకు ముందున్న- 'విడిచి, గడిచి, నడిచి, తుడిచి, ముడిచి, పొడిచి- అనే పదాలు 'ఖాఫియాలు'. దాశరథి తన కొన్ని గజళ్లల్లో తన కలంపేరు (తఖల్లుస్)ను ప్రయోగించలేదు. వాటిలో ఈ గజల్ ఒకటి.

దాశరథి రచించిన తెలుగు గజళ్లు కొన్నింటిని, సముచితమైన 'ట్యూన్లు' సమకూర్చుకొని, ప్రసిద్ధ సినీ నేపథ్య గాయకులు డా॥ పి.బి.శ్రీనివాస్‌గారు రేడియో కార్యక్రమాలలోను, గాన కచేరీలలోను పలుమార్లు పాడారు. వాటిలో ముఖ్యమైన గజల్- ఈ 'రమ్మంటే చాలుగానీ' అనేది. దీనిని వారు 'రాజేశ్వరి' రాగంలో ఆలపించారు. వారికి ఈ గజల్ 'అత్యంత ప్రియతమమైనది' అని వారే వ్రాశారు ఒక చోట. 'మంచి మనిషి' అనే తమ ముందుమాటలులో ('దాశరథి సినీమా పాటలు'- పుట-xii లో సంకలన కర్త శ్రీ కె. ప్రభాకర్‌గారు- ప్రచురణ 2010).

"ఇన్ని నాళ్లకు తెలుపమంటివి
ఎందు కొరకే నా పతా

నిన్ను బోలిన కఠినులకు నే
నెన్నడైనా లా పతా

అడిగినప్పుడు చెప్పకుండుట
ఎడదగల నా కొప్పదు

ఏ సమయమున నేనెక్కడుందునొ
వ్రాసుకోవే నా పతా

వేగుచుక్కను నిద్రలేపీ
విద్య నేర్పే కోర్కెతో

వీణ తీగను మీటబోయే
చెలి నఖాగ్రము నా పతా

తెల్లవారే వేళ కమలము
కళ్లు విప్పేటప్పుడు

బాలభానుడు తొంగి చూచే
ప్రాగ్దిశాగ్రము నా పతా

విరహ జలనిధి దాటిపోగా
ప్రియుడు కౌగిట జేర్చగా

పరవశమ్మున పైట జార్చిన
సఖి భుజాగ్రము నా పతా

శిశిర రాక్షసి గుండెలందున
చిగురు జొంపము లూగగా

పాట పాడే పరభృతము గల
నవ కుజాగ్రము నా పతా

కరకు రాళ్లే కరగునట్లుగ
కవిత వ్రాసే వేళలో

కాంతి విరిసీ శాంతి కురిసే
కవి కరాగ్రము నా పతా

లోకకంటకుడైన దైత్యుని
పీక ముక్కలు సేయగా

ముక్కు సూటిగ ఎక్కు పెట్టిన
హరి శిఖాగ్రము నా పతా

పానశాలావరణమందున
ప్రాణ దానము సేయగా

మధువు నొసగే సాఖి లోచన
రోచిరగ్రము నా పతా

విప్లవము వర్ధిల్లు వేళల
వీర వర్యుని కనులలో

ధగధగాయిత నవ దవానల
కీలికాగ్రము నా పతా

మంచుకొండల పొంచి చూచే
వంచకుల నెదిరించెడి

భరతసేనా పౌరుషాంచిత
కేతనాగ్రము నా పతా

నేను చేయని నేరమునకై
నిప్పులను విరజిమ్ముతూ

కోప భరమున తాపుతాచే
సతి పదాగ్రము నా పతా

**వ్యాఖ్య:-** దాశరథి గజళ్లలో చాల పెద్దది ఇది. ఇందులో పన్నెండు చరణాలు (షేర్లు) ఉన్నాయి. ఒక్కొక్క చరణంలో ఒక్కొక్క భావం మనోజ్ఞంగా దృశ్య ప్రదర్శకంగా భాసిస్తున్నది. ఈ గజల్ దాశరథి కవిత్వ వ్యక్తిత్వాలకు మణిదర్పణం. ఆ మహాకవి తన 'పతా' (చిరునామా- విలాసము)ను వివరిస్తున్నాడు కవితాత్మకంగా. తనను చాలా రోజులుగా చూస్తున్న ఒక కఠినాత్మురాలు దాశరథిని పతా (అడ్రసు) చెప్పుమని అడిగింది. ఆమెకు తెలిపిన తన చిరునామాయే ఈ గజల్. నిజానికి ఆమెకు తన పతాను తెల్పడం ఇష్టం లేదు. కాని దాశరథి హృదయవాది- 'ఎడదగల'వాడు. అడిగినప్పుడు చెప్పకుండడం తన మనస్సుకు పడదు. ఒక్కొక్క సమయంలో ఒక్కొక్క చోట ఉంటానంటూ ఆయా ప్రదేశాల పతాలను వ్రాసుకొమ్మన్నాడు. ఆమె వ్రాసుకొన్నదో లేదో కాని మనకు మాత్రం ఆ మహాకవి పది చిరునామాలు తెలిసిపోయాయి. ఆ పది 'పతా'లు చూస్తే మహాకవులు దశ దిశలా అంటే అంతటా వ్యాపించి ఉంటారనే ఒక భావ రేఖ తళుక్కు మంటుంది సహృదయ మనోమండలంలో. ఒక్కొక్క చరణం ఒక్కొక్క దృశ్యాన్ని మన కన్నులముందు నిలుపుతుంది.

"వేగుచుక్కను... నా పతా".

ఈ మొదటి చరణం దాశరథి వైతాళికత్వాన్ని చాటుతున్నది. నఖ+అగ్రము= గోటియంచు; వేగుచుక్కను నిద్రలేపి దానికి పాఠం చెప్పడానికి వీణ తీగను మీట బోయే చెలి (సఖి) గోటియంచులో ఉంటుందట తన పతా. ఇది వేకువ జామున ఈ కవి ఉండే చిరునామా.

'వేగుచుక్క' అంటే శుక్రనక్షత్రం- వేకువజాములో పొడిచే చుక్క- వేగుచుక్క అంటే సూర్యోదయానికి ముందుండే కాలం. వేగుచుక్క మార్గదర్శకత్వానికి సంకేతం. వేగుచుక్కను నిద్రలేపడం అంటే మార్గదర్శకులనే మేల్కొల్పడం. చెలివీణ మీటడం

అనే మాటలవల్ల శృంగార స్పర్శ చోటు చేసికొన్నది. 'నఖాగ్రము'లోని 'అగ్ర' శబ్దం దాశరథి నిశితబుద్ధికి సూచకం.

"తెల్లవారే వేళ... ప్రాగ్దిశాగ్రము నా పతా".

అనే 'షేర్' మరో దృశ్యం. ఇది సూర్యోదయ కాలంలోని కవి చిరునామాను తెలుపుతుంది. 'బాలభానుడు' అంటే ఉదయసూర్యుడు. ప్రాక్+దిశా+అగ్రము= తూర్పుదిక్కు యొక్క అంచు. కమలం కళ్లు విప్పడం, బాలభానుడు తొంగి చూడడం- అనడంవల్ల పద్మానికీ ప్రభాకరునికీ గల ప్రణయ బంధం ప్రకాశిస్తున్నది. ఈ పంక్తులు వికాసశీలమైన దాశరథి చైతన్యధారలను ప్రకటిస్తున్నది. సూర్యోదయవేళ తన చిరునామా "తూర్పు దిక్కు యొక్క అంచు" అట.

"విరహజలనిధి... నా పతా".

ఈ చరణం మరొక శృంగార రసాత్మక దృశ్యం. విరహసముద్రాన్ని దాటివచ్చిన ప్రియుడు తన సఖిని కౌగిలించుకొన్నప్పుడు పారవశ్యంలో జారినపైటగల చెలి యొక్క భుజం అంచుపైన కవి పతా ఉందట. విరహజలనిధి (విరహసముద్రం) అనే రూపకం విరహాతిశయాన్ని వ్యక్తం చేస్తున్నది. దృశ్యప్రత్యక్షీకరణశక్తి మహాకవిత్వ లక్షణాలలో ఒకటి.

"శిశిర రాక్షసి... నా పతా".

శిశిర రాక్షసి- శిశిర ఋతువు అనే రక్కసి; జొంపము- అంటే ఆకులూ కొమ్మలూ మొదలైనవాటి గుంపు, గుబురు. 'పరభృతము' అంటే కోకిల- పరులచేత (కాకులచేత) పెంచబడేది, కుజం అంటే చెట్టు- భూమి నుండి మొలిచేది అని అర్థం. నవకుజాగ్రము- అనగా వసంతంలో అప్పుడే కొత్తగా చిగిరించిన చెట్టుయొక్క చివరలో 'పతా' ఉంటుంది. ఇది వసంతంలో కవి చిరునామా. పాటపాడే కోకిల ఉన్న చెట్టు అనడంలో మామిడి చెట్టు స్ఫురిస్తుంది. కోకిలపాడే మామిడి చెట్టు అంచులో కవి 'పతా' ఉన్నదట. చిగురు జొంపాలు, కోకిల, మామిడి చెట్టు- ఇవన్నీ వసంత ఋతువును తెలుపుతున్నాయి. కోకిల కవికి ప్రతీక. వసంత ఋతువులో మన్మథుడు వసిస్తాడు' పూలు పూచే కాలం. ప్రజలు సుఖంగా ఉంటారు. శుభకార్యాలు

చేస్తారు. అలా ఈ చరణం కవుల వికాసాన్ని, ప్రజానంద కల్యాణాలను వ్యక్తం చేస్తూ, దాశరథి ప్రజాసంక్షేమ దృక్పథానికి దర్పణం పట్టుతున్నది.

"కరకురాళ్లే... నా పతా".

కాంతినీ శాంతినీ ఆకాంక్షిస్తూ కవిత్వం వ్రాసే కవి యొక్క చేతి అంచులో నా పతా ఉందన్నాడు దాశరథి. శాంతి ప్రియత్వం దాశరథి కవితా లక్ష్యాలలో ప్రధానమైనది. దాశరథి విశ్వశాంతి కాముకుడు. "నేను కవితలో చెప్పదలచుకున్నది ప్రపంచంలో శాంతి స్థాపించడం"– "నా వాదం మానవతా వాదం, నా ధ్యేయం ప్రపంచశాంతి" అని దాశరథే చెప్పిన మాటలు గమనింపదగినవి ఈ సందర్భంలో.

"లోక కంటకుడైన... నా పతా".

దైత్యుడు అంటే రాక్షసుడు. దితి కొడుకులు దైత్యులు– రాక్షసులు. 'హరి' అంటే విష్ణువు. ఈ సందర్భంలో శ్రీరాముడు, 'శిఖా' అంటే అగ్నిజ్వాల అనీ, వాడి అయిన అంచు అనీ అర్థాలు. వాడి అయిన అంచు కలది బాణం– అనీ సమన్వయించుకోవాలి. శిఖ కలది శిఖి– బాణం. సందర్భోచితంగా 'హరి శిఖాగ్రము' అంటే శ్రీరామచంద్రుని ఆగ్నేయ బాణాగ్రం అన్నమాట.

లోక కంటకుడైన దైత్యుడు రావణుడే. ఆ రావణుని పాలిటి ఆనాటి దాశరథి– ఈనాటి కవి దాశరథే అన్నమాట. 'హరిశిఖాగ్రము అనే సమాసం పాండితీమండితం. ఈ చరణం దాశరథి ధర్మదృక్పథాన్ని ధ్వనింపజేస్తున్నది.

"దానవులనంతమొందింప నేను కూడ
రామకృష్ణావతార ధారణమొనర్తు"

అన్న దాశరథి మహాకవి మాటలను ఈ గజల్ చరణం స్మృతికి తెస్తున్నది.

"పానశాలావరణమందున... నా పతా".

పానశాల+ఆవరణము– పానీయం లభించే ఇల్లు. ఒక రకంగా ఈనాటి బార్, రెస్టారెంట్‌ల వంటిది. మధువు అంటే పూదేనె, మద్యం. 'సాఖి' అంటే మధువును అందించే మహిళ. లోచన రోచిః+అగ్రము– అంటే కంటిచూపు అంచు (రోచిస్సు= సూర్యకిరణం, వెలుగు అనే అర్థాలున్నాయి).

మద్యపానం చేసేవాళ్లకు 'మధువు' అంటే ప్రాణం. ఆ ప్రాణాన్ని దానం చేసే మహిళ 'సాఖి'. మధువు నందిస్తున్నప్పుడు ఆ 'సాఖి' కడకంటి చూపులో కవి దాశరథి పతా ఉంటుందట! ఈ భావం శృంగారోద్దీపకం. ఈ చరణం దాశరథి శృంగార రసికతను చాటుతున్నది. 'సాఖిలోచన రోచిరగ్రము' అనే సమాసం దాశరథికిగల శబ్ద శక్తిని మెరిపిస్తున్నది. ఉర్దూ ఫారసీ సంప్రదాయజ్ఞుడైన దాశరథి ఫారసీ కవిత్వ సంప్రదాయాలను తెలుగులో ప్రవేశపెట్టాడు. వాటిలో– పానశాల, సాఖి, మధుపాత్ర వంటివాటిని చిత్రించడం ఒకటి.

"విప్లవము వర్ధిల్లు వేళల... నా పతా".

'ధగధగాయిత' అంటే మిక్కిలి ప్రకాశిస్తున్న, నవదవ+అనలకీలక+అగ్రము= అంటే అప్పుడే అంటుకొన్న కార్చిచ్చు మంటకొస.

విప్లవం లేవదీసే వీరుల కళ్లల్లో ధగధగ మెరిసే కార్చిచ్చు మంటల కొసలో నా పతా ఉన్నదన్నాడు కవి దాశరథి. నిజాం నవాబు నిరంకుశ శాసనాన్ని ధిక్కరించిన తెలంగాణ స్వాతంత్ర్య విప్లవవీరుడు దాశరథి. ఆతని ఆ స్వాతంత్ర్య విప్లవ చైతన్యాన్ని ఈ చరణం వ్యక్తం చేస్తున్నది.

"మంచుకొండల... నా పతా".

భరతసేనా పౌరుష+అంచిత కేతన+అగ్రము= భారతదేశ సైన్యం యొక్క పరాక్రమం చేత పూజింపబడే జండా (పతాక) అంచు.

హిమాలయంలో దాక్కొని మోసగింప చూచే శత్రుసేనలను ఎదిరించే వీర భారత సైనికులెత్తి పట్టిన పతాకం అంచులో ఉన్నదట ఈ కవి పతా. మనదేశాన్ని సరిహద్దుల్లో రక్షించే సైనికులు ఈ పంక్తుల్లో భాసిస్తారు. తెలంగాణా నిగళాలను పడగొట్టిన స్వాతంత్ర్య సమరయోధుడు దాశరథి. తన 'జ్వాలా లేఖిని' అనే కావ్యాన్ని స్వాతంత్ర్య సమరయోధులకు అంకితం చేసిన దేశభక్తుడు. అందువల్ల దాశరథి దేశభక్తికి ఈ చరణం ఒక దర్పణం.

"నేను చేయని నేరమునకై... నా పతా".

కోపభరముగ– అంటే కోపాతిశయం చేత; తాపు– అంటే తన్ను, పాదతాడనం, తాచు= తన్ను, సతి పద+అగ్రము= భార్యయొక్క కాలి అంచు.

నిర్దోషి అయిన భర్తను, అన్యథా భావించి, కోపాధిక్యంచే తన్నే భార్యయొక్క కాలికొసలో 'నా పతా' ఉందన్నాడు కవి. నందితిమ్మన మహాకవి రచించిన 'పారిజాతాపహరణము' అనే ప్రబంధంలో చిత్రితమైనట్టి– సత్యభామ కోపంలో, తనకు మొక్కిన శ్రీకృష్ణుని తాపుతాచే, ప్రణయకోప దృశ్యాన్ని కట్టెదుట నిలుపుతున్నది ఈ చరణం.

మిశ్రగతిలో నడిచిన ఈ గజల్‌లో 'నా పతా' అనేది రదీఫ్ (అంత్యప్రాస) చెలిఖాగ్రము, ప్రాగ్దిశాగ్రము, సఖిభుజాగ్రము, కేతనాగ్రము, సతిపదాగ్రము వంటివి– 'ఖాఫియా'లు (అంత్యప్రాసకు ముందున్న అనుప్రాసలు).

ఇలా ఈ సుదీర్ఘమైన గజల్, దాశరథి భావనాబలాన్నీ గ్రథనకౌశలాన్నీ ప్రకటిస్తున్నది.

దాశరథి వ్రాసిన గజల్లు కొన్నే అయినా, ఛందోవైవిధ్యానికీ, కవితా శిల్ప సౌందర్యానికీ కొదవ లేదు.

## 17. దాశరథి లలిత గీతాలు

### "తలనిండ"

*పల్లవి:* తలనిండ పూదండ
దాలిచిన నా రాణి
మొలక నవ్వులతోడ మురిపించబోకే
మాటల్లో మాటల్లో మరిపించబోకే... ॥తలనిండ॥

*చరణం–1* పూలవానలు కురియు మొయిలువో! అందాల
మొగలి రేకులలోని సొగసువో! నా రాణి... ॥తలనిండ॥

చరణం–2 నీ మాట బాటలో నిండె మందారాలు
నీ పాట తోటలో నిలిచె శృంగారాలు... ॥తలనిండ॥

చరణం–3 నీ మేనిలో పచ్చ చేమంతి అందాలు
నీ నీలవేణిలో నిగిడె నాకాశాలు... ॥తలనిండ॥

చరణం–4 నను చూచి నవ్వి పున్నమ వెన్నెలను కాచి
నా కొరకు కన్నీరు కురిసి వర్షము తెచ్చి
నన్నేడిపించి పిన్నని నవ్వు నవ్వించి
ఆరు రుతువుల చేతియందుంచుకున్నావు... ॥తలనిండ॥

**వ్యాఖ్య:–** సంగీత సాహిత్య సరస సమ్మేళనం గీతం. గీతాన్ని, గీతిక, గేయం, పాట– అని కూడా అంటారు. గీతంలో పల్లవి, చరణాలు ఉంటాయి. లలితమైన గీతం– లలిత గీతం. 'లలితగీతం' ఒక ప్రత్యేక ప్రక్రియగా విస్తరిల్లింది తెలుగు సాహిత్యంలో. "పల్లవి చరణాల గేయత్వం, లాలిత్యంతో తాళ, లయ, సమన్వితమై పరమార్థ లక్ష్యము గలది లలిత గీతం" అని లలితగీతానికి నిర్వచనం చెప్పారు డా॥ వడ్డేపల్లి కృష్ణగారు తమ సిద్ధాంత గ్రంథంలో. గురజాడగారి "దేశమును ప్రేమించుమన్నా" అనే దేశభక్తిగీతం ప్రథమ లలిత గీతంగా సిద్ధాంతీకరించారు వారు.

దాశరథి మహాకవి లలితగీతాలు అనేకం వ్రాశారు. వారు 1943లో రెండు ప్రబోధగీతాలు వ్రాశారు. వారి లలితగీతాలు 'పూలపాటలు' (1952) 'నవమంజరి' (1959), తేనెపాటలు (1960) అనే సంపుటాలలో ప్రచురితమైనాయి. 1962-63లో దాశరథి 'వలపుపాటలు' శీర్షికతో 'యువ' మాస పత్రికలో ప్రణయ గీతాలను రచించారు. దాశరథి రచించిన లలిత గీతాలలో ప్రకృతి గీతాలు, ప్రణయ గీతాలు, అభ్యుదయ గీతాలు, దేశభక్తి గీతాలు, అనువాద గీతాలూ ఉన్నాయి.

దాశరథి లలిత గీతాలు కొన్ని ఆకాశాణి హైదరాబాదు కేంద్రంనుండి ప్రసారితమైనాయి. 1962లో ప్రసిద్ధ సంగీత విద్వాంసులు శ్రీ మంచాళ జగన్నాథరావు

గారు స్వీయ సంగీత దర్శకత్వంలో ప్రసిద్ధ కవుల పాటలను గ్రహించి రాగతాళ యుక్తంగా 'ఆధునిక సంగీతం' పేరుతో రెండు భాగాలుగా ప్రచురించారు. వాటిలో దాశరథి పాటలు కూడా కొన్ని ఉన్నాయి. వాటిలో "తలనిండ పూదండ" అనే పాట ఒకటి. దానిని గంధర్వగాయకులు శ్రీ ఘంటసాలగారు గానం చేశారు. ఈ పాట 'నా రాణి' అనే పేరుతో కూడా బాగా ప్రచారం పొందింది.

"కవి తన రాణిని పూలవానలు కురిసే మొయిలు (మేఘం)గా, అందాల మొగలిరేకులలోని సొగసుగా అభివర్ణించాడు. ఆమె మాట బాటలో మందారాలు నిండినవనీ ఆమె పాట తోటలో శృంగారాలు నిలిచాయనీ, ఆమె శరీరంలో చేమంతి అందాలు, ఆమె నీలవేణి (నల్లనిజడ)లో ఆకాశాలు ఒదిగాయనీ" కవితాత్మకంగా ప్రశంసించారు. ఆమెలో ఆరు ఋతువులను దర్శించాడు. "నను చూచి నవ్వి"- అన్నప్పుడు వసంతం, "పున్నమ వెన్నెలను కాచి"- అన్నప్పుడు శరదృతువు, "కన్నీరు కురిసి" అన్నప్పుడు వర్షర్తువు, "నన్నేడిపించి" అన్నప్పుడు, "హేమంత శిశిరాలు"- ధ్వనిస్తున్నాయి. ఈ పాట స్త్రీలోని గడుసుదనాన్నీ సొగసునూ నిండుదనాన్నీ వలపు తియ్యందనాన్నీ చిత్రించింది.

ఈ లలితగీతం బహుళ జనామోదాన్ని అందుకున్నది. పూలవానలు, మాటబాట, పాటతోట- అనేవి చక్కని రూపకాలు. 'పచ్చ చేమంతి' అనేమాట రాణి మేను పసుపుపచ్చ బంగారంలా ఉందని ధ్వనింపజేసింది.

*"ఒత్తవోయ్ కాహళం ఎత్తవోయీ హలం*
*దున్నవోయీ పొలం- శ్రమయే మన బలం"* అనే ప్రబోధగీతం,

*"ఏకతా సూత్రాన ఎల్లరేకము గాగ*
*కులమతమ్ముల బాధ కుంచించుకొని పోగ"* అనే సమైక్యగీతం

*"భూధరమో సాగరమో*
*భూతలమో ఆకసమో*
*భరత ధరణి నా గృహం*
*భరతజాతి నా అహం"* అనే దేశభక్తి ప్రపూర్ణమైన గీతం,

దాశరథి వ్యక్తిత్వాన్ని చాటుతాయి. దాశరథి విజయవాడ ఇంద్రకీలాద్రిపై వెలసిన కనకదుర్గాదేవి యొక్క తొమ్మిది అవతారాలను వర్ణిస్తూ పాటలు వ్రాశాడు. అవి ఆడియో క్యాసెట్ రూపంలో ఆవిష్కృతమైనాయి. దాశరథి మంగళహారతులు కూడా రచించాడు.

*"సిగలో చంద్రుని తురిమిన గౌరికి చంద్రహారతి*
*ఫాలనయనుడగు పరమశివునికి సూర్యహారతి"*

అంటూ ఆ ఆదిదంపతులకు సూర్యచంద్రహారతులను పట్టాడు. ఈ విధంగా దాశరథి లలిత గీతాలను కవితామయం చేసి సంగీతమాధురిని పంచిపెట్టాడు.

దాశరథి కవితావైభవం లలిత గీతాలలో కూడా ఉన్నదని చెప్పడానికి ఒక పాట మాత్రం ఉదాహరింపబడింది అంతే.

## 18. దాశరథి బాలసాహితి

### "జాతీయ జండా"

*"మూడు రంగులున్న జండ*
*మురిసిపోయె ఊరినిండ*
*జాతి గౌరవం నిలుపగ*
*జనులకున్న పెద్ద అండ*

*గాంధి తాత చేతులలో*
*కదలాడిన మేటి జండ*
*మంచుకొండ సిగమీద*
*మల్లాడే మనజండా*

ఈ జండా నీడలోనె
పోరాడిరి మన వీరులు
ఈ జండా నిలుపుటకే
చనిపోయిరి మన వారలు

భారతమాతృ పదమ్ముల
ప్రాణాలొడ్డిన వారికి
ఆత్మశాంతి కలుగుటకై
ఎత్తండీ ఈ జండా

మన ఐక్యతకిదే గుర్తు
మన శక్తికి ఇదే షర్తు
మనమంత కలసి మెలసి
మసలుటయే మంచిమాట

గాంధీజీ మార్గంలో
నడిపించే స్నేహితు డిది
నెహ్రూజీ చెప్పినట్లు
వినిపించే బాంధవు డిది

ఈ జండా చేతబూని
పూజింతాం దేశాన్ని
ఈ జండా నీడలోన
విడిచేతాం ద్వేషాన్ని

**వ్యాఖ్య:** – దాశరథి బాలసాహిత్యాన్ని కూడా సృజించాడు. ఆతడు బాలబాలికల కోసం 'దాశరథి బాలల గేయాలు' (1960) అనే పేరుతో 21 గేయాల సంపుటిని ప్రచురించాడు. చిన్నవయస్సులో పిల్లలు నేర్వవలసిన అనేక విషయాలను సరళాతి

సరళమైన భాషలో, చిందులు వేస్తూ- చిన్నారులు పాడుకొనేలాగా ఈ గీతాలను వ్రాశాడు దాశరథి. దాశరథికి పిల్లలంటే ఎంత ఇష్టమో ఈ గేయాలు నిరూపిస్తాయి. అందుకే దాశరథి 'బాల్యం' గురించి 'పునర్నవం' కావ్యంలో వ్రాసిన కవిత వన్నెకెక్కింది. దాశరథి రచించిన- "పిల్లల్లారా పాపల్లారా- రేపటి భారత పౌరుల్లారా" అనే జాతీయ బృందగీతాన్ని మద్రాసు రేడియో కేంద్రంవారి కోరికపై బాలలకోసం వ్రాశాడు దాశరథి. ఈ గీతానికి ప్రముఖ గాయకులు శ్రీ పి.బి.శ్రీనివాస్‌గారు బాణీని సమకూర్చారు. దాశరథి చలనచిత్రాలలో కూడా బాలల గీతాలను వ్రాశాడు. బాలబాలికల కోసం సరసవచనంలో శ్రీ సి.నారాయణరెడ్డిగారితో కలిసి రామాయణ, భారత భాగవతాలను రచించాడు దాశరథి.

దాశరథి 'బాలసాహితి'కి ఉదాహరణగా ఈ గీతం ఈ సందర్భంలో పేర్కొనడం జరిగింది.

"ఈ 'జాతీయ జండా' అనే గేయం భారత పతాకం గొప్పతనాన్ని చెప్పుతుంది. ఈ జండాకు మూడు రంగులున్నాయనీ, భారతజాతి గౌరవానికి ప్రతీక అనీ, ప్రతినిధి అనీ, గాంధీతాత చేతుల్లోనూ హిమగిరి శిఖరం మీదనూ, ప్రతి ఊరినిండ ఈ జండ కదలాడిందనీ రెపరెపలాడుతుందనీ, ఎందరో వీరులు తమ ప్రాణాలను అర్పించి ఈ జండాను నిలిపారనీ, అలాంటి వీరుల ఆత్మశాంతి కోసం ఈ జండాను ఎత్తాలనీ, భారతీయ సమైక్యాన్నీ, శక్తినీ ఈ జండా చాటుతుందనీ, గాంధీ నెహ్రూలు చూపిన మార్గంలో చెప్పిన రీతిగా ఇది మనందరినీ నడిపిస్తుందనీ, ఈ జండాను పూజిస్తే, మన దేశాన్ని పూజించినట్లనీ, పరస్పర ద్వేషాన్ని త్యజిస్తే, జండా లక్ష్యం నెరవేరుతుందనీ"- ఈ గేయం ద్వారా చాటుతూ పిల్లలు ఈ గేయాన్ని పాడుతున్నట్లుగా వ్రాశాడు దాశరథి.

చిన్న చిన్న మాటలలో మిన్నులంటే భావాలను ప్రకటించడం మహాకవులకే చెల్లుతుంది. "జండ, ఊరినిండ, పెద్ద అండ", "మన వీరులు, మనవారలు, గుర్తు-షర్తు, దేశాన్ని- ద్వేషాన్ని" వంటి అంత్యప్రాసలతో అందంగా అందరూ స్పందించేలాగా దాశరథి ఈ గేయాన్ని రచించాడు.

## 19. దాశరథి సినిమా పాటలు

పల్లవి:

ఆమె: నాకంటి పాపలో నిలిచిపోరా
నీ వెంట లోకాలు గెలువనీరా

చరణం-1

ఆమె: ఈనాటి పున్నమి ఏనాటి పున్నెమో
జాబిలి విరిసేను మనకోసమే...

అతడు: నెయ్యాలలో తలపు టుయ్యాలలో
అందుకుందాము అందని ఆకాశమె...

చరణం-2

అతడు: ఆ చందమామలో ఆనంద సీమలో
వెన్నెలస్నానాలు చేయుదమా.. ॥ఆ చందమామలో॥

ఆమె: మేఘాలలో వలపు రాగాలలో
దూర దూరాల స్వర్గాల చేరుదమా... ॥మేఘాలలో॥

చరణం-3

ఆమె: ఈ పూలదారులూ ఆ నీలి తారలు
తీయని స్వప్నాల తేలించగా... ॥ఈ పూల॥

అతడు: అందాలను తీపి బంధాలను
అల్లుకుందాము డెందాలు పాలించగా... ॥అందాలను॥

**వ్యాఖ్య:-** ఆచార్య ఆత్రేయ 1960లో తన దర్శకత్వంలో 'వాగ్దానం' అనే చిత్రం నిర్మిస్తూ దాశరథిగారిని హైదరాబాదు నుండి మద్రాసుకు ఆహ్వానించి ఆయనచేత ఈ పాట వ్రాయించారు. ఇది దాశరథి వ్రాసిన మొదటి సినీమా పాట. శ్రీ శరత్‌చంద్ర

చటర్జీగారి సుప్రసిద్ధ బెంగాలీ నవల 'వాగ్దత్త' చిత్రంలోని "ఆధాహై చంద్రమా రాత్ ఆధీ" అనే పాట బాణీలో వ్రాసిన పాట ఇది. ఈ పాటకు శ్రీ పెండ్యాల నాగేశ్వరరావుగారు సంగీతం సమకూర్చారు. మధుర గాయనీ గాయకులు సుశీల, ఘంటసాలగారలు ఈ పాటను పాడారు.

ఖండగతిలో సాగిన గీతమిది. పాటలో సంగీతానికి అగ్రతాంబూలం. సంగీతానికి శ్రవణపేయమైన పదప్రయోగం వాంఛనీయం. గేయరచనలో చేయి తిరిగిన దాశరథిగారికి ఈ విషయం తెలుసు. అందుకే ఈ పాటలో, మిన్నైన అర్థాన్ని పొదుగుకొన్న చిన్న చిన్న చెవికి ఇంపైన మృదుశబ్దాలను వాడి శృంగార రసోచితంగా తీర్చిదిద్దారు ఈ యుగళగీతాన్ని. "ఈనాటి పున్నమి ఏనాటి పున్నెమో", "ఆ చందమామలో ఆనందసీమలో", "మేఘాలలో వలపు రాగాలలో", "ఈ పూలదారులు ఆ నీలితారలు", "అందాలను తీపిబంధాలను"- అనే చరణాలు సంగీత సౌందర్య మాధుర్యాలకు ఉదాహరణాలు. పాటలోని భావాలు మనలను దూర దూర స్వర్గాలకు తీసికొనిపోతాయి. చందమామలో వెన్నెల స్నానాలు చేయించి ఆనందింపజేస్తాయి, తీయని స్వప్నాలలో తేలిస్తాయి. ఇలా ఈ గీతంలోని భావాలు రూపకాలంకార గర్భితాలై హృదయంగమంగా ఉన్నాయి. అంత్యానుప్రాసల, వృత్త్యనుప్రాసల ప్రయోగంతో శబ్దాలంకార శోభితమై పాట శృంగార రస పరిమళాలను పంచింది. సంగీత సాహిత్య సరస సంగమం ఈ పాట. ఈ పాట సినీమారంగంలో దాశరథికి పూలబాట వేసింది. ఆతని ప్రత్యేకతను గుబాళింపజేసింది.

*పల్లవి:*

*ఖుషీ ఖుషీగా నవ్వుతూ- చలాకి మాటలు రువ్వుతూ*
*హుషారుగొలిపే వెందుకే నిషా కనుల దానా...*

*చరణం-1* *ఓ... ఓ... ఓ... ఓ...*

*ఆమె:* *మేనాలోన ప్రియునిచేర వెళ్లింది నా చెలి మీనా*
*నింగిదాటి ఆనందసాగరం పొంగిపొరలె నాలోనా... ॥ఖుషీ॥*

అతడు: ఓహో చెలియా నీవుకూడ ఓ పెళ్ళిపల్లకి చూసుకో
హోయి గొలుపు సన్నాయి పాటలో వలపుబాటలే వేసుకో...

ఆమె: నే వెళితే మరి నీవు మజ్నూ వవుతావు

అతడు: మజ్నూ నేనైతే ఓ లైలా లోకమే చీకటై పోవునే...

ఆమె: ఖుషీ ఖుషీగా...
హుషారుగా వుందాములే నిషా కనుల వాడా!

చరణం–2 ఓ... ఓ... ఓ... ఓ...

అతడు: ఆకాశంలో ఇంద్రధనువుపై ఆడుకుందమా నేడె

ఆమె: నీలి నీలి మేఘాల రథముపై తేలిపోదమీనాడె

ఆతడు: చంద్రుడు నేనై నీవు వెన్నెలై కలిసిపోదమా హాయిగ

ఆమె: నేను వీణనై నీవు నాదమై ఏకమౌదమా తీయగ

ఇద్దరు: ఖుషీ ఖుషీగా నవ్వుతూ చలాకి మాటలు రువ్వుతూ
హుషారుగా ఉందాములే హమేషా మజాగా...

**వ్యాఖ్య:–** ఈ శృంగార యుగళగీతిక 1961లో వచ్చిన 'ఇద్దరు మిత్రులు' అనే చిత్రంలోనిది. ఈ గీతానికి స్వరకల్పనం చేసినవారు సుప్రసిద్ధ సంగీత దర్శకులు శ్రీ ఎస్.రాజేశ్వరరావుగారు. గానం చేసినవారు శ్రీఘంటసాల, శ్రీమతి సుశీలగారలు.

ఈ పాట వినగానే 'పల్లవి'లో ఉర్దూ పదాల పరిమళం గుప్పుమంటుంది. ఖుషీ, చలాకి, హుషారు, నిషా అనే పదాలు పల్లవిలోనివి. హమేషా, మజా అనేవి చివరి పంక్తులలోనివి. దాశరథి ఫారశీ ఉర్దూ భాషావేత్త. ఆయన పాఠశాల విద్యాభ్యాస మంతా ఉర్దూలోనే జరిగింది. గాలిబ్ గీతాలను ఆయన సరసంగా అనువదించాడు. ఇంకా మరెందరో ఉర్దూ కవుల కవితలను తెనిగించారు. ఈ పాట దాశరథి ఉర్దూ పద ప్రయోగ నైపుణిని చాటుతూ, ఆయన చలనచిత్ర గీతికా రచనా ప్రత్యేకతను

భద్రంగా అందిస్తున్నది. ఈ గీతం చిత్రగీతాలలో మంచిపేరును సంపాదించి పెట్టింది దాశరథికి.

పాట మొదట చరణంలోని పంక్తులన్నీ ఒక అంతస్సూత్రంతో కలసి ఉన్నాయి. "ప్రియుణ్ని చేరడానికి నా చెలి మీనా మేనాలో వెళ్లితే నాలో ఆనందం పొంగింది"- అని నాయిక అంటే, నాయకుడు- "నీవు కూడా మీనాలాగా ఓ పెళ్లిపల్లకి చూచుకొని హాయిగా వలచిన ప్రియుని దగ్గరికి పొమ్మ"ంటాడు. అపుడు నాయిక- "నేను వెళ్లిపోతే నీవు మజ్నూవు అవుతావు (నీ ప్రియురాలుండదు)" అంటుంది. వెంటనే నాయకుడు "అలా అయితే- అంటే లైలావయితే (నీవు లేకుంటే), నాకు లోకమంతా చీకటే" అంటాడు. ఇలా ఒక చారిత్రక ప్రియాప్రియులైన 'లైలా మజ్నూ'ల ఉదంతం రసహృదయులను అలరిస్తుంది.

ఇక- రెండవ చరణం- నాయికా నాయకుల కల్పనా లోక విహారాన్ని చూపుతుంది. ఇంద్రధనువుపై ఆడడం, నీల మేఘాల రథాలపై తేలిపోవడం, నాయకుడు చంద్రుడైతే నాయిక- వెన్నెల, నాయిక వీణ అయితే ఆతడు నాదం- ఇలా విడదీయరాని వారి ప్రేమానుబంధాన్ని చాటుతాయి ఈ పాటలోని చివరి పాదాలు.

ఆనందసాగరం, మేఘాల రథం, చంద్రుడునేనై, నీవు వెన్నెలై, నేను వీణనై, నీవు నాదమై- అన్న మాటలలో రూపకాలంకారాలు శోభిస్తున్నాయి.

ఖుషీ ఖుషీగా, హుషారు గొలిపే, నిషాకనుల దానా, నవ్వుతూ రువ్వుతూ, మేనాలోనా, నా చెలిమీనా, నింగిదాటి, పొంగిపొరలి, హాయి- సన్నాయి, లోకమే చీకటై- కలిసిపోదమా- ఏకమౌదమా, హాయిగా తీయగా- అనే పదాల కలయికలో ఆద్యంతప్రాసలు, వృత్త్యనుప్రాసలు భాసిస్తున్నాయి. శబ్దాలంకారాలు సహృదయుల శ్రవణాలను ఆకర్షిస్తాయి. అర్థాలంకారాలు అంతరంగాలను అలరిస్తాయి.

చతురస్రగతిలో శృంగార రసతరంగాలవలె సాగిన ఈ పాట సంగీత సాహిత్యాలలోని మాధుర్య సౌందర్యాలను గాంభీర్య ఔన్నత్యాలను వ్యక్తం చేస్తున్నది.

ఇంకా దాశరథి, మురళీకృష్ణ, నవరాత్రి, పెద్దన్నయ్య వంటి చిత్రాలలో ఉర్దూ పదాలను ప్రయోగించాడు.

పల్లవి:

అతడు: దివినుండి భువికి దిగివచ్చె దిగివచ్చె
పారిజాతమే నీవై నీవై

ఆమె: గుడిలోని ప్రతిమ వచ్చింది వచ్చింది
కోటి ప్రభలతో నీవై నీవై

అతడు: దివినుండి భువికి దిగివచ్చె దిగివచ్చె
పారిజాతమే నీవై నీవై...

చరణం-1

అతడు: అందని జాబిలి అందాలు పొందాలి
అనుకున్నా నొకనాడు ఆనాడు
అందిన జాబిలి పొందులో అందాలు
పొందాను ఈనాడు ఈనాడు
పొందాను ఈనాడు ఈనాడు... ॥దివి॥

చరణం-2

ఆమె: కనరాని దేవుడే కనులా చూడాలని
కలగంటి నొకనాడు ఆనాడు
కలనిజము చేసి కౌగిలిలో చేర్చి
కరిగించె ఈనాడు ఈనాడు
కరిగించె ఈనాడు ఈనాడు... ॥దివి॥

చరణం-3

అతడు: కడలిలో పుట్టావు- అలలపై తేలావు
నురగవై వచ్చావు ఎందుకో

ఆమె: కడలి అంచువు నిన్ను కలసి నీ ఒడిలో
మురిసీ మెరవాలని ఆశతో... ॥దివి॥

**వ్యాఖ్య:-** ఈ మధురాతి మధుర శృంగార యుగళగీతం 1965లో వచ్చిన 'తేనె మనసులు' చిత్రంలోనిది. శ్రీ కె.వి. మహాదేవన్‌గారు సంగీతం సమకూర్చారు. ఘంటసాల సుశీలగారలు గానం చేశారు.

ఖండగతిలో రచితమైన ఈ గీతం అఖండమైన ఆనందాన్ని అందిస్తున్నది. సాహిత్యం రసమయం, స్వరకల్పనం రమణీయం, గానం రాగసుధాభరితం. ఇలా త్రివేణీ సంగమంలా సాగిన ఈ గేయం రసిక హృదయంగమం. నాయకుని దృష్టిలో నాయిక- 'దివినుండి దిగి వచ్చిన పారిజాతం' నాయిక చూపులో నాయకుడు- 'గుడిలో నుండి వచ్చిన కోటి ప్రభల ప్రతిమ' అంటే దైవం. దైవం-దైవాన్ని అలంకరించే పారిజాతం- నాయకుడూ నాయికా. పారిజాతం నిత్యనూతన సౌందర్య పరీమళాలు గలది. దైవం నిత్యారాధనీయం.

నాయకుడు- అందని జాబిలిలాంటి నాయిక అందాలను పొందాలనుకున్నాడు, పొందాడు. నాయిక- కనరాని దేవుని వంటి ప్రియుణ్ని, కనులతో చూడాలని కలగన్నది తన కల నిజం కాగానే ఆతని కౌగిలిలో కలిసిపోయింది- ఇలా ఇద్దరి కోరికలు తీయగా ఫలించాయి.

చివరి చరణంలో 'కడలి నురగలాంటి నాయిక 'కడలి అంచు' (అంచు= తీరం) లాంటి నాయకుని ఒడిలో కలసి, మురిసిపోవాలనే ఆశతో రావడం" అనే రమణీయ భావన ప్రశ్నోత్తరాల రూపంలో సాగడం విశేషం.

ఈ గీతికాసౌందర్యం మాటలకందదు, మనసా ఆనందించవలసిందే. భావరాగ సరస సంగమం ఈ గీతం.

పల్లవి:

నడిరేయి ఏ జాములో- స్వామి
నినుచేర దిగివచ్చునో- తిరుమల
శిఖరాలు దిగివచ్చునో
మముగన్న మాయమ్మ అలివేలు మంగమ్మ- ॥మము॥
పతిదేవు ఒడిలోన మురిసేటి వేళ- స్వామి
చిరునవ్వు వెన్నెలలు కురిసేటి వేళ

విభునికి మామాట వినిపించవమ్మా!
ప్రభువుకు మా మనవి వినిపించవమ్మా... ॥నడిరేయి॥

చరణం-1

ఏడేడు శిఖరాలు నేనడువలేను
ఏపాటి కానుక లందించలేను
వెంకన్న పాదాలు దర్శించలేను- నేను
వివరించి నా బాధ వినిపించలేను

అమ్మా!

మముగన్న మా యమ్మ అలివేలు మంగా
ప్రభువుకు మా మనవి వినిపించవమ్మా
మముగన్న మాయమ్మ అలివేలు మంగా
విభునికి మా మనవి వినిపించవమ్మా... ॥నడిరేయి॥

చరణం-2

కలవారినేగాని కరుణింపలేవా
నిరుపేద మొరలేవి వినిపించుకోవా
కన్నీటి బ్రతుకులు కనలేనినాడు- స్వామి
కరుణామయుండన్న బిరుదేలనమ్మా!

అడగవె మాతల్లి అనురాగవల్లీ!

అడగవె మాయమ్మ అలివేలు మంగమ్మ... ॥నడిరేయి॥

**వ్యాఖ్య:-** ఈ ప్రార్థనాగీతం 'రంగుల రాట్నం (1967) చిత్రంలోనిది. శ్రీ ఎస్.రాజేశ్వరరావు శ్రీ బి.గోపాలం స్వరకల్పన చేయగా ఘంటసాల జానకి గారలు కలసి గానం చేశారు.

దాశరథి భక్తిగీతాలు బహుళ ప్రచారాన్ని పొందాయి. వాటిలో ఇదొకటి. ఇది సకల జనామోదాన్ని సంతరించుకొన్నది.

'అలివేలుమంగ' నామానికి పూర్వ రూపం– తమిళంలో– 'అలర్‌మేల్ మంగై'- అంటే 'పువ్వులో జన్మించిన యువతి' అని అర్థం. అంటే కమల, పద్మ, పద్మావతీదేవి, పద్మాలయ, శ్రీదేవి.

శ్రీ వైష్ణవ సంప్రదాయంలో భక్తులు మొదట జగన్మాత అయిన శ్రీదేవిని (లక్ష్మీదేవిని) ఆశ్రయిస్తారు. ఆమె ద్వారా జగత్పిత అయిన స్వామి శ్రీవిష్ణువు దయకు పాత్రులవుతారు.

శ్రీదేవి జీవవర్గంచేత ఆశ్రయింపబడుతుంది. ఆమె నిత్యం వల్లభుడైన శ్రీవిష్ణుమూర్తిని (శ్రీవేంకటేశ్వరుణ్ని) ఆశ్రయించి ఉంటుంది. ఆశ్రితుల మాట వింటుంది. ఆర్తుల మాటలను పతికి విన్నవిస్తుంది. సకల దోషాలను పోగొట్టుతుంది. తన గుణాలచే జగమంతా ఆశ్రయించి ఉంటుంది. ఆమె అనుగ్రహం లేకపోతే, ప్రాణులకు ఇహలోక ఐశ్వర్యంగానీ, కైవల్యంగానీ, భగవంతుని కైంకర్యంగానీ– అలా ఏ శ్రేయస్సూ ఉండదు. అందుకే అలమేలుమంగమ్మ శ్రేయోమూర్తి. అందరికీ శరణ్య- భగవానుడైన శ్రీ వేంకటేశ్వరునిలాగా. ఆమె జీవుని దోషాలను విని, స్వామి మనస్సులోని కోపాన్ని తన చల్లని మాటలతో శమింపజేసి, వారిపట్ల, స్వామికి కరుణ కలిగేలాగా ప్రయత్నిస్తుంది. మాతృమూర్తిగా జగన్మాతగా జీవులను కరుణింపజేస్తుంది. ఈ ప్రయత్నాన్ని 'పురుషకారం' అని అంటారు. ఈ పురుషకారాన్ని శ్రీ వైష్ణవ సంప్రదాయజ్ఞుడైన దాశరథి మహాకవి ఈ పాటలో ప్రవేశపెట్టారు.

శ్రీ వేంకటేశ్వరుడు తిరుమల కొండపై అనుక్షణం పూజలందుకుంటుంటాడు. తీరికలేని ఆ స్వామి అలమేలుమంగమ్మ వద్దకు 'నడిరేయి' తిరుమల శిఖరాలు దిగి వస్తాడు. అలమేలు మంగమ్మతో కూడి ఆనందిస్తాడు. ఆ ఆనందక్షణాలలో, ఆ ప్రభువుకు తమ మనవిని విన్నవించుమని ఆర్తులైన భక్తులు ఆ తల్లిని వేడుకుంటారు–

"మేము సప్తగిరులు ఎక్కలేము. కానుకల నివ్వలేము. ఆ స్వామి పాదాలను దర్శించలేము, మా బాధలు చెప్పుకోలేము. కాబట్టి తల్లీ! మా పక్షాన నిలబడి అనురాగమూర్తివై– "నిరుపేదల కన్నీటి బ్రతుకులను కనలేనప్పుడు– 'కరుణామయుడు' అనే బిరుదు స్వామికి ఎందుకో ప్రశ్నించు"మని ఆమెను ప్రార్థిస్తారు.

"కలవారినేగాని... బిరుదేలనమ్మా"– అనే పంక్తులు, కర్తవ్యం మానిన అధికారాన్ని ప్రశ్నించే దాశరథి తిరుగుబాటు వ్యక్తిత్వాన్ని ధ్వనింపజేస్తున్నాయి. ఆయన విప్లవ కవిగదా!

దాశరథి 1960 నుండి 1978 వరకు అనేక చిత్రగీతాలు వ్రాశారు. వాటిలో భక్తికీ, అనుబంధాలకూ, ఆప్యాయతలకూ, స్త్రీలకూ, అభ్యుదయానికీ, బాలల మనస్తత్త్వానికీ, రసావేశానికీ, తాత్త్వికతకూ స్నేహ శృంగార విరహాలకూ హాస్యానికీ సంబంధించిన అనేక గీతాలున్నాయి.

దాశరథి ఉర్దూ సంప్రదాయానికి చెందిన 'ఖవ్వాలి' పాటలు కూడా రచించాడు. 'ఇద్దరు మిత్రులు' చిత్రంలోని– "నవ్వాలి నవ్వాలి నీ నవ్వులు నాకే ఇవ్వాలి", 'పునర్జన్మ' చిత్రంలోని– "దీపాలు వెలిగె– పరదాలు తొలగె" వంటివి అందుకు ఉదాహరణలు. ఖవ్వాలి పాటలకు తెలుగుతనం పులిమాడు దాశరథి.

వీణకై ఆలపించే సందర్భాలకు సంబంధించిన ఎన్నో మంచి పాటలు దాశరథి వ్రాశాడు. ఆత్మీయులు చిత్రంలోని– "మదిలో వీణలు మ్రోగె ఆశలెన్నొ చెలరేగె", 'అమాయకురాలు' చిత్రంలోని "పాడెద నీనామమే గోపాలా"– 'అంతా మనమంచికే' చిత్రంలోని "నేనె రాధనోయి, గోపాలా– అందమైన ఈ బృందావనిలో"– 'మంచి కుటుంబం' చిత్రంలోని "మనసే అందాల బృందావనం– వేణుమాధవుని పేరే మధురామృతం"– 'రెండు కుటుంబాల కథ'లోని "వేణుగానలోలుని గన– వేయి కనులు చాలవులే"– వంటి పాటలు చిత్ర జగత్తులో దాశరథికి వీణపాటల కవిగా మంచి పేరును తెచ్చి పెట్టాయి.

దాశరథి 'రామ్ రహీమ్' చిత్రంలో ఒక హిందీపాట వ్రాశారు.

"యూనానీ హకీమ్ హూఁ
ఈ రాన్‌సే ఆయా హూఁ
బీ మారీ జైసే హో
వైసీ దవా లాయా హూఁ"

అనే పాటను ప్రసిద్ధ మధుర గాయకుడు మహమ్మద్‌రఫీ పాడి దాశరథిని ప్రశంసించాడు.

ఈ విధంగా అంగారం-శృంగారం, భక్తి-అనురక్తి కలిగించే గీతాలెన్నో రచించి దాశరథి సినీగీత రచయితగా చిరకీర్తిని ఆర్జించాడు.

## III. ముగింపు

"తెల్ల కాగితంమీద
నల్లక్షరాలు వ్రాస్తుంది సాదా లేఖిని
నల్లని చీకట్లమీద
నవకాంతి కవితలు వ్రాస్తుంది జ్వాలా లేఖిని

ఈ జ్వాలా లేఖిని లోని
యెర్ర సిరాయే- స్నేహం
ఈ స్నేహ దీపం వెలిగిననాడే
పుణ్యగేహం

..........................................

ఈ జ్వాలా లేఖిని ఆరిపోదు
ఇందులోని చైతన్య మషీపంకం ఇంకిపోదు"

('జ్వాలాలేఖిని'లోని -'జ్వాలాలేఖిని'లో)

**అర్థాలు:-** సాదా= సాధారణమైన, సామాన్యమైన; లేఖిని= వ్రాసే కలం; జ్వాలాలేఖిని= మంట అనే కలం, మంట రూపంలో ఉన్న కలం; స్నేహదీపం= చెలిమి అనే దివ్వె; పుణ్యగేహం= పవిత్రమైన ఇల్లు, ధర్మభవనం, మనోజ్ఞమైన గృహం; చైతన్య మషీపంకం= తెలివి (ప్రాణం) అనే సిరా తడి (పంకము= బురద, పాపం; సిరా= మషి= మసి, Ink) ఇంకిపోదు= ఇనికిపోదు, తడిలేకుండా పోదు- ఎండిపోదు, ఇగిరిపోదు.

**వ్యాఖ్య:-** సాధారణమైన కలం తెల్లకాగితం మీద నల్లని అక్షరాలను వ్రాస్తుంది. కాని జ్వాలామయంగా ఉన్న కలం మాత్రం కొత్త కొత్త వెలుగుల కవితలు వ్రాస్తుంది. ఆ కలం జ్వాలామయం కాబట్టి, ఆ కలంలోని సిరా ఎఱ్ఱగా ఉంటుంది. ఆ ఎఱ్ఱని సిరాయే స్నేహం. అలా స్నేహదీపం వెలిగిన స్థలం ఒక పవిత్ర గృహం అవుతుంది. సామాన్య దీపం ఆరిపోతుంది. జ్వాలాలేఖిని ఆరిపోదు. ఆ లేఖినిలోని చైతన్యమయమైన సిరా ఇగిరిపోదు, ఎండిపోదు, ఇంకిపోదు.

దాశరథి కాలాన్ని జయించిన కవి. 'కాలం నా కంఠమాల' అని అనగల్గిన కాలమర్మజ్ఞుడు. ఏ సిద్ధాంతాలకూ ఏ ఇజాలకూ అమ్ముడుపోని స్వేచ్ఛా విహారి. కాల్పనికతనూ అభ్యుదయాన్నీ నవ్యసంప్రదాయాన్నీ జాతీయతనూ సామ్యవాదాన్ని ప్రజాస్వామ్యాన్ని విశ్వమానవతనూ శాంతి విప్లవ చైతన్యాన్ని అన్నింటినీ తన విశ్వవిపుల కవిత్వ ప్రపంచంలో పొదుగుకొన్న కవితామూర్తి దాశరథి. "చరిత్రకు అప్రమత్త జాగరూక నయనాలు" ఇచ్చిన చరిత్ర పురుషుడు. ఆధునిక తెలుగు సారస్వతంలో సమున్నత స్థానాన్ని సంపాదించుకొన్నవాడు.

"జయంతితే సుకృతినో రససిద్ధాః కవీశ్వరాః
నాస్తి తేషాం యశః కాయే జరామరణజం భయమ్"
(భర్తృహరి సుభాషితమ్)

"సుకృతాత్ములు రససిద్ధులు
సుకవీంద్రులు, విజయనిధులు సుమ్ము తదీయా
ధిక కీర్తి శరీరంబులు
ప్రకటజరామరణజన్మభయ రహితంబుల్" (ఏనుగు లక్ష్మణకవి అనువాదం)

రసానుగుణంగా వర్ణించే నైపుణ్యం ఉండడంవల్ల ధన్యాత్ములైన కవీశ్వరులు, జరామరణాలు లేనట్టి తమ కీర్తి శరీరాల చేత సర్వదా ప్రకాశిస్తుంటారని పై శ్లోక పద్యాల భావం.

లోక బాంధవుడైన రవికి ముసలితనం లేదు, మరణం లేదు. వైతాళికులూ లోకోద్ధారకులూ విశ్వశ్రేయోదాయక కావ్యస్రష్టలూ అయిన కవులకు జరలేదు, మృతి లేదు. దాశరథి పట్టుకున్నది జ్వాలాలేఖిని. అది కాంతి కవితలు వర్షించింది– కారు చీకట్లమీద. ఆ లేఖినికి మృతి లేదు.

శివసుందరంగా పలికిన దాశరథి మాటలు అగ్నిసత్యాలు, ఆణిముత్యాలు. దాశరథి వాణి అమరం, ఆ రససిద్ధుని యశఃకాయం జరామరణ రహితం. భవిష్యత్తులో తరతరాలు యుగయుగాలు దాశరథి కవితా సుధాశరధి తరంగాలు సహృదయుల అంతరంగాలను కదిలిస్తూనే ఉంటాయి; తెలుగు కవితామాధురిని అందిస్తూ అలరిస్తూనే ఉంటాయి. ఆతని కవితా రవి కిరణాలు జగత్తును మేల్కొలుపుతూనే ఉంటాయి.





# యువభారతి
## సాహితీ సాంస్కృతిక సంస్థ
### అందుబాటులో ఉన్న మా ప్రచురణలు

| ప్ర.సంఖ్య | పుస్తకం పేరు | వెల.రూ. |
|---|---|---|
| 7 | కావ్యలహరి | 150.00 |
| 17 | మందార మకరందాలు | 50.00 |
| 19 | ప్రజాసూక్తం | 50.00 |
| 21 | భోగినీలాస్యం | 50.00 |
| 29 | భావన | 50.00 |
| 95 | మాఘ కవితా వైభవం | 5.00 |
| 100 | సంస్కృత సాహితీ లహరి | 20.00 |
| 105 | చిలకమర్తి కవితా వైభవం | 5.00 |
| 109 | వ్యాస సూక్తం | 8.00 |
| 110 | వ్యాస సాహితీ సంహిత | 20.00 |
| 115 | జగద్గురు సాహితీలహరి | 20.00 |
| 116 | బాబా ఫరీద్ సూక్తులు | 5.00 |
| 119 | తెలుగు బాలసాహిత్యం | 5.00 |
| 121 | నవ్య సాహితీ లహరి | 20.00 |
| 125 | ఈ దశాబ్దంలో తెలుగు సాహిత్యం(1980-90) | 20.00 |
| 127 | యువత | 25.00 |
| 132 | ఇరివెంటి రచనలు | 25.00 |
| 141 | అనుభూతి | 20.00 |
| 145 | కొత్త గొంతుకలు-సరికొత్త విలువలు | 25.00 |
| 146 | మానవతా మూల్యాలు | 25.00 |
| 149 | సాహితీ సమాలోచనం(1992-93) | 30.00 |
| 150 | తెలుగు తమిళ కవిత్వాలు-జాతీయవాదం | 25.00 |
| 160 | విశ్వనాథ సాహితీ సమాలోచనం | 100.00 |
| 162 | స్వాతంత్ర్య స్వర్ణభారతి | 20.00 |
| 163 | దివాకర్ల వేంకటావధాని | 150.00 |
| 167 | నవజీవనం | 30.00 |
| 175 | మరో జంఘాలశాస్త్రి | 140.00 |
| 176 | వేద విజ్ఞాన లహరి | 100.00 |
| 177 | విజయానికి అభయం | 30.00 |
| 178 | ఉపనిషత్ సుధాలహరి | 160.00 |
| 179 | వ్యక్తిత్వ వికాసం - సూత్రాలు - సూక్తులు | 50.00 |
| 180 | దివాకర ప్రభ | 50.00 |
| 181 | ప్రభావం | 50.00 |






శ్రీ కల్వకుంట్ల చంద్రశేఖర్ రావు
**తెలంగాణ ముఖ్యమంత్రి**

# తెలంగాణ రాష్ట్రం - కావాలి దేశానికే ఆదర్శం!

స్వతంత్ర భారతదేశ 29వ రాష్ట్రంగా ఏర్పడిన తెలంగాణను ఆదర్శ రాష్ట్రంగా తీర్చిదిద్దుకోవడం మన బాధ్యత.

తెలంగాణా రాష్ట్రాన్ని సకల రంగాలలో సర్వోన్నత, సమున్నత రాష్ట్రంగా తీర్చిదిద్దుకుందాం.

## తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వ సంక్షేమ కార్యక్రమాలు

- అమరవీరుల కుటుంబాలకు రూ.10 లక్షలు, అర్హులైన కుటుంబ సభ్యుల్లో ఒకరికి ప్రభుత్వ ఉద్యోగం, వ్యవసాయంపై ఆధారపడిన అమరవీరుల కుటుంబానికి భూమి
- రైతులకు రూ. లక్ష రుణమాఫీ
- నిరుపేద దళిత కుటుంబానికి భూపంపిణీ పథకం ద్వారా మూడెకరాల భూమి.
- కేజీ నుంచి పీజీ వరకు ఉచిత, నిర్బంధ విద్య
- షెడ్యూల్డ్ కులాల కుటుంబాల ఉన్నతి కోసం ఐదేళ్ల లోగా రూ.50,000 కోట్ల వ్యయం
- వెనుకబడిన తరగతుల ఉన్నతికి ఐదేళ్ల లోగా రూ.25,000 కోట్ల వ్యయం
- ఎస్టీలకు 12 శాతం రిజర్వేషన్లు, గిరిజన ఆవాసప్రాంతాలకు గ్రామపంచాయతీలుగా గుర్తింపు
- బలహీన వర్గాలకు అన్ని సదుపాయాలతో 2-బెడ్‌రూమ్‌ల ఇళ్ళు
- మైనారిటీలకు రూ.1000 కోట్ల బడ్జెట్, 12 శాతం రిజర్వేషన్లు
- వృద్ధులకు వితంతువులకు రూ. 1000 పింఛను, వికలాంగులకు రూ. 1500 పింఛను
- పూర్తిస్థాయి వై-ఫైతో గ్లోబల్ సిటీగా హైదరాబాద్
- ఎలక్ట్రానిక్ హార్డ్‌వేర్ మాన్యుఫాక్చరింగ్ యూనిట్స్ హబ్ ఏర్పాటు చేసేందుకు ఐటీఐఆర్ ప్రాజెక్టుకు ప్రత్యేక హోదా
- ప్రతి దళిత, గిరిజన ఆడపిల్ల పెళ్ళికి కళ్యాణలక్ష్మి పథకం ద్వారా రూ. 51 వేల ఆర్థిక సాయం.









